

అగజానన పద్మార్కం, గజానన మహర్నిశం
అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే

ఫొటో ఎస్ వెంకట కృష్ణన్ - మద్రాసు


ఊపిరి తిత్తులు, గుండె భేషుగ్గా ఉన్నాయి,
అయితే M విటమిన్ ఒకటేలోపం!

సంవత్సర చందా
రు. 18-0-0
విడిపత్రిక 25 న.పై.



# సచిత్ర వారపత్రిక

Founder: K. NAGESWARA RAO

సంపుటము 52
సంచిక 1
28-8-57

హేవిళంబి భాద్రపదం, బహుళ తృతీయ, బుధవారం

## హాస్యసంచిక: విషయానుక్రమణిక



### మనవి

సీరియల్‌గా ప్రకటిస్తున్న "విక్రమార్కుడి మార్కు సింహాసనం", "అనంతపేత్యకారిత్వము" అనే రెండు శీర్షికలు ఈవారం స్థలాభావంచేత నిలిపివేస్తున్నాము. వచ్చేవారంనుండి అవి యథాప్రకారం ప్రచురిస్తాము.
—సంపాదకుడు.

## ఒకమాట

వినాయకచవితికి హాస్యరస ప్రధానమైన ప్రత్యేకసంచిక ప్రచురిస్తున్నామని ప్రకటించగానే, ఆంధ్రదేశం నలుమూలల నుంచీ మా కార్యాలయానికి రచనలు పరంపరగా రాసాగాయి. వందలాది రచయితలు కథలు, వ్యాసాలు, గేయాలు, చిత్రకారులు చిత్రాలు పంపించారు. వీటిలో ఉత్తమమని తోచిన కొన్నిటిని ఏరి ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

ఒకటే తీరని కొరత ఉండిపోయింది. చక్కని హాస్య సన్నివేశం తీసుకొని కవరు పేజీకి తగిన వర్ణచిత్రాన్ని పంపమని మేము చేసిన విజ్ఞప్తి ననుసరించి ఆశించినంతగా మంచి చిత్రాలు రాలేదు. అందుచేత విఘ్నేశ్వరునికి సంబంధించిన చిత్రమే—శ్రీమతి శ్యామసుందరీదేవి పంపినది—ప్రచురించాము.

హాస్య సంచికకోసం వచ్చిన రచనలలో ప్రచురణార్హమని తోచిన వాటిని వారం వారం ప్రచురిస్తూ ఉంటాము. హాస్యసంచికను జయప్రదం చేయడంలో మాతో సహకరించిన రచయితలకు, చిత్రకారులకు మా కృతజ్ఞత.

ఆంధ్రపత్రిక వారపత్రికగా అవతరించింది యాభైఏళ్లక్రితం వినాయకచవితి పర్వదినానే. ఈ పర్వదినయాన్ని పురస్కరించుకొని మేము ప్రచురించిన ఈ హాస్య సంచికను చదివి పాఠక మహాజనులు ఆనందిస్తారని ఆశిస్తున్నాము.

—ఎడిటర్]

"సోదరులారా! మధ్యాహ్నం వేళ దొడ్లోవున్న చెట్లక్రింద చేరి మనం చెడుగుడు ఆడుతూ వుండటంవల్ల, అది తనకు నిద్రాభంగంగా వుందని మా మావయ్య తలవాచేటట్లు చివాట్లు వేసి, 'ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరుగుతున్న ఈ రోజుల్లో, ఇన్ని కమ్యూనిటీ ప్రాజెక్టులు ఇన్ని ప్రాంతాల ప్రజానీకాన్ని తెగ ఉద్ధరిస్తూ వున్న ఈ రోజుల్లో కనీసం, ఒక సాహిత్య సంఘానన్నా స్థాపించి, ఇతరులను కొంకపోయినా, మన్ని మనం ఉద్ధరించుకో లేకపోవటం కటిక చేతగానితనమని ఆయన మన్ని హెచ్చరించిన కారణంగా ఈ సాహిత్య మహాసభను మనం స్థాపించుకున్న సంగతి సభ్యు లందరికీ తెలుసు. కనీసం మనుచరిత్రన్నా పాఠం చెప్పకో కుండా సాహిత్య గొడవల్లోకి దిగటం బాగుండదని ఆయనకు మనవిచేశాం. ఆయన మా అజ్ఞానానికి పకపకా నవ్వి: రసార్ణవమైన సాహిత్యరంగంలో ప్రవేశించి దాన్లో మునిగి తేలేవాడికి మెదడు చెడుతుందనీ, ఇక సంఘాలూ సమావేశాలూ ఈ గొడవుండదనీ జ్ఞానబోధ చేసిన కారణంగా చదువు సంధ్యల ప్రమేయం విసర్జించాం. (హియర్ హియర్!—హర్షధ్వానాలు) మావయ్య సలహా సంప్రదింపులతో కొన్ని తీర్మానాలు తయారుచేశాం. వాటిని సభ్యు లందరూ కిమ్మనకుండా ఆమోదిస్తారని ఆశిస్తున్నాం—

(1) వారం వారం ఒక సాహిత్య మహాసభ జరపాలి. (హాలు దొరక్కపోతే, మనం చెడుగుడు అడుకునే మావయ్యగారి దొడ్లో జామిచెట్టు క్రిందనే బహిరంగ సభగా యేర్పాటు చెయ్యవచ్చు) ఆ సభకు ఒక మంత్రిని అధ్యక్షుడుగానూ మరొకర్ని ప్రారంభకులుగానూ పిలవాలి. వారికి సాహిత్యంలో ప్రవేశముందా లేదా అనే ప్రమేయం అక్కర్లేదు. ప్రవేశం లేనివారికి ప్రవేశం కల్పించటంకంటే మహత్కార్యమేముందిగనుక"—

'మనం పిలిస్తే మంత్రులు వస్తారా?'

'రాకేం జేస్తారు? ఇది మరేం డెమోక్రసీనా? మజాకానా?'—

'సాహిత్యరంగంలోకి అధికార ప్రాబల్యం తీసుకురావటంవల్ల కలిగే ప్రయోజనమేమిటి?'

'ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరుగుతున్నదన్న విషయం తెలిసికూడా ఏమిటీ అవివేకం?—సిడ్డౌన్'—

'ఇక రెండవ తీర్మానం—ఈ తీర్మానానికిముందు కొంత ఉపోద్ఘాతం చెప్పవలసి వుంది. ఇంతవరకూ మనం ఎవరం ఎట్టి మహాగ్రంథాలూ రచించలేదు. అయినా కొంత

# పల్లకీ

మంది 'ట్రై'జేసి చూశాం. ఏదో తోచిన పిచ్చాపాటీ కొన్ని ఎక్సర్‌సైజ్ పుస్తకాలు చెడగొట్టి, చెలిచవురు భాగోతంతో అచ్చుకూడా వేయించాం. వాటిని కొనే దిక్కులేదు సరిగదా ఉరికేయిస్తే చదివే దిక్కులేదు. కొంతమంది 'రాస్కెల్స్' వున్నారు. వాళ్లేచెత్త వ్రాసినా జనం కొని చదువుతారు. అందుచేత వాళ్ళు ఈ సాహిత్య సంఘాలెందుకు పొమ్మంటారు'—

'డౌనవిత్ ది రాస్కెల్స్!—డౌన్:—డౌన్!'—

'సాహిత్య సంఘాలూ లేక, అచ్చేసే సాధుడూ లేకపోతే మనం రచించే ఎక్సర్‌

## 'శ్రీరపాణి'

సైజు పుస్తకాల గతేంకావాలి? సొంతంగా అచ్చేస్తే దేశంలో యే పంచాయితీ గ్రంథాలయం వీటిని మూజాస్తుంది? అందుచేత అధికార ప్రాబల్యం నశించాలనే రాస్కెల్స్ నశించాలనేది రెండవతీర్మానం.

మూడవతీర్మానం: మనం యింతవరకూ కవ్మరంతులుగా వున్నాం. మనమెవరమో దేశంలో ఎవడికీ తెలీదు. అందుచేత మనకి మనమే తెలివిడి చేసుకోవాలి. ఇందుకు మావయ్య ఒక చిన్న సలహా యిచ్చారు. మనం జరిపే వారసభల్లో వారానికి ఒకడికి చొప్పున మనలో ప్రతిఒక్కడికీ సన్మానం చెయ్యాలి. అంటే ఒకణ్ణి పల్లకీలో ఎక్కించి మిగతా మనమంతా మొయ్యాలి'—

'పోనీ బోయీలచేత మోయిస్తేనేం?'

'పల్లకీ అయితే తను ఊరికే ఇప్పించగలనుగాని—బోయీలకు డబ్బు యివ్వాలి పొమ్మంటున్నాడు మావయ్య!—అయినా యిందులో దోసమేమీ లేదు-కృష్ణదేవరాయలంతవాడు పెద్దన పల్లకీ మోశాడు'—

'సోదరులారా! కార్యదర్శి ప్రతిపాదించిన మూడు తీర్మానాలూ అమోఘంగా వున్నాయి. మొదటివారం సన్మానం, మీ అందరిలోకి గొప్పవాణ్నయిన నాకు జరిగితే సెబాసుగా వుంటుంది'—

'శ్రాద్ధయోగ్యంగా వుంటుంది—అపర కాళిదాసును నేనిక్కడ వుండగా ఆ పప్పులేం వుడకవు—ఇదేం జామికాయల దొంగతనం అనుకున్నా వేమిటి గజేకారిలా వున్నావని ఘనత ఏడవటానికి'—

'ఛీ! వీళ్ళిద్దరికీ బుద్ధిఅనేది ఏకోశానన్నా వుందేనా? 1945 లోనే మనం రాసిపారేసిన మహాకావ్యం వెంకయ్యగారి అచ్చాఫీసులో, ఇప్పటికీ అలానే గుట్టలుబడి వుందని

(16 వ పేజీ చూడండి)

# విచిత్రాల్లో విచిత్రం!
# నోరులేని విలేఖరి



విలేఖరి, పత్రికారచయితల్లో సొమాజిక సదవి లేని ఒకడు. 'వస్వరంతి' గాడు కాడు కానీ, వట్టి 'వస్వరంతి'. చెప్పడుమాటలుతప్ప మరేమీ వినడు! అలాటిది ఉద్యోగమో కాదో నాకు తెలియదు, ఈనాటికీ. అనుభవంకూడా నాకు విప్పిచెప్పింది ఏమీలేదు.

నా విలేఖరిత్వానికి ప్రారంభోత్సవం ఒక ఆంగ్ల వారపత్రిక ప్రారంభోత్సవాన్ని 'విలేఖరించడం'తో ప్రారంభమయింది. తీరా ఆ వారపత్రిక ద్వితీయసంచిక రాలేదు! నాకు ప్రాణం చివుక్కుమన్నది—నాతో పాటు జీవితం ప్రారంభమయినదానికి ద్వితీయ విఘ్నం సంభవించిందికదా అని. ఆ సంపాదకుణ్ణి అడిగాను "ఏమండీ మీపత్రిక ద్వితీయ సంచిక రాలేదే?" అని చాలా ఆదుర్దాతో. ఆయన "అసలు మొదటిసంచికే రాలేదే!" అన్నాడు. "అయ్యో! మొన్న ప్రారంభోత్సవానికి నేనూ వచ్చాను. మీరు పత్రికలను పంచిపెట్టగా కూడాను!" అని గుర్తుచేశా. ఆయన నా తెలివితక్కువతనానికి ఒక ముసిలా నవ్వునవ్వి "సరి! అది ప్రారంభోత్సవ సంచికోయ్! వస్తుంది మొదటి సంచిక త్వరలోనే" అన్నాడు.

నేను చాలా దిగులుపడ్డాను. పదేళ్లయింది. ఆ దిగులు వదలలేదు. ఆ పత్రిక మొదటి సంచిక ఇంతవరకూ రాలేదు. నా ఉద్యోగం ప్రతిరోజూ ప్రారంభోత్సవం తంతుగానే ఉంది—నేను ఎదగలేదు! పైగా ఆ ఆంగ్ల వారపత్రిక ప్రారంభోత్సవ వ్యవహారం తల్చుకుంటుంటే, మరింత దిగులు కలుగుతూ ఉంటుంది.

ఆ పత్రికను భారతమహాజనాలకు విజ్ఞానం కలిగించడానికి ఒక 'జనరలిస్టు' పెట్టాడు. ఒక పెద్ద రాజకీయవాదిచేత ప్రారంభోత్సవం చేయించాడు. ఆ రాజకీయవాది పెద్దల్లో పైకి వచ్చినవాడు కానీ, యువకుల్లో కాడు. ఆయనకు రాజకీయాలుతప్ప విజ్ఞానం వేరే ఉన్నట్టు నాకు తెలియదు. ఆయన ఇలా ఉపన్యసించాడు:

"సోదర సోదరీమణులారా!—సోదరీమణులు లేరు కొమాల్లు!—(నవ్వులు) ఊ! ఉండరులే! సోదరులారా! పూర్వం—ఋషులూ—అంటే మునులూ, పురాణాలూ వ్రాశారు—వాళ్ళకి కవనం వచ్చుకాబట్టి. వాల్మీకి—రామాయణం రాశాడు. మీకు తెలుసు. భారతం—రాశాడు—మరొకడు! మన మిత్రుడూ—ఇవాళ—ఇక్కడ ఒక పత్రిక పెడుతున్నాడు—మంచివాడు—పైకి రావలసినవాడు—(చప్పట్లు)—నేనూ చెప్పాను—మంచిపని అని—" ఇలా రాత్రి పదిన్నర దాకా ఉపన్యాసం చెప్పాడు. ఆరాత్రి ఇంటికిపోవడానికి బస్సు దొరకలేదు—ఏ హోటల్లోనూ నాకు అన్నం లేదు. దేవుడా అంటూ నాలుగుమైళ్ళు నడుచుకుంటూ ఇంటికిపోయాను.

ఇన్ని జరిగినా, నా ఉద్యోగ ప్రారంభోత్సవానికి దుశ్శకునం కలిగిందనుకోలేదు. కానీ, రెండో సంచిక రాలేదే అనే బాధుర్ర.

కొందరు మిత్రులు చెప్పారూ—'ఆ ప్రారంభోత్సవంలో కనపడ్డ విఘ్నాన్ని దాటిపోవు నీ జీవితంలో' అని. అదీ ఒక దిగులేగానీ, అసలు ఉద్యోగం ఉంటే వెధవ విజ్ఞానం ఎందుకులే అనే ధైర్యం ఉంది. ఉద్యోగంకానీ ఉండవలసింది, విజ్ఞానమా! నేను ప్రపంచాన్ని ఉద్ధరిస్తానా పాడా! ఏదో—ఉద్యోగం పురుషలక్షణమన్నారు. ఉద్యోగంకోసం పట్నంవచ్చి అమాంబాపతు వాట్లా కాదికోను.

నాకు వ్రాస్తూఉంటే ఉద్యోగమే వస్తుందని జ్యోతిష్కులు చెప్పారు. అంటే ప్లీడరుగుమాస్తాగానీ, షావుకారు గుమాస్తాగానీ, రిజిస్ట్రారు ఆఫీసు గుమాస్తాగానీ కావచ్చు. మహా గ్రంథరచయితను కావచ్చు. వ్రాతలు కోతలు లేని ఉద్యోగం ఏముంటుంది గనక—ఒక్క రాజకీయవాదికి మాత్రం వ్రాతలు కొత్తలోపం.

కానీ సొంతంగా వ్రాస్తానేమో అనుకున్నాను—చెప్పడు మాటలు వ్రాస్తానని ఏనాడూ అనుకోలేదు. నా వ్రాతచూసి ఏషావుకారూ నేను పనికివస్తాననుకోలేదు. ఆఫీసుల్లో నా వ్రాత అక్కర్లేదన్నారు—దానికి యంత్రాలే ఉన్నాయన్నారు. ఎక్కడా పనికిరావని తేలి ఈ ఉద్యోగంలో చేరాను. తీరా దాని ప్రారంభోత్సవం ఇలా మొదలైంది. ఏనాడో ప్రారంభోత్సవం ఋతువు అయిపోతుంది. తర్వాత!

నందో రాజా భవిష్యతి!

నాకు ప్రారంభోత్సవదశ వదలలేదనడానికీ, ఆ ప్రారంభకష్టాలు వదలలేదనడానికీ నిదర్శనంగా తర్వాత తర్వాత అనేక సంఘటనలు జరిగాయి.

ఒకసారి—

ఒక ఊళ్ళో—ఆ ఊళ్ళో పోలీసు బలగం చాలా ఉంది—ఒకనాటి ఉదయం, తమ బలగంలో కొంతమందిని ఎవ్వరో భలాబాటోట ఎత్తుకొనిపోయినట్లు అధికార్లకు వార్త వచ్చింది. అంతే! నానాఖంగారూ పడ్డారు. ఆఖంగారు నాకళ్ళపడింది. లారీల్లో పోలీసుల్ని అడ్డమైన ఆయుధాలతో ఎక్కించి భలాబాటోటుకు పంపించేస్తున్నారు. ఆతర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదుగానీ, ఇలా కొందరు పోలీసుల్ని భలాబాటోట ఎవ్వరో ఎత్తుకునిపోయినట్లు విలేఖరించాను.

ఆమర్నాడు—

పోలీసు అధికారి 'ఆవార్త సరికాదు' అని ఒక సవరణ పంపమన్నాడు. "పంపుతాను—సవరణకు ఒక వివరణ సెలవిస్తే" అన్నాను. "ఏముంది—తీరా మావాళ్ళని ఎవరూ ఎత్తుకుపోలేదని తెలుసుకున్నాము. అందరం అక్కడికిపోయి గాలించి వచ్చేశాము. ఎవళ్ళనీ ఎవరూ ఎత్తుకు పోలేదు. ఇలా ఒక సవరణపంపండి" అని చెప్పాడు.

జి. కృష్ణ

"ఎంతమందివెళ్లారు ఈ గాలింపుకోసం?" అని అడిగాను.

"అందరమూ" అన్నాడు.

అయితే ఇది మంచి రసవత్తరమైన కథే అనుకున్నాను, గజంమిథ్య- పలాయనం మిథ్య—

ఆ అధికారి తీరా వినుకున్నాడో— "శాబోయ్—సవరణవద్దు—వివరణా వద్దు— ఇది చాలు. ఇక్కడితో ఆగండి!" అన్నాడు.

అంతే నే పంపినవార్తకు సవరణగానీ సంస్కారంగానీ లేకుండా పోయింది. ఆ వార్తను అబద్ధమన్నా కాదే—నిజమన్నా కాదే—

విలేఖరి ఉన్నదిఉన్నట్టు వ్రాయాలని ఒక చదువుకున్నాయన నాకు నూరిపోశాడు, ఒకసారి. ఆయన ఒక కులసంఘానికి కార్యదర్శి. విలేఖరి వింటూఉండాలి—చూస్తూ ఉండాలి—అంటే కళ్లూ చెవులూ అప్పగించి. అంతే చేశాను. నాకు తాను గురువు లాంటివాడినని చెప్పుకున్నాడు, విన్నాను. నిజమే, ఆయన నాకు "సత్యం విద్య" ఉపదేశించాడు.

కొన్నాళ్ళకు వాళ్ళకులం సభజరిగింది. 'విలేఖరించడానికి' వెళ్ళాను. "జాతిపితకు వందనము లాచరించి" అని వారి మొదటి తీర్మానంలో ఒకమాట వచ్చింది. అమాంతం ఒకరులేచి "ఆయన మనజాతిపిత కాదు" అన్నాడు. జాతివేరూ, కులంవేరూ అని కార్యదర్శి నచ్చచెప్ప జూశాడు, కుదరలేదు. గంటసేపు రభస జరిగింది. సభ అయిపోయింది.

నేను ఏమి విలేఖరించాలి? పైగా ఆ కార్యదర్శి నాకు "సత్యం విద్య" నేర్పిన వాడుకూడాను!

నేను ఏమీ వ్రాయనేలేదు.

ఆయన సంతోషించాడు-సత్యం వ్రాయనందుకు!

విలేఖరిగా ఎక్కడికైనాపోతే - ఆమాటకొస్తే విలేఖరి 24 గంటలూ విలేఖరే-"ఇదిగో! ఈ విషయం రాసేసుకో!" అని కొందరు అదలిస్తూ ఉంటారు - విలేఖరికి వేరే పనేముంది గనక!

అలా వ్రాయని సంగతులు అనేకం ఉంటాయి, ముచ్చటైనవి.

ఈమధ్య ఒక విదేశీయుని ఇంటికి విందుకు వెళ్ళాను. విందులో పత్రికా ప్రతినిధులు, ఆ 'గెస్టు,' ఆయన భార్య - వెరసి 13 మంది అయ్యారు! చాలా చెడుసంఖ్య. జంటలు జంటలుగా పడి మాట్లాడేసుకుంటున్నారు - నేను ఒక్కణ్ణే వేరేవాడుగా మిగిలిపోయాను. ఆ గదినిచూస్తూ కాలక్షేపం చేయసాగాను- జంటలు మాట్లాడుతుంటే పుట్టే రణగొణ ధ్వనిలో, నిశ్శబ్దంగా.

ఆ గెస్టు ఇంటిలో బోలెడు పుస్తకాలు, నేను చదివినవీ, చదవనివీ, పేర్లు విన్నవీ, విననివీ ఉన్నాయి. 'ఆదం' బొమ్మ ఒకటి ఉంది - బొమ్మలవరకూ మాత్రమే వేసిన చిత్రం. బతుకు జీవుడా!—ఈ 'ఆదం' కు బొడ్డులేదనుకున్నాను. ఆదంకు బొడ్డు ఉందా లేదా అని పాశ్చాత్య మతవిజ్ఞులు చిరకాలంగా తర్జన భర్జన చేస్తున్నారు. అది ఇంకా తేలనేలేదు.

ఆ గెస్టును అమాంతం కదలేసి, "ఈ ఆదంకు బొడ్డులేదు!" అన్నాను. అతగాడికి అర్థం కాలేదు.

"అంటే?" అన్నాడు. నేను మరేమీ అనలేదు.

ఈలోగా ఆ గెస్టూ మరోదూ మాట్లాడుతున్నారు. నేనూ ఈలోగా మరో చిత్రం వైపు చూపులు వదిలాను. ఆ చిత్రం 'ఇద్దరి గుసగుసలు!" ఇద్దరివీ బట్టతలలే — మధ్య డొంక-ఇటూ అటూ మసిపట్టినట్టాయి గడ్డల్లాగా జుట్టు. ఎంత తీక్షణమైన రహస్యాలో గానీ, వాళ్ల (ఒకపక్క) కనుబొమలు ఆ పాయిగడ్డల్లోకి బాణాల్లాగా పొడుచుకు పోతున్నాయి. ఒకడి మూతి వంకర తిరిగింది. మరొకని మూతి ముడుచుకునిపోయింది. భలేబాగుంది. రహస్యం రగిలిపోతోంది!

"అది బాగుంది!" అని మళ్ళీ గెస్టును కదలేద్దామనుకుంటూ ఉండగా, ఆ గెస్టుతో ఒక విలేఖరి ఇలా మాట్లాడుతున్నాడు—

విలేఖరి : డా॥ రాధాకృష్ణన్‌కు వేదాంతం ఏమీరాదు; మీకు తెలియదు ఆ సంగతి.

గెస్టు : అరె—అట్లాగా!

విలేఖరి: రాధాకృష్ణన్‌కు పేరువచ్చింది—అంతే—అదో అదృష్టం-గాంధీ, నెహ్రూ, అలా చేశారులెండి. మీకు ఎలా తెలుస్తుంది ఆ సంగతి?

గెస్టు : అరె—అదేమిటి! తమాషాగా ఉంది— (అని ఏదో చెప్పబోతుండగా)

విలేఖరి : రాధాకృష్ణన్‌కు మా తాతయ్య వేదాంతం నేర్పాడు. మా తాతయ్య పెద్ద పండితుడులెండి.

గెస్టు : మీ తాతయ్యపేరు?

నాకు నవ్వొచ్చింది. నవ్వాను. ఆ గెస్టు నావంక తిరిగి, "క్షమించాలి-మీతో ఎవ్వరూ మాట్లాడడంలేదు!"

నేను : ఫరవాలేదు-ఆ గుసగుసల బొమ్మ బాగుంది.

గెస్టు : మీరు బొమ్మలూ, పుస్తకాలూ చూస్తూ కాలక్షేపం చేస్తున్నారు, మాట్లాడకుండా!

నేను : ఇక్కడ సరి సంఖ్య లేదు. అదీ పేచీ. లేకపోతే మాట్లాడడానికేముందీ— వింటున్నాను.

గెస్టు : మీకు ఆ గుసగుసలబొమ్మ ఇవ్వాలని ఉంది-తీసుకుంటారా? తీసుకోండి. అది గాంధీజీ 'కోతులు' వంటిది కాదు-అంత మంచిదికాదు కానీ-మీరు వినడానికీ, చూడడానికీ మాత్రమే పుట్టినట్లుంది-తప్పక తీసుకోవాలి.

ఇక నేను ఆ బొమ్మనుచూసి ఏదో తత్వం కల్పించుకోవడం ప్రారంభించుకోవాలి— జీవితం అంతా ప్రారంభోత్సవాలేకదూ—

నాకా బొమ్మ వద్దన్నాను. అసలు రహస్యం ఆ 'ఇద్దరి గుసగుసలు' నాకేలా అర్థమవుతాయి? అర్థమయ్యేదాకా తిరగాలి, వృత్తిధర్మాన్ని అనుసరించి. జీవితంలో ప్రారంభోత్సవమే పూర్తికాలేదు - రహస్యాలు తెలుసుకునే వ్యక్తిత ఎలాసాధ్యం? ★



# యమభాగోతం!

ఇప్పుడంటే సరదాలన్నీ చచ్చి పూరుకున్నవిగాని, చిన్నప్పుడు నాటకాలన్నా, వీధి భాగోతాలన్నా, తోలుబొమ్మలాటలన్నా నాకు మహా సరదాగా వుండేది. మహా సరదా ఏమిటి, యమ సరదా అంటే నమ్మండి! మా వూళ్లో వేసిన వీధి భాగోతాలను చూసి మాత్రమే ఆనందించేవాణ్ని; నాటకాలు, తోలుబొమ్మలాటల విషయంలో మాత్రం అలా కాదు. నలుగురు తోటిపిల్లలనూ కూడదీసి ఏదో ఒక నాటకం స్వయంగా ఆడితేనేగాని సరదా తీరేది కాదు; పుస్తకాల మీది అట్టలు, లోపలి కాగితాలు అన్నీ చించి వాటిమీద పంచపాండవులుగా, రామలక్ష్మణులుగా ఏవేవో బొమ్మలువేసి కత్తిరించి ప్రమిదదీపాల వెలుతురులో తెరమీది కెక్కించి ఆడిస్తేనేగాని మనసు తీరేది కాదు. వెధవ అట్టబొమ్మలు, కాగితపు బొమ్మలు ఆడిస్తే మజా? ఏముంది—ఆడిస్తే అసలు తోలుబొమ్మలే ఆడించాలని ఒకసారి బుద్ధిపుట్టి—మా పెదనాన్నగారి దేవతార్చన పంచి జింకచర్మం కోస్తా బదాబదలుగా కత్తిరించేసి, వాటికి నాగజెముడు గుబ్బల్లోపలి ఎర్రరంగూ, కరక్కాయసిరా నల్లరంగూ పూసి తెరమీదికెక్కించేసరికి స్నేహితులందూ జంగై పోయారు! దేవతార్చన పంచి ధ్వంసమైపోయినందుకు మా పెద్దనాన్న ఉగ్రుడై మీదపడేసరికి కాశీ పెరిగెత్తవలసి వచ్చిందనుకోండి! అది వేరే విషయం.

ఇలాగే ఒకసారి నేనూ, నా స్నేహితులూ కలిసి లంకాదహనం నాటకం వేయబోయి, అదేమిటేమని స్టేజి అమర్చిన పందిరి దహనమే చేసివేశాము. నాటకం ప్రత్యక్ష రామాయణ ప్రదర్శనంగా తయారైంది!

* * *

నాటకమంటే జ్ఞాపకమొచ్చింది. ఆనాటి మిత్రులలో ఒకడు నాలుగుగోడల మధ్యనా కూచోపెట్టి పాడరా అంటే, మహా హాయిగా పాడేవాడు. అయితే వచ్చె సభాపిరికి. ఒకసారి వాడిచేత ఎలాగైనా వేషం వేయించాలిసిందేనని పట్టు పట్టాము. ఏమనుకొన్నాడో సరేనన్నాడు. వేషం తీర్చి దిద్దుకున్నాడు. నాటకం మధ్యలో వాడిపాత్ర ప్రవేశించాలిసిన సమయం వచ్చింది. వచ్చినా సైడ్‌వింగులో నుంచి స్టేజీమీదికి

శ్రీ

వూడిపడతే! బాబూ! వెళ్ళి అనాలుగు ముక్కలూ అని, ఆ పద్యంపాడి రారా అని కాళ్ళూగడ్డమూ పట్టుకుని ఎంత బ్రతిమాలినా కదలనే కదలడే! ఇకలాభం లేదనుకొని వాడి వెనకాలే మరో ఇద్దరం నిలుచుని స్టేజి మీదికి ఒక్క తోపుతోశాం! ఏం లాభం! ఇటునుంచి తోశామోలేదో, ఎదురుగావున్న రెండో సైడ్‌వింగ్ లోకి తుర్రున జారబడ్డాడు! అక్కడవున్న ఇద్దరు మిత్రులు వాడిమొహం మాకేసితిప్పి స్టేజిమీదికి మరో తోపుతోశారు! ఇహ ఎటు పోవడానికీ గత్యంతరంలేక, నిండువేషంతోనే గబగబా స్టేజి దాటి వెళ్ళి ప్రేక్షకులు కూర్చున్నచోట ఒక ఖాళీసీటుంటే దానిమీద హాయిగా చదికిలబడాడు!

అంతటితో ఆరాత్రి నాటకానికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఆతర్వాత గింజుకున్నా వాడికి మా నాటకాల్లో పాత్ర ఇవ్వలేదు.

* * *

మరోసారి మరో గమ్మత్తు జరిగింది! మరో గమ్మత్తేమిటి బ్రహ్మాండమైన గమ్మత్తు! జన్మలో మరిచిపోలేని గమ్మత్తు.

వీధి నాటకాలంటే మహాచెడ్డసరదా అని చెప్పాను కదూ!

హైస్కూల్లో చదువుకుంటున్న రోజుల్లో ఆచిన్న పట్నానికి వీధి భాగోతుల సెట్టు ఒక్కటి వచ్చింది. వరసగా రోజు మార్చి రోజు నడిబజారులో ఆటలు వేస్తున్నారు. వాటిదుంప తెగ! వీధిభాగోతాలంటే సామాన్యమా? రాత్రి పదకొండింటికి మొదలుపెడితే, తెల్లగా తెల్లవారేవరకూ, ఒక్కొక్కప్పుడు సూర్యోదయమయాక కూడా ఆడాలిసిందేనయ్యా! వాటిమీద వుండే సరదా కొద్దీ వరస తప్పకుండా చూడడం మొదలుపెట్టా. అప్పటికే సతీ అనసూయ, భక్తశిరియాళ మొదలైన ఆటలు ఆడేశారు. ఆనాటిరాత్రి సతీసావిత్రి ఆడడానికి సన్నాహం చేశారు. సతీసావిత్రి కథ అంటే అప్పట్లో నాకు బహుఇష్టమేమో, పూర పొద్దుగూకకముందే, రెండు మెతుకులు తిని వెళ్ళి భాగోతుల పాదధూళితో పావనమయ్యేలా వాళ్ళదగ్గరే కూచున్నా. ఆనాడు ఏకారణంచేతనైనా భాగోతులు ఆ సావిత్రి ఆటఆడకపోతే ఎంత ఆశాభంగం చెందేవాణ్ణో చెప్పలేను. చివరకు అంత ప్రమాదమూ జరిగేపరిస్థితి ఏర్పడి కొద్దిలో తప్పిపోయింది!

భాగోతుల సెట్టులో యముడివేషం వేసే వాడి 'తండ్రికి హఠాత్తుగా ప్రాణం మీదికి వచ్చిందని కబురువస్తే, అతగాడు వూరికి వెళ్ళిపోవడం జరిగింది.

అయినా ఆటజరిగి తీరాలిసిందేనని పెద్ద లందరూ పట్టుపట్టినందువల్ల, వీధిభాగోతాల్లోనూ, నాటకాల్లోనూ వేషాలు వేయాలని ఉబలాటపడే ఒడ్డూ పొడుగూ వున్న ఒక పెద్ద లావుపాటి ఆయనచేత యముడి వేషం వేయించడానికి ఏర్పాటుచేశారు.

యముడు వేషం వేసే మహాదవకాశం దొరికినందుకు ఆయన ఎంత ఉబ్బితబ్బిబ్బైపోయాడో! ఆరాత్రికి భోజనం మానేశాడు. చారెడు మిరియాలు, లవంగాలు పసపస నమిలి మింగి; కంఠం సరమ్మత్తు చేసుకున్నాడు. పొద్దుగూకే సరికల్లా భాగోతులు రంగులు పూసుకునే విడిది ఇంటికి చేరాడు. ఆరోజుల్లో రంగులేమున్నవి? అద్దకం ముద్ద లేగా? మొహానికీ, చేతులకూ, కాళ్ళకూ,

(53-వ పేజీ చూడండి)

# సమయస్ఫూర్తి:

ఎదటిమనిషిని చిత్తుచేయాలంటే, కేవలం భుజబలమే అక్కర్లేదు అవతలివాణ్ణి నోరు మూయించాలంటే అమాంతం వెళ్ళి వాడినోటిని రెండు చేతుల్తో టీ నొక్కెయ్యడం సరైనమార్గం కానేకాదు అది మాటలు చేతకాని మోటమనుషులు చేసేపని, అంతకంటే సులువుగా, సరసంగా చిత్తుచేసి నోరు మూయించటానికి పనికొచ్చే ఆయుధాలున్నాయి. వీటిని ఇంగ్లీషులో 'రిపార్టీ' లంటారు రిపార్టీ ఇవ్వడమంటే మాటకు మాటచెప్పి పీటీ చెయ్యడమన్నమాట ఇదొక విద్య, కళ ఇది కొందరికే అలవడుతుంది అప్పటికప్పుడు అనాలోచితంగా మాటకి మాట అనేస్తే, అవతలివాడి గుండెల్లో బల్లెం లాగ తగలాలి. అదీ 'రిపార్టీ' అంటే.

అయితే విసిరేటప్పుడు బల్లెంలాగ విసిరినా, గుచ్చుకునేటప్పుడు బల్లెంలాగ గుచ్చుకున్నా, అది బల్లెమని అందరికీ తెలిసిపోయేలాగ ఉండగూడదు. దానిచుట్టూ సిల్కుబట్టలు చుట్టి, కొత్త తేనెపూసి, పువ్వులు కురిపి అదేదో పూలచెండనుకొని విసురుతున్నట్టుగా నటించాలి. అప్పుడు అవతలివాడు లోపల్లోపల కుళ్లి కుళ్లి పోయినా పైకి మాత్రం ఏమీ అనలేక వెర్రిమొహంవేసి, చేతకాని నవ్వొకటి నవ్వేసి చక్కాపోవాలి. అప్పుడే ఆ రిపార్టీ రాణిస్తుంది.

మనతో సమానులైన వాళ్లదగ్గిరా, కొంచెం తక్కువస్థాయి వాళ్లదగ్గిరా అయితే మనం ఎంత దురుసుగా పేలినా ఫరవాలేదు గాని, మనకంటే వయస్సులోగాని, హోదాలోగాని పెద్దవాళ్ళదగ్గిరైతే బల్లు దగ్గిరపెట్టుకుని మరీ మాటవాడాలి వాడే మాటలో వాడిపోకుండానే సున్నితంగా అంటించాలి.

అగస్టస్ అనే రోమన్ చక్రవర్తికి పాపం ఒకసారి బలేచక్కని 'రిపార్టీ' తగిలింది ఒకరోజున అగస్టస్‌కి సరిగ్గా తనలాగానే ఉన్న ఒక రైతు కనిపించాడట. వాణ్ణి చూసి "మీ అమ్మ ఎప్పుడన్నా రోమ్ నగరానికి వచ్చిందా?" అని అగస్టస్ ప్రశ్నించాడు. అంటే తనతండ్రికే వీడూ పుట్టివుంటాడనీ, అందుకనే తనూ వాడూ ఒక పోలికలో ఉండడం జరిగిందనీ ఆయన అన్యాపదేశంగా సూచించాడన్నమాట.

రైతు, చక్రవర్తికి ప్రణామంచేసి బహు మర్యాదగా సమాధానమిచ్చాడు: "మహాప్రభూ! మా అమ్మ ఎప్పుడూ రాలేదుగాని మా నాన్న అప్పుడప్పుడు వచ్చేవాడండి!"

ఇది విని చక్రవర్తి ముఖారవిందం ఎలాగైపోయుంటుందో ఊహించుకోవచ్చు.

* * *

నాల్గవజార్జి ఇంకా యువరాజుగా ఉంటున్నకాలంలో ఒకనాడు ఆయన పోర్ట్సుమత్ నగరంలో జాక్ టవర్స్ అనే అతణ్ణి చూసి "ఏమోయ్! ఈ వూళ్ళో నీ అంత లుచ్ఛాకోరు లేడని అంతా అంటున్నారేమిటి?" అని సరదాగానే అడిగాడు. జాక్ టవర్స్ వంగి నమస్కరించి "నాకున్న కొద్ది ఖ్యాతినీ అపహరించడానికి కాదుగదా తామిక్కడికి వచ్చింది?" అని అమాయికంగానే అనేశాడు.

* * *

జాన్ విల్క్స్ అనే ప్రసిద్ధ బ్రిటిష్ రచయిత (1727-97) ఇలాగ మాటకుమాట అంటించడంలో చాలా నేర్పరి అని చెబుతారు.

ఒకరోజున ప్రిన్స్ ఆఫ్ వేల్స్ (యువరాజు) సన్నిధిలో విల్క్స్ ఊసుపోకకు "గాడ్ సేవ్ ది కింగ్" (దేవుడు మహారాజును రక్షించుగాక) అనే జాతీయగీతాన్ని కూనిరాగంగా ఆలాపిస్తున్నాడట "ఇదెప్పుడు నేర్చావోయ్!" అని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ భలోక్తిగా అన్నాడు. "యువరాజా! మీ పరిచయభాగ్యం కలిగినప్పటినుంచే!" అని విల్క్స్ జవాబిచ్చాడు.

* * *

నాలవ విలియంరాజు కొకసారి ఇలాంటిదే ఒకటి ఘాటుగా తగిలింది ఈటన్ పాఠశాలకు జోసెఫ్ గుడాల్ అనే ఆయన పైఅధికారి (ప్రవోస్ట్) గానూ, జాన్ కీట్ అనే ఆయన హెడ్‌మాస్టరుగానూ ఉంటున్నారు. ఒకరోజున విలియంరాజు గుడాల్‌ను చూపిస్తూ కీట్స్‌తో: "ఆయన పోగానే నిన్ను ఆ స్థానంలో వేస్తాను" అని అన్నాడు. గుడాల్ ఇది విని "మహారాజులు మీరుండగా ముందు నేనెలాపోతాను?" అని సవినయంగా సమాధానమిచ్చాడు పోవడం అనేదానికి రాజుగారూ రెండు అర్థాలు వాడారు. గుడాల్ కూడా రెండు అర్థాలు వాడాడు

* * *

ఐర్లెండులోకల్లా గొప్పమాటకారి అని పేరుపడిన బారిస్టరు ఒకాయన ఉండేవాడు ఆయన పేరు జాన్ ఫిల్పాట్ కురన్. అతని ఎత్తిపొడుపులు బ్రహ్మాండంగా ఉండేవట అతనంటే జడ్జీలంతా హడిలిపోయేవారట ముఖ్యంగా ఫిట్జ్‌గిబన్ అనే జడ్జికి కురన్ అంటే తగని వళ్లుమంట. ఆ జడ్జి మామూలుగా కోర్టుకు వచ్చేటప్పుడు తన పెంపుడు కుక్కను కూడా వెంటబెట్టుకుని వచ్చేవాడట ఒకరోజున కురన్ ఏదో కేసు వాదిస్తుండగా, జడ్జి విననట్టు నటించసాగాడు. చాలా విసుగ్గా ఉన్నట్టు మొహం పెట్టాడు. పైగా తన కుక్కకేసి తిరిగి దాంతో ఏదో ముద్దులుకుడవ సాగాడు. కురన్ కు వళ్ళుమండి వాదన ఆపేశాడు "ఆగారేం, కానివ్వండి" అన్నాడు జడ్జి. "అబ్బే మిత్రులిద్దరూ ఏదో ముచ్చటలో వున్నట్లుంటేను, ఆగాను," అన్నాడు కురన్.

ఈ జడ్జిగారినే కురన్ మరొకసారి ఏడిపించాడు ఒకరోజున అతడు వాదిస్తుండగా జడ్జి "మీరు చెప్పేదే న్యాయచట్టమైతే, ఇక నా దగ్గిరున్న న్యాయగ్రంథాలన్నీ తగలేసుకోవచ్చు" అన్నాడట కురన్ "వద్దు తగలెయ్యడమెందుకూ? చదవండి!" అని ఒక విసురు విసిరాడు.

* * *

ఇంకో బారిస్టరు ఎప్పుడూ పోకిళ్ళగా వచ్చేవాడట కోర్టుకు. ఒకరోజున అతని నెత్తిమీది విగ్గు జారిపడిపోయింది కోర్టులో నవ్వులు వినిపించాయి ఆ బారిసరు ఉడుకు

(51- వ పేజీ చూడండి)

# మబ్బూ వానా మల్లె వాసనా

లక్ష్మీనారాయణ



తెర మీద మధుబాల సిగపూలసొగసు చూడగానే మాధవరావులో ఒక మధురానుభూతి కలిగి, యతిప్రాసయుతమైన వాక్యంలా రమణీయరూపం ధరించి, తీరనికోరిక అంతపెద్ద కెరటంలా లేచి, అందంగా విరిగిపడి మనసును కలవరపరిచింది. సీత, వెన్నెల, మల్లెపూలు, అందమైన ఊహాలు, మబ్బూ, వానా ఇలాటివన్నీ అతనికి గబగబా జ్ఞాపకం వచ్చేశాయి. ఇంటికి బయలుదేరాడు.

*　　*　　*

మాధవరావుకి మల్లెపూలంటే ఇష్టం.

“సీతా! నువ్వు జడలో మల్లెపూలు ముడుచుకుంటే ఎంత బావుంటావనుకున్నావ్! పిల్లతెమ్మెరలు ఆమల్లెల చల్లటి పరిమళాన్ని మెల్లిగా, నా నాసాపుటాలకు విందుగా అందచేస్తుంటే ఎంత బాగుంటుందో – ఈ లోకమే మరచిపోతా! — అదొక మధురానుభూతి” అని మాత్రం ఎప్పుడూ అనలేదు. అతనికి అలాటి మాట లొస్తే పయించకపోవడం ఒక కారణం.

రెండోది–తన అర్ధాంగి సవరం వాడుతుంది. అందుకని “నీసవరంలోని పువ్వులు” అని వాక్యం సవరించాలి. దాంతో పొయెట్రీ కాస్తా పోనేపోయె.

‘టంటెంటం టెంటంటం’ అన్నాడు మాధవరావు; హీరో దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాన్ని గుండెలకి హత్తుకుంటూ ‘అట్ట ఫోటో’లో హిందీ హీరోయిన్ పాడిన

పాటను యథాశక్తి అనుకరిస్తూ.

ఇంకో నిమిషం తరవాత తలుపు తాళం తీసి, లోపల బల్లమీద పడేస్తూ "టింటర టింటం టరటరటం" అని కూడా అన్నాడు. ప్రస్తుతం సీత ఇంట్లో లేదు కాబట్టి ఇంకో నాలుగు టరటాలు కలిపి పాడినా ఫరవా లేదు.

ఆఫీసునుంచి తిన్నగా సినిమా కెళ్ళి హోటలువాడు "ఇది అన్నమే" అని హామీ ఇచ్చిన పదార్థాలను వాడు నొచ్చుకు పోతాడేమో అని తనుకూడా అది అన్నమేఅని నమ్మేసి, తిని ఇంటికి వచ్చాడు.

సీత ఉదయం బయలుదేరి పక్క ఊళ్లో చుట్టాలింటి పెళ్ళికి వెళ్ళింది. రేపో ఎల్లుండో వస్తుంది.

రాత్రి పదిన్నరవుతోంది.

"వెదర్ యమగా ఉంది" అనుకున్నాడు. లుంగవల్లె తెగించి గోల్డుఫ్లేకుపెట్టె కొనేశాడు మాధవరావు. రూపాయినోటు తీసుకుని మళ్ళీ లిక్కి లిక్కి మని అణాచిల్లరివ్వట మేమిటని, అడక్కుండానే కొట్టువాడు డిలక్సు అగిపెట్టె చేతులో పెట్టాడు. పిల్లలు కలవాడు-పోనీలే అని మాధవరావు అడ్డు చెప్పలేదు.

సిగరెట్టు వెలిగించి, లైటార్పి, పక్క మీద పడాడు-బయట గాలి జోరుగా వీస్తోంది. కొద్ది నిముషాలకి చినుకులు ప్రారంభించాయి. పొడి నేల మీద తొలి చినుకులు పడగానే వచ్చిన వాసనకి మాధవరావు ముగ్ధుడయి పోయాడు. "హా! మల్లెపూల వాసనకంటే బావుందే" అనుకున్నాడు.

వారం రోజుల క్రితం సంగతి గుర్తొచ్చింది.

* * *

తెల్లారి అయిదింటికి వాన మొదలెట్టింది. వానంటే కూడా మాధవరావుకి ఎంతో ఇష్టం. పెళ్ళవని రోజుల్లో, వానొచ్చినప్పుడల్లా, పక్కన తనకిష్టమయిన చక్కటి అమ్మాయి చెక్కిలికి చెక్కిలి ఆనించి మరీ వానని చూడాలనుండేది.

పెళ్ళయిన తరువాత ఒకరోజు వాన రాగానే ఆసంగతి గుర్తొచ్చింది. ఇపుడు సీతని లేపి, చెంపకి చెంప ఆనించి వానని చూద్దామని అడుగుతే, నిద్దర మత్తులో ఆ అమ్మాయి కంగారుపడచ్చు. అయినా లేపాడు.

"ఊఁ" అంది సీత కళ్లు తెరవకుండానే.

"వాన" అన్నాడు తను.

"కిటికీ తలుపులు మూసేయండి. జల్లు కొడుతుంది" అంది సీత.

మాధవరావుకి చిరాకేసింది.

"అబ్బే అదికాదు. కిటికీదగ్గరకూచుని వానచూద్దాంరా. లే" అన్నాడు కోపంగా.

సీత ఆవులించింది. "బావుద్దండీ—హాయ్—అదేబావుల్డి. అద్దరాత్రివేళ అంకమ్మ శివాలన్నట్టు. చాల్లాలు. పడుకోళ్ధి" అంది—అటు వేపుతిరిగి.

"టెక్నికల్ అబ్జక్షను. అర్ధరాత్రికాదు—ఇపుడు అయిదయింది—తెల్లారి—"అన్నాడు. ఇంకా కోపంగా.

సీతకి ఇవేమీ వినిపించినట్టు లేదు.

మండిపోయాడు మాధవరావు.

దడదడా లేచి కోపంగా పళ్ళుతోమేసి (తనవి) ముఖం కడిగేసుకుని, అంతకన్న కసిగా పదహారు అగ్గిపుల్లల సాయంతో కుంపటి అంటించిపారేశాడు. మళ్ళీ తెచ్చి వంటింట్లో పెట్టి వసారాలో కొచ్చేప్పటికి గూట్లో పాలగిన్నె ఖాళీగాకనిపించింది. ఇంకా పాలవాడు రాలేదు—వానవడం మూలాన్ని. వాడూ బహుశా వాడితాలూకు అర్ధాంగిచెంపకి చెంపానించి వానని చూస్తున్నాడేమో! వాడిబొంద—వాడికి రొమాన్సేమిటి. కల్చరుండదు—బహుశా. బియ్యే గియ్యేచదివాడా ఏడిశాడా...మాధవరావు నిశ్శబ్దంగా చిన్నకథాకళీ నృత్యం చేసి పడక్కుర్చీలోకూచుని నిద్దరోయాడు.

* * *

ఇపుడాసంగతి ఆలోచించుకుంటూంటే ఆరోజు ఎప్రోచ్ బాగులేదనిపించింది.

"అసలలాకాదు, మృదువుగా మాట్లాడి ఉండాల్సింది" అనుకున్నాడు.

బయట వానజోరుకొంచెం తగ్గింది. కిటికీ లోంచి వచ్చే గాలికి దుప్పటి మడతపడింది. సిగరెట్టు బయటకివిసరి, దుప్పటి సరిచేసి తలగడామీద తలఆన్చాడు.

మల్లెపూల వాసన గుప్పుమంది.

నిన్నరాత్రి, సీత, పక్కింటివారి అమ్మాయి తెచ్చిపెట్టినవీ, తను అంతకు ముందే కొన్నవీ కలిపి జడలో రోజాకంటె మరిన్ని పూలు తురుముకొంది. వాటి తాలూకు పరిమళం తలగడాని అంతటా అలముకొని, జవరాలిని కంచుకంలా గాఢాశ్లేషం చేసుకుందనిపించింది. మర్నాటికీ ఆ పరిమళం అలాగే ఉండటం గమనించిన మాధవరావులో తక్షణం మనోహరమైన ప్రణయ భావాలు, మధుర స్మృతులు మెదిలాయి.

అమాంతం సీత అంటే ప్రేమ పెల్లుబికింది.

* * *

తను మొదటిమాటుగా పెద్దపండుక్కి అత్తారింటి కెళ్ళినపుడు, గుమ్మందగ్గర మల్లెపూలు చేరం చేస్తున్న సీత అపుడే రిక్షాదిగిన తన్ను చూడగానే బోలెడు సిగ్గుపడిపోయి గబుక్కున లేచి, గడప తగిలి బోర్లాపడినంత పనిచేసి, వసారా తుడుస్తున్న పని మనిషిని ఢీ కొట్టి, పడిపోకుండా నిలదొక్కుకుని లోపలికి పరిగెత్తికెళ్ళి పోయిన సందర్భం తలచుకొని తక్షణం తనూ బోలెడు సిగ్గుపడి పోయాడు. ఆ మైకంలోనే రిక్షావాడు 'పావలా ఇప్పించండి' బాబూ, అని అడుగుతూంటే, ఇంతకంటె వచ్చినా దమ్మిడీ ఇవ్వనని వాడి చేతులో పరాగ్గా అర్ధరూపాయి కాసు పెట్టేశాడు తను.

రాత్రి డాబాలో వెన్నెల కింద పక్క వేశారు. భోజనాలయిన తరువాత, మామగారు, తనకొచ్చిన జలుబుగురించి చెబుతూ, అణ్వస్త్ర పరీక్షలూ, వాటి దుష్ఫలితాలూ, వివరించి, అమెరికానూ, బ్రిటన్నూ, తలవాచేట్టు తిట్టారు. అసలు ఇలాటి ఏటంబాంబులు మనపూర్వులు ఎప్పుడో కనిపెట్టి పారేశారని చెప్పి ఆయన బోల్డు గర్వపడి పోయాడు. మళ్ళీలేచి, కాశ్మీరం మీదికి దండయాత్ర ఆరంభించే టప్పటికీ, మాధవరావు వెకిలినవ్వు నవ్వేసి, చప్పట్లుకొట్టేనంత గట్టిగా చిటికెలు వేస్తూ ఆవలింతలు అభినయించేసరికి విముక్తి లభించింది.

భోజనం అయి పదిహేను నిముషాలయింది. అంతవరకూ సిగరెట్టే కాల్చలేదే! డాబామీదకు వెళ్తూనే వరసగా రెండు కాల్చేసి అయిన కాలనష్టం భర్తీ చేశాడు.

తెల్లటి వెన్నెలక్రింద, తెల్లటి పక్కమీద పాల కెరటం లాటి మెత్తటి తెల్లటి దుప్పటీ—దుప్పటీమీద ఆకెరటపు నురగలా తెల్లటి మల్లెపూలు—"ఓహో! ఏమి టేస్టురా" అనుకుని గుండెలు బాదుకున్నాడు. "యాను టేస్టు" అని తనే జవాబు చెప్పుకున్నాడు.

సరే—తరువాత మెట్లమీద గాజుల గలగల, దరిమిలా కనబడిన సీత మొహం కలకల, ఆమొహం తాలూకు కౌటుకకళ్ళ మిలమిలా, ఆపైన శబ్దాలంకారం కోసం ఆమె చేతి మరచెంబు తళతళా మొదలైన ఏర్పాట్లు చూసి మాధవరావు మురిసి పోయాడు.

* * *

వర్షజలంతో శుభ్రంగా కడిగివేసిన నక్షత్రాలను, పల్చటి మబ్బు తెరలలోంచి చూస్తూఉంటే, ఆతారలు మరింత మనోహరంగా తియ్యటి తొయ్యలి గురించిన మధుర భావాలలా కనిపించి అని పించాయి.

లోగడ తాను చూసిన హిందీసినిమా తాలూకు హీరోలాగ, తను వదలిన సిగరెట్టు పొగలోకి ఫొటోజెనిక్ గా చూస్తూ "ఇవే గాబోలు—మధుర స్మృతులంటారు హారిసీ!" అనుకున్నాడు మాధవరావు.

"అంటే అన్నారుగాని ఇవన్నిటిని లేక వీటన్నిటినీ సీతకు గుర్తు చెయ్యాలి. చేసి ఆమె ముఖంమీద కనబడే సిగ్గుదొంతర్లు చూడాలి. ఆమె పెదాలమీద పూచే అలతినవ్వుల పువ్వులను ఆఘ్రాణించి అలాటి చిరునవ్వు నవ్వినందుకు ఆ పెదాలను యథాశక్తి సత్క

(51-వ పేజీ చూడండి)



# పైత్రము ఉమాటం

మొక్కపాటి నరసింహశాస్త్రి

ఉమ్మాయిని ఎరుగనివాళ్ళు ఎవ్వళ్లూ ఉండరని నా నమ్మకం. నూటికి కోటికి ఎవరన్నా ఒకరున్నా, వాళ్లు లెక్కలో కొచ్చేవాళ్ళు కారు. దేశం మొత్తంమీద నెహ్రూని ఎరగనివాళ్ళు లేనట్టుగానే, మా పరిమితపరిధిలో ఉమ్మాయికూడా అంతే.

వాడికి నామకరణం ఉమామహేశ్వరరావనే చేశారు. కాని ఆనాడుతప్ప మళ్ళీ ఆపేరుతో అతిన్నెవ్వరూ పిలవలేదు. అందరికీ అతను ఉమ్మాయే. పూర్తిపేరుతో పొరపాటున ఎవరేనా పిలిస్తే, తనను కాదేమోననుకుని పలక్కపోవడంకూడా కద్దు.

ఇంకో తమాషా. ఇతన్ని ఎవ్వరూ బహువచనంలో సంబోధించరు. ఎంత కొత్తవాళ్ళైనా 'ఏరోయి' అనో, లేకపోతే, 'ఏమోయి' అనో అనడం సర్వేసర్వత్రా పరిపాటయిపోయింది. ప్రథమ పరిచయం కాగానే, అలవాటుచొప్పున అందరూకూడా 'అయితే, ఉమ్మాయిగారూ' అని ప్రారంభించి, వాక్యాంతానికి 'ఏమంటావు?' అని ఏకవచనంలోకి దిగి, రెండో వాక్యం 'అరేయి ఉమ్మి' అన్న వాళ్లని చాలమందిని చూచాను. పైన ఉన్నవాడికి నాకే ఎలాగో వెగటుగా ఉండేది. కాని ఉమ్మాయిమట్టుకు ఏమీ సందేహంలేకుండా, కులాసాగా వాళ్ళతోటి కలిసిపోయేవాడు. తనూ అలాగే అందరినీ 'ఏరా బ్రదర్' అనో, 'ఒరేయి సోదరా' అనో 'చూడు తమ్ముడూ' అనో అంటుండేవాడు.

అలాటివాడు మా ఉమ్మాయి. రూపురేఖా విలాసాదులలో ఎవ్వరికీ ఏమీ తీసిపోడు. అయితే అందరికీ ఇతను హాస్యనిలయుడుగా కనపడేవాడు. వాడిని చూచినవాడల్లా వాడి మీద ఏదో ఓవిసురు విసరకుండా పోయేవాళ్ళు కారు. ఏమాత్రమూ హాస్యములేని వాళ్ళకుకూడా ఉమ్మాయిని చూడడంతోనే హాస్యం పుట్టుకొచ్చేది.

ఇంత సరదాగానూ ఉండే ఉమ్మాయికి ఒక్క లోటు ఉండేది. లోటంటే లోటుకాదు సుమండీ. ఒక రకమైన అమాయకత్వం—పోనీ మెత్తతనం—ఒక వీక్‌నెస్ ఉండేది. అదేమిటంటారా! మరేంలేదు—ఎవరన్నా ఏది చెప్పినా కాదనలేక పోయేవాడు. దానితో వాడి కష్టాలు ప్రారంభమైనాయి. దానితో వాడిజీవితం నానాటికి దుర్భరం కావడం ప్రారంభమైంది. ఎప్పుడో యిది శ్రుతిమించి వాడిజీవితం విషాదాంతమౌతుందేమోనని మాతోటి సన్నిహితులకు భయం.

వాడిని చిన్నప్పుడు, ఒకమాటు, కాఫీ హోటలుకు తీసుకువెళ్ళి, నలుగురమూ చేరి, ఇవాళ ఉమ్మాయిచేత 30 ఇడ్డెనలు తినిపించాలని సంకల్పించాము. వాడది విని నిమ్మళంగా జారాలని ప్రయత్నం చేశాడు. మేం నలుగురం పట్టుకుని కూర్చోపెట్టి, మళ్లీ పారిపోకుండా నాలుగువైపులా కాపలా కాచి ఇడ్లీలు పురమాయించాము. 'నేను తినలేను మొర్రో' అని మొత్తుకున్నాడు; తనకు పడదన్నాడు; జబ్బు చేస్తుందన్నాడు; తినలేనుగాక తినలేనని బ్రతిమాలాడు. ఏడ్చాడు—మొత్తుకున్నాడు. ఏమయినా సరే యములాళ్లలా కూర్చుని మేము, నువ్వు తింటేనేకాని వీల్లేదన్నాం. వెధవ్వా. నీ సంగతి నీకం తెలుసు, మాకు తెలుసును కాని. ఈముప్ఫై ఇడ్డెనులు తినలేని వాడవు ఎందుకు పుట్టావు? ఏం నిలవాకం చేద్దామనుకున్నావు? ఈ ఆటలు మా దగ్గర సాగవు! బోలెడంత డబ్బు తగలేసి, ఒకటోరకమైన వేడీవేడి ఇడ్డెనులు వాయి చల్లగా వాయి తెప్పిస్తూంటే తినలేవూ? అట్టే పిచ్చివేషాలెయ్యక తిను—నోరు మూసుకుని,' అన్నాను నేను. 'ఒరే నువ్వు వాడినాట్టే ఇది చెయ్యకు; వాడే తింటాడు. నోరుమూసుకు తినమంటే వాడు ఎలా తింటాడు? ఉమ్మాయి—తినరా మామూలుగానే తిను. నీకేం భయంలేదు. మేమంతా ఉన్నాంగా!' అన్నాడు మరొకడు.

ఏమైతేనేం-వాడు తిన్నాడు, మా మాట తీసెయ్యలేక; ఒక్కసంగతి మీరు గమనించాలి. ఇడ్డెనంటే ఈనాటిదికాదు. ఆనాటిది. అంతా మినుము. ఇంతకు మూడురెట్లుండేది. అవి, ముప్ఫై తిని, ఉమ్మాయిబడ్డ బాధఇంతా అంతా కాదు. మాకుజాలేశి, రెండు జింజర్లు తాగించి, కొంచెం వాంతి చేయించి, అగ్నితుండి మాత్రలు వేసి, ఓమిక్కేరు ఇప్పించి నానా అవస్థా పడ్డాము.

మా మాటతీసెయ్యలేక ఇంత బాధపడ్డాడు పాపం! నేను తినను, నువ్వుతినుకావలిస్తే అంటే మేము ఏమయేవాళ్ళం చెప్పండి! ఎప్పుడూ అలాఅనేవాడు కాదు. అంటే వాడు ఉమ్మాయి ఎందుకవుతాడు?

ఇంకోసారి ఏమయిందనుకున్నారు? మా స్కూలు వార్షికోత్సవమో, పాత విద్యార్థి సంఘవార్షికోత్సవమో జరుగుతోంది. వినోద కార్యక్రమం దగ్గర కొచ్చేటప్పటికి, మా వెంకన్న హఠాత్తుగా, ఎవ్వరితోటీ చెప్పకుండా, సభాపతి అనుమతి పొంది, వేదికమీదికెళ్ళి 'సోదర సోదరీమణులారా! ఈరోజున మనమిత్రులు ఉమ్మాయిగారు, వారి మధ్య కష్టించి సాధించిన యోగాసనములను ప్రదర్శిస్తారు. మీరు సావధానంగా నిశ్శబ్దంగా చూచి ఆనందించమని నా కోరిక' అన్నాడు. 'చచ్చాన్రా భగవంతుడా' అని ఓవెర్రి కేకవేసి, ఉమ్మాయి మూర్ఛపోయినంత పని చేశాడు! ఇదెక్కడ న్యాయం! నన్నిలా చంపుతే నేనెలా చావను? ఉన్న ఆసనం తప్ప మరో ఆసనాలేమీ నాకు తెలియవు-నా వల్ల కాదన్నాడు. 'అయితే ఇంత మందిలోనూ, నీకు పేరు కావాలనీ, నువ్వు గొప్పవాడవు కావాలనీ నానా అవస్థాపడి అగ్రాసనాధిపతినీ, కమిటీ మెంబర్లను ఒప్పించి, నీ ప్రోగ్రాం ఏర్పాటు చేస్తే మమ్మల్ని వెధవాయలను చేసి, ఇంతమంది సభికులకూ ఉత్సాహ భంగం చేస్తావుట్రా!' అన్నాడు వెంకన్న, అతిదీనంగా మొహం పెట్టి—వాడలా పెట్టక్కరలేదనుకోండి-ఎప్పుడూ దీనంగానే ఉంటుంది వాడి మొహం! దానిలో ఉమ్మాయి ఏమీ అనలేక, ఏం

చెయ్యడానికి తోచకుండా ఉన్న స్థితిలో మాటామంతీ లేకుండా వాడిని రెక్క పట్టుకుని, నెమ్మదిగా వేదికదగ్గరకు బలిపశువును లాక్కుపోయినట్టు లాక్కుపోయాను; 'శీర్షాసనం' అని అక్కడనుంచే ప్రచురణ చేసి వాడిని వేదిక మీదికి నెట్టుకున్నాను. ఏమీ అనలేక వేదిక మీదికి వెళ్ళి, శీర్షాసనం వెయ్యలేక, మెడ విరుచుకున్నంత పనిచేసి కింద పడ్డాడు! జనం గొల్లుమన్నారు. వాళ్ళు ఇదంతా ప్రహసనం అనుకున్నారు. సరిపోయింది. అంత అలాంటి వాడు మా ఉమ్మాయి!

ఇదేదో చిన్ననాటి సంగతి, సందర్భం అనుకుంటారు మీరు. ఇప్పుడు చెప్పవచ్చిన దదే! ఇప్పటికీ అదే పద్ధతిని నడుపుకొస్తున్నాడు ఉమ్మాయి. ఏమీ మార్పులేదు—మనిషిలో కాని, మాటలో కాని, మంతిలో కాని. ఇప్పటికీ ఎవరన్నా వచ్చి నువ్వా పని చెయ్యాలి అంటే నేనెందుకు చెయ్యాలి? కావలిస్తే నువ్వు చేసుకో, లేక పోతే మానుకో. అని చచ్చినా అనడు—అనలేడు!

అంతా పెద్ద వాళ్ళమయి, అక్కడా అక్కడాపడి ఎవళ్ళ జీవితాలు వాళ్ళు గడుపుకుంటున్నా, మా జట్టు ఆట్టే విడిపోకుండా చాలా మంది మద్రాసువాసుల మయ్యాం. పాపం ఉమ్మాయి మట్టుకు ఇంటి దగ్గరే ఉండిపోయాడు. అయినా ఇంటి దగ్గర ఏమీ తోచకపోతే, తిన్నగా మద్రాసు కొట్టుకొచ్చేవాడు. వచ్చి మాతో పదిరోజులు గడిపి పోయేవాడు; లేదా, మాకు కాలక్షేపం కాకపోయినా ఉమ్మాయికో కార్డు వ్రాసి పడేస్తే, వాడు ఎన్ని పనులున్నా మానుకుని పడిపోయినట్టు తిరుగుటపాలో చక్కా వచ్చేవాడు!

ఆమధ్యనో మాటలాగే ఇక్కడకొచ్చాడు. పదిరోజులున్నాడు. కులాసాగా ఇట్టే గడచిపోయాయి రోజులు. పదకొండో రోజున ఇంటికి వెడదామని ప్రయాణ సన్నాహం చేసుకుంటున్నాడు. ఇంతట్లోకే దైన్యం ఓడుతూ, వధవ మొహం వేసుకుని వెంకన్న చక్కావచ్చాడు. ఉమ్మాయికేసి ప్రశ్నార్థకంగా చూచాడు. ఉమ్మాయి వెడుతున్నాడన్నాను. 'ఏమిరా! నిజమేనా' అన్నాడు వెంకన్న. 'అవును' అన్నాడు ఉమ్మాయి. రెండునిమిషాలు భరింపరాని నిశ్శబ్దం. తరువాత అగాధమైన నిట్టూర్పు. 'వెళ్లినాయనా! వెళ్ళు. నీకేం మహారాజువు! మనది స్వతంత్రదేశం. నిన్ను అడ్డుపెట్టే వాళ్ళు ఎవరుగాక వెళ్ళు. మేం ఎలాచస్తేనీకేం! మనం ఎలా చచ్చినా లోకాన్నుమస్తాక్కు భినోభవంతు గాక్కం — వెళ్ళు సుఖంగా ఉండు. మాకేదేనా వస్తే పేపర్లో పడుతుందిలే. వెళ్ళు' అన్నాడు వెంకన్న కంఠపూర్తి అయిన కంఠంతో. ఇంకేముంది ఉమ్మాయి కట్టినమూట విప్పాడు. ప్రయాణం మానుకున్నాడు. వెంకన్న ఎందుకిలా అన్నాడు? వాడికొచ్చిన ప్రమాదం ఏమిటి? తనుంటే అది ఎలా నివారణ అవుతుంది? అనే ఆలోచనే లేదు.

సరే, మరో పదిరోజులున్నాడు. మళ్ళీ ప్రయాణం తలపెట్టాడు. పాండిబజారులో ఎవరితోటో అన్నాడు, ఈ వేళే వెడుతున్నానని. ఇంకనేముంది? అక్కడే నలుగురూ చేరి మీరు సుతరామూ వెళ్ళడానికి వీల్లేదు. మీతో బోలెడంత పనున్నది. మరో మాట మీరనకూడదు, మేం వినకూడదన్నారు. కాబోలనుకున్నాడు ఉమ్మాయి. ఇందులో ఒక్కళ్ళూ ఉమ్మాయికి ఒక్కపూట భోజనం పెట్టినవాళ్ళు లేరు. పదిరోజులదాకా ఇందులో ఒక్కడూ ఉమ్మాయి కంటపడలేదు!

ఇలా ఎప్పటికప్పుడు, ప్రయాణం అవుతూండడం; ఎవరో ఒకరువచ్చి ఆపుతుండడం! పనీలేదు; తీరికాలేదు; ప్రయాణమూ లేదు. ఇలాగు ఆరుమాసాలు ఏకబిగిని మదరాసులో ఉండిపోయాడు, ఉమ్మాయి. చేతులో దమ్మిడీ లేదు. మద్రాసులో ఉండమని బలవంతం చేసేవాళ్ళే కాని, ఒక్కపూట భోజనానికి రమ్మన్నవాళ్ళు కనపడరు—ఏహోటళ్లో భోజనం బాగుంటుందో ఆ భోగట్టామటుకంతా చెప్పేవారు.

ఇది బాగుందికాదు. ఎలాగైనా ఈ ఊబిలోనుంచి బైటపడాలని నిశ్చయించుకున్నాడు ఉమ్మాయి. ఎవ్వరితోటీ చెప్పకుండా ఇంటికి ఉత్తరంవ్రాసి ఓ వందరూపాయలు తెప్పించుకున్నాడు. రెండోకంటి వాడికి తెలియకుండా ఆరాత్రి రైలు ఎక్కుదామనుకున్నాడు. ఆరోజు ఎవ్వరికీ కనపడకూడదనుకున్నాడు. పెందరాళే బయలుదేరి హోటల్లో రెండు మెతుకులు కతికి, ఇంటికి కావలసిన వేవేనా కొనుక్కుందామని మౌంటురోడ్డు వచ్చాడు. యముడిలాగ అక్కడ శంకరం ప్రత్యక్షమయ్యాడు! ఇంకేముంది! ఉమ్మాయికి కాళ్ళు చల్లబడ్డాయి! ఉమ్మాయికేకాదు, ఉమ్మాయిని సృష్టించిన వాడికీ చల్లబడతాయి, శంకరం కనపడితేను. వాడిలో ఉండే విశేషమే అది. అందుకనే వాడికి జేబాంతకుడని బిరుదు నామం!

"ఏరోయి ఉమ్మాయి! ఏమిటి విశేషం! మంచి మిడసరిలగ్నంలో బయలుదేరావు?" అన్నాడు శంకరం.

"అఁ ఏంలేదురా. ఏవో రెండుమూడు వస్తువులు, అవసరమైనవి కొనుక్కుందామని" అన్నాడు ఉమ్మాయి నెమ్మదిగా.

"నీబొంద ఇప్పుడు నీకు అవసరమైన నేను న్నాయి...కొంపతీసి ఇంటికి ప్రయాణం కాదుగదా! ఆ! నీవాలకంచూస్తే, తెలుస్తోనే ఉంది! నిజంచెప్పు. అవునా కాదా?" అన్నాడు శంకరం.

అవునన్నట్లు తలఊపాడు ఉమ్మాయి.

"హారి దుర్మార్గుడా! ఏమీ ఎరగనట్టుంది ఎంతదుర్మార్గం తలపెట్టావు! నీలాటివాళ్ళ దగ్గరుండే గుణమే ఇది. అవును కాని మమ్మందరినీ విడిచి ఇంటిదగ్గర ఏంనిరవాకం చేదామని? సరే! దానిసంగతి తరువాత ఆలోచిద్దాం, ముందు కాఫీహోటల్లోకి నడువు. అక్కడ నీసంగతేదో తేలుద్దాం" అంటూ ఉమ్మాయిని రెక్కపట్టుకుని ఉడిపిహోటలు వైపు మళ్ళించాడు శంకరం.

"అరేయి, నన్ను చంపకు! నేనిప్పుడే భోంచేశాను. నాకు బోలెడంత పనుంది. నన్ను విడిచిపెట్టు" అని ప్రతిమాలుకున్నాడు ఉమ్మాయి.

"అలాగేం పాపం! పనుందేం? పనిలేనిదెవరికి? చీపురుకట్టకు కూడా ఉంటుంది. పనిట పని! భోంచేశావేం? ఊరు నాలుగు మూలలా తెల్లవారలేదుకదా! అప్పుడే ఏం

(52–వ పేజీ చూడండి)



# మన ప్రాచీన రచయితలు: కొన్ని చమత్కార ఘట్టాలు

## యామిజాల పద్మనాభస్వామి

"అంగములలోన మేలు ఉత్తమాంగమందు
నుత్తమంబులు కన్నుల ఉర్విజనుల
కట్టి కన్నులు లేవనుటంతె కాక
ఉత్తముండు కాఁడె సద్గుణయుక్తినతఁడు"

కూతురుని ధృతరాష్ట్రుని కివ్వడానికి నిశ్చయించానని గాంధారపతి చెప్పగా బంధువులు అన్న మాటలు.

'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్'

అంటారు పెద్దలు. అవయవా లన్నింటిల ఉత్తమం — సర్వేంద్రియాలలో నయనం ముఖ్యం. అలాటి కన్నులు లేవుగాని ధృతరాష్ట్రునికి లోటేమిటి? ఎన్ని ఉంటే ఏంలాభం? కళ్లు లేవు. ఒకే మంచి పెండ్లికొడుకు అన్నారు ఏపిల్లఅయినా, చివరకి వీరేశలింగంగారి చాదస్తపు చలమమ్మకూడా ఒప్పుకోదు పెండ్లాడడానికి కాని గాంధారి 'గీత' అలా ఉంది. వాడ్నే పెళ్లాడుతానని ఒప్పుకొంది.

గురువుగారుకోరినట్లు అర్జునుడు ద్రుపదుణ్ణి జయించి రథానికి కట్టితెచ్చి గురుదక్షిణగా అప్పగించాడు. అప్పుడంటాడు ద్రోణుడు.

'ఏ రెవ్వరయ్యా ద్రుపదులు
మహారాజులె ఇట్లు కృపణులయి పట్టుపడక
వీరికివలసెనె అహహా! మ
హారాజ్యమదాంధకార మది నాసెనొకో'

అని,—

పిల్లవాడికి పాలకోసం ఆవు కావాలనీ, సహాధ్యాయికదా అమాత్రం ఉపకారం చేయకపోతాడా అనీ ద్రోణుడు ద్రుపదుణ్ణి అర్థించాడు. అప్పుడు మహారాజైన ద్రుపదుడు తారతమ్యం తెలుసుకోకుండా మాటాడుతున్నావు. పరమదరిద్రుడివి నువ్వు మహారాజుని నేను. నాకూ నీకూ స్నేహమేమిటి పోరా అని తూలనాడాడు ఐశ్వర్యగర్వంతో, — దానికి ఈనాడు ద్రోణుడు జవాబు చెబుతున్నాడు

ఓహో ద్రుపదమహారాజులా! ఏరు! మహారాజత్వం నాసిపోయినట్టుందే ఇంత దిగిపోయారేమిటి ఎకే, — అని హాస్యమాడి అధిక్షేపించాడు

ఏ ఘట్టంలో నైనాసరే నన్నపార్యుని హాస్యం అంతర్నాళాలకు సూది పోటు పొడిచినట్టుంటుంది. స్థూలదృష్టిలో సున్నితంగానూ, సూక్ష్మవిచారణలో చురుకుగానూ తగిలే హాస్యం ప్రకటించడములో నన్నయ సిద్ధహస్తుడు.

విచిత్రవీర్యుడు రాజకార్యాల ప్రసక్తి వర్జించి సంతత కామోపభోగాలతో కాలక్షేపం చేయడంవల్ల క్షయరోగి అయి చనిపోయాడు. దీనిని నన్నయ

'రాజయక్ష్మబాధితుడయి దేవలోక
సుదతీప్రియుడయ్యె విచిత్రవీర్యనృపుడు'

అని అంటాడు. చచ్చిపోయాడని వాచ్యంగా అనడు. ఐహిక కామవాంఛతో తృప్తిరక్క దేవలోకంలోఉన్న సుదతులకు ప్రియుడయాడంటాడు.

రాజై పట్టం గట్టుకొన్నాక ప్రజాక్షేమంకోసం రాజకార్యాలు పరిశీలించి పరిపాలన చేయడం వానివిధి. అది మానేసి కాముకుడై రోగి అయి చచ్చాడు. దానిని అవహేళనపూర్వకంగా సూచిస్తున్నాడు శబ్దశాసనుడు.

అతి పిడి కామం తగలదా! నేల విడిచి సాము చేశాడురా వీడు,-అని బుద్ధి చెబుతూ అయిందా! ఇక అనుభవించరా, అన్నట్టుంది ఇది

బకాసురవధ ఘట్టములో బ్రాహ్మణవేషాలతో నివసిస్తున్నారు పాండవులు. వారున్న యింటి యజమానివంతు వచ్చింది బకాసురుడికి ఆనాడు ఆహారంగా ఎవరో ఒకరు వెళ్ళాలి తల్లి, తండ్రి, కూతురు, చిన్న కొడుకు-ఇది వారికుటుంబం నేనంటే నేను అని పెద్దవాళ్ళు ముగ్గురూ ఏడుచుకొంటున్నారు ఆ సందర్భంలో అవ్యక్తవచనుడైన పిల్లవాడు తల్లిదండ్రులకూ, అక్కకూ కన్నీళ్ళు తుడుస్తూ

'కొంగుకకోల చేతఁబట్టుకొని
వీన రక్కసుఁ గిట్టి చంపి
యలుకివట్టి మీకెవ్వగా వలవదనుచు
కలయ నూరార్చె తనతొక్కుపలుకు
లొప్ప,—

గానతో (వాడిమాటలుపిన) గాళ్ళయేమిపు పోయింది బకాసురుణ్ణి చంపడానికి ఒక చిన్న కర్రపట్టుకొని వాడువెళ్ళి చంపవస్తాడట. ఏమిగా అనుకొన్నాడు వాడు.

పాము పాము అని పెద్దవాళ్ళు గాభరాపడుతూ ఉంటే 'ఏది నేను చంపేస్తాను' అంటాడు అయిదారేళ్ళ వయసువాడు. చేపాటికర్రతో పరుగెత్తుతాడు. మాచేవారికందరికే వింతగానూ నవ్వుగానూ ఉంటుంది.

### "ఆంధ్రా ది అన్‌రెడీ!"

దాదాపు 30 ఏళ్లక్రితం గాంధి మహాత్ముడు ఖద్దరు నిధినిమిత్తం ఆంధ్రరాష్ట్రములో సంచారం చేయదలచి తన పర్యటన కార్యక్రమం తయారుచేసి ఇవ్వవలసిందని దేశభక్త కొండా వెంకటప్పయ్యగారిని కోరారు. వెంకటప్పయ్యగారు కృష్ణా, గుంటూరు జిల్లాలలో తప్ప మిగతా జిల్లాలలో మహాత్ముడు చూడదగిన గ్రామముల జాబితా వగైరాలను ఎంత కృషిచేసినా తయారు చెయలేకపోయారు. మహాత్ముడు బెజవాడ వచ్చి, కార్యక్రమం తయారైనదా అని ప్రశ్నింపగా లేదని వెంకటప్పయ్యగారు సమాధాన మిచ్చారు గాంధీజీ అసంతుష్టి ప్రకటిస్తూ "ఎథెల్ రెడ్ ది అన్‌రెడీ" అనే నామసరళిగా "ఆంధ్రా ది అన్‌రెడీ!" అని వెంకటప్పయ్యగారికి బిరుదు తగిలించారు.

ఈలాటి భావాలు వెల్లడించే ఘట్టాలలో కూడా నన్నయ ఎదురులేని వ్యాఖ్యాతగా కనబడతాడు.

జీవితములో సముద్రతరంగాలవలె లేగే బాధలు అనేకం ఉంటాయి. వాటివల్ల మనస్సుబరువెక్కి సర్వేంద్రియాలకూ సంకెల వేసినట్టు చలనం లేకుండా అయి ఏదో బరువు తలకెత్తినట్టు ఉంటుంది. ఆ బరువును ఇట్టే దింపడానికి మందు హాస్యం. మనస్సుకి వికాసం కలిగించేది హాస్యం.

సంఘములో, నిత్య జీవితంలో తెలిసి, తెలియక వస్తూన్న దురాచారాలనూ, దుష్ట బంధాలనూ రూపుమాపి విడగొట్టడానికి హాస్యం ఎంతో ఉపయోగపడుంది కాని దానిని విరివిగా ఉపయోగించి జీవితంలో చైతన్యాన్ని సమగ్రంగాకలిగించేవిధానంలో గ్రంథాలు తెలుగులో అట్టే వెలువడ లేదు. ఎక్కడో నాటా నూటా ఆయా సందర్భాలలో ఒకటి రెండు పద్యాలలో వెక్కిరిస్తున్నట్టు ముడి పెటినవితప్ప హాస్యాన్ని అంగిరసముగా చేసికొని ఆవిర్భవించిన కావ్యాలులేవు.

నన్నెచోడుని కుమారసంభవములో దక్షాధ్వరధ్వంసం పట్టులో కొంత హాస్యం గోచరిస్తుంది రుద్రుని సైన్యాలు యజ్ఞవాటికను ధ్వంసం చేసి దేవతాబృందాన్ని చీకాకుపరచినఘట్టం చదువుతూ ఉంటే పకాలున నవ్వు వస్తుంది.

ప్రమథగణాలబారినుండి తప్పించుకో వాలని బ్రహ్మ తన వాహనమైన హంసను అధిరోహించబోయి భయంతో నేలమీద పడిపోయాడు. అప్పుడు హంస తామర తూడుని కఱచి పట్టుకొన్నట్టు బ్రహ్మను పట్టుకొని పరుగెత్తిందట.

వాహనంబు నెక్కవచ్చి భయంబుత
వడఁకి నేలఁబడ్డ వనజగర్భుఁ
గమిచికొని మరాళకము వాఁ
జెందమ్మికఱచికొని రయమునఁ బఱచి
నట్లు."

విష్ణువు గరుత్మంతుణ్ణి కౌగలించుకొని దాని కాళ్లూ వేళ్లూ పట్టుకొని ఇంటికి పారి పోయాడంటాడు'

'గరుడి నడుము మెడయు కాలును ళేలును,
ఇఱికికొనుచు చక్రి వెఱచి పఱచె'

కుబేరుడు నరవాహనుడు. ప్రమథగణాల బాధ తప్పించుకొనేందుకు ఆయనగారు పడ్డ పాటు—

'తన యెక్కిన మానిసిఁ దా
నవయము నెక్కంగ మఱచి యాతనిఁ
దన మూ
పున నిడికొని పఱచె భయం
బున ధనపతి తన్నుఁ బిఱుద భూతము
లార్వన్'—

వాహనమైన వాడిమీద తాను కూర్చోడానికి బదులు తనమీద వాణ్ణి ఎక్కించు కొని పారిపోయాడు. ప్రమథగణాలు 'ఓ' అని ,అరుస్తున్నాయి—వాడి తెలివితేటలు చూసి. అప్పుడు యుక్తాయుక్తజ్ఞానం ఎక్కడ వస్తుంది పాపం—తన బ్రతుకేమవు తుందో అని కుబేరుడి భయం. వాడి చేష్ట మాత్రం మనకి నవ్వు పుట్టిస్తూంది.

ఈలాగే ఒక్కొక్క దిక్పతి పొందిన అవస్థను కవి బీభత్సంగా వర్ణించినా అది తాత్కాలికవర్ణనలో హాస్యభంగిమ నే సూచిస్తూంది.

విరాటపర్వంలో కీచకునివల్ల జరిగిన అవమానాన్ని సైరంధ్రి వేషంలో ఉన్న ద్రౌపది కొలువుకి వచ్చి విరటునితో మొర పెట్టుకొంటుంది. ఆసమయంలో కంకభట్టయి వున్న ధర్మరాజు 'సభలో ఇల్లాలు ఇంతసేపు మాటాడడం, ఎదిరించడం తగునా? చాలు వెళ్ళు' అంటాడు. సైరంధ్రి వినలేదు. కంక భట్టుకి కోపం వచ్చి,

'పలుపోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున
నిచటం
గులసతుల గఱువ చందము
దొలగక నిట్టునికి దగునె తోయజవదనా.'

అని ఆక్షేపించాడు. అప్పుడు సైరంధ్రి అన్న మాటలు చురుక్కులే తగిన హాస్యపు పోటులే.

'నాదు భల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు, కాన పతులవిధమ
కాకయే శైలూషి గాననంగరాదు—

అంతేకాదు. జూదరి యాలికి గఱువతనం ఎక్కడిదయ్యా'—అంటుంది.

ఒక్కపంక్తిలో తిక్కన తన అసాధారణ మైన హాస్యరేఖాచిత్రం చూపి కవిబ్రహ్మ అయాడు.

రానురాను ప్రబంధయుగం అవతరించి హాస్యానికి స్థానం లేకుండా చేసుకొంది. ప్రాచీన కావ్యాలలో ఈ మాత్రమే నా హాస్యానికి తావుందిగాని తరువాతి వానిలో ఆ ప్రసంగానికే నెలవులేదు.

శ్రీనాథుని కావ్యాలలో ప్రత్యేకించి హాస్యానికి స్థానం కనబడదుగాని అతని చాటువులలో కొంత సున్నితమైన హాస్యం కనబడుతుంది. ముందే చెప్పాను. ఆక్షేప ణలో, సంస్కారపతుంలో చెప్పిన దానిలో హాస్యానికి తావు ఉంటుందని శ్రీనాథుడు పల్నాటిని ఉద్దేశించి చెప్పిన పద్యాలలో ఆ ధోరణి కొంత కనపడుతుంది.

'రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన ఏకులు వడకున్

## "ఆంధ్ర రత్న"

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు రాజమండ్రీ ట్రెయినింగ్ కాలేజీలో చరిత్రాధ్యాపకుడుగా పని చేస్తున్న రోజులలో కాలేజీకి తరచుగా ఆలస్యంగావెళ్లేవారట. పనిఉన్నా, లేక పోయినా టైముకు వచ్చి టైముకు వెళ్లాల్సిందేనని ప్రిన్సిపాల్ రాస్ దొర తాఖీదు పంపించాడు. ఈ తాఖీదును ఖాతరుచేయకుండా గోపాలకృష్ణయ్య గారు మర్నాడు కూడా ఆలస్యంగానే కాలేజీకి వెళ్లారు. ప్రిన్సిపాల్ ఆయన రావడానికి వీల్లేకుండా తలుపులు మూయించాడు. గోపాలకృష్ణుడికి తలుపులూ, పిలుపులూ కావాలా? గేటు దూకి లోపలికి జొరబడ్డారు. "ప్రతి రోజూ ఆలస్యంగా వస్తావే"మని రాస్ దొర అడిగాడు. "మాయింట్లో వంట లాలస్యమవుతాయి. అందుకని" అని గోపాలకృష్ణయ్యగారి సమాధానం. "అయితే మీ ఆడవాళ్లని త్వరగా వంట చెయ్యమని ఎందుకు చెప్పవు?" అని రాస్ అన్నాడు. దాంతో మా ఆడవారి సంగతి నీకెందుకని గోపాలకృష్ణయ్య గారు చొక్కా చేతులు పైకిలాగి యుద్ధానికి సిద్ధమయ్యారు. రాస్ దొర భయపడి తనగదిలో దూరి తలుపులు బిడాయించుకున్నాడు. ఈ గలాటా అంతా చూసి విద్యార్థులొకటేనవ్వు.

* * *

సభల్లో మాట్లాడడానికి ముందుగా ఉపన్యాసాలు వ్రాసుకోవడమంటే గోపాలకృష్ణయ్యగారికి వళ్లమంట. సభకు వచ్చిన తరవాత సభలో ఉన్న వారి మనోభావాల్ని బట్టి మాట్లాడ బోయేది అప్పటికప్పుడు నిర్ణయించుకో వాలిగాని ముందే ఉపన్యాసం సిద్ధం చేసుకోవడం తప్పనీ ఆయన ఉద్దేశం. "శిశువును చూడగానే తల్లికి స్తన్యం స్రవిస్తుంది. అది సహజం. అంతేగాని ఏదో నియమితకాలములందే బిడ్డకు పాలివ్వాలని నిర్ణయించుకోడం అసహజం. ప్రియుడు ప్రియురాలితో మాట్లాడబోయేదంతా ముందు వ్రాసి పెట్టుకోడు" అని గోపాలకృష్ణయ్యగా రనేవారు. ★

# ★ మన ప్రాచీన రచయితలు: ★

వసుధేశుడైన దున్నను
కుసుమాస్త్రుండైనజొన్నకూ తే కుడుచున్
'దోసెడు కొంపలో పసుల
త్రొక్కిడి మంచము దూడరేణమున్
మూసిన వంటకంబు పసి
బాలుర శౌచము విస్తరాకులున్
మూసిన గుడ్డలున్ తలకు
మాసిన ముండలు వంటకుండలున్
రాసెడు కట్టెలున్ తలప
రాదు పురోహితు నింటికృత్యముల్'

పలనాడు అంటే ఆనాడు శ్రీనాథుడు తనకు కావలసే భోగాలన్నీ ఇక్కడ లభించే సీమ అనుకొని వెళ్లాడు. అవి యేవీ లేవు. చీకాకు వేసి ఆ చీదరమీద ఇలా ఏడ్చి ఉంటాడు పాపం!

'గరళము మ్రింగితి నంచున్
పురహర! గర్వింపఁబోకు
హో హో హో! నీ
బిరుదింక గానవచ్చెడు
మెరసెడి రేనాటి జొన్న మెతుకులు
తినుమా'

కొండవీటులో గాడిద నుద్దేశించి అక్కడి చిల్లర కవులను నవ్వుల పాలు చేశాడు.

'గాడిద! నీవునుఁ గవివి
కావుగదా! ఇట కొండవీటులో'

అని—ఎంత గడుగాయితనం ఇది!

'వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్
విశ్వస్త వడ్డింపగా'—అన్నాడు కన్నడ దేశసంచారంలో ఒక యింట విందారగించిన సందర్భంలో—

అసలే అది తెలకపిండి గుండ. దానిలో వెల్లుల్లి కలిసింది. రుచికైతే బాగానే ఉంటుందిగాని పరమశివభక్తుని కది వెగటుగా తోచినట్టుంది. దానికి తోడు గాజులచేయి కాదు వడ్డించింది. విశ్వస్త. కవిసార్వభౌముని అవస్థ ఏమి చెప్పడం!....

తెనాలి రామకృష్ణుణ్ణి హాస్యకవిగా చెప్పుకుంటారేగాని అంత రసవంతమైన హాస్యం ఆయన కృతులలో కన్పడదు. అమవసనిసి అన్నమాట అలసని పెదనా ఇత్యాది చాటుపద్యాలు ఎవడో కల్పించినవి గాని చరిత్రాధారాన్ని బలపరచేవి కావు. కాదువాదంటే పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మోపాఖ్యానములో సారస్యం తీస్తే అక్క బోధలో కొంత ఆక్షేపగర్భమైన హాస్యం స్ఫురిస్తుందేమో; శీలం పిల్లిశీలమనీ, చదువులు చిలకల చదువులనీ అన్నది అక్క నిగమశర్మని—అంతే—దానికి తార్కాణగా వాడు ఆరాత్రి అందరూ నిద్రిస్తూఉంటే బోధచేసిన అక్క ముక్కుపుడకతో సహా నగలన్నీ ఒలిచి పట్టుకుపోయాడు. వాని ప్రవృత్తి మాత్రం హాస్యాన్ని సూచిస్తుంది. తుంటరితనానికి అది జయపతాక.—

ఈ నిగమశర్మోపాఖ్యానాన్ని దృష్టిలో పెట్టుకొని కందుకూరి రుద్రయ్య నిరంకుశోపాఖ్యానం అనే నాలుగాశ్వాసాల కావ్యం వ్రాసి అక్కడక్కడ చక్కని హాస్యం సూచించాడు. నిగమశర్మ ప్రవృత్తికీ నిరంకుశుని ప్రవృత్తికీ సాజాత్యం సరిపోవడమే కాక కొన్ని గుణాలలో నిరంకుశుడు నిగమశర్మకి ఒక మెట్టు పైన కూర్చున్నట్టు కనబడతాడు.

వేశ్యమాత పెట్టిన చకోరగుళ్లు తృప్తిగా తిని తలబరువెక్కి నిరంకుశుడు అడివికి పోయాడు. అక్కడ ఒక లింగము కనబడ్డాది. నిరంకుశుడు ఆ లింగాన్ని చూచి

'నాతోడుతన్
సొగటాలాడదవే నవేందుకుసుమ
స్తోతవ్య జూటాంతికా!' అని సంబోధించి జూదరులలో తాను అగ్రగణినని బిరుదు మాటలాడుతాడు. కొంగున మూటగట్టు కొన్న సొగటాలుతీసి గెల్చినవాడికి ఓడిన వాడు లంజను తెచ్చియివ్వాలని పందెం పెట్టి లింగం వంతుకూడా తానే సొగటాలాడి దైవగతివల్ల తానే గెలిచాడు. గెలిచి నందుకు దేవవేశ్య అయిన రంభను తెచ్చి యిమ్మన్నాడు. ఎంతకీ లింగం జవాబివ్వదు. దానిమీద నిరంకుశుడికి కోపంవచ్చి,

'తగునె పన్నిదమీక యీగతిఁ
దప్పు మానముఁ బాల్పఁగాఁ
దగునె నీకును నాకుఁ బెద్దల
దండఁ బెట్టెదఁ జండికై
గగనకేశ! యటంచుఁ జందురు కావి సేలు
గళంబునన్
పొగడ దండరయునర్చె నా విట
భూసురాగ్రణి దిట్టయై'

తన గుడ్డతీసి ఈశ్వరలింగానికి చుట్టి పెద్దలదగ్గర తగవు పెడతాను రమ్మని లాగుతాడు. చక్కని తగవు. విటుని గుర్మాన్ని వెల్లడించే హాస్యగర్భితమైన ఆక్షేపణ ఇది.

సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసములో దేవదేవి విప్రనారాయణుని వశపరచుకొన్న సందర్భంలో అతి సుకుమారమైన హాస్యం సవరించాడు. దేవదేవి నిట్టూర్పులలో, వాలుచూపులలో, జాలిమాటలలో, పైటఊపులలో తమ్మయ్య శృంగారానికి చేయూతగా ఇచ్చిన హాస్యం సువర్ణలేపనంగానే భాసిస్తూంది.

దేవదేవి మధురవాణులు విప్రనారాయణుని దర్శించి నమస్కరించగా,

'చందురుఁ గను నరవిందము
చందంబున మోము వంచి సంయమికులసం
క్రందనుఁ డారామద్రుమ
బృందము నడుచక్కని—

కిమ్మనకుండా పోయాడు. ఆదరి మాని ఇతడు చాలా గొప్పవాడే—అన్నాది మధురవాణి. దేవదేవి అందుకు ఒప్పుకోక

'ఇటువంటయ్యలు కారా
చిటుకుమనక యుండ సందెచీకటివేళన్
ఘటచేటీవిటులై యీ
కట్టకంబున తిరుగువారు కంజదళాక్షీ!
'కడసిమూడ ఘోటకబ్రహ్మచర్యంబు
పింగళాజపంబు పిల్లిశీల
మజగరోపవాస మల బకధ్యానంబు
నక్క వినయ మిట్టి నయములెల్ల—

అని హేళన చేసింది—తానన్న మాటే అయింది.

వేశ్యా సహవాసాలు శ్రీవైష్ణవులకు తగునా! కొమ్మా! ఆవల మమ్ములేమంటారో అని దేవదేవి సేవకు అనుమానించిన మహనీయుడు కాలుజార్చాడు.

'శిరసుపై పేను పొడగన్న చేరబోయి హింస సేయకుమని చేతికిచ్చే పరిస్థితికి దిగింది వజ్రపంజరనిభమైన వాని సద్భావం లోహమై, గ్రావమై, దృఢదారువై, తరుణవృక్షమై, ఫలప్రాయమై, పూవై, దానిలో మకరందమై పోనుపోను నీళ్లకంటెనూ పల్చనై కరగిపోయింది—ఒక్కడికే కాలుచాచి పడుండడానికి చాలని కుటీరం వర్షంపడిననాటిరాత్రి దేవదేవికీ విప్రనారాయణునికీ కూడా శరణ్యమైంది. అవుతుంది మరి—

'అయ్యోడ మిక్కిలి శైత్యం
బియ్యెడ కేతెమ్ము నీవు నింతీ!' అని ప్రియురాలిని నోరారా, మనసారా పిల్చి దాపునకు చేర్చుకొన్నాడా బోడి దాసరయ్య—రంగ రంగా అని రంగనాథ స్మరణమే జీవితపరమార్థంగా ఇనపకచ్చడం కట్టుకొన్నవాడు విటజనోచ్ఛిష్టయైన ఆ కుటిల వేశ్యను అంటుకొని బ్రాహ్మణ్యమంటు చేశాడంటాడు తమ్మయ్య—

రానురాను హాస్యాన్ని తీవ్రంగానూ, మృదువుగానూ చెప్పిచెప్పకుండా తన రచనలో నీరుపోసి పెంచినవాడు వేమన్న—కులమతాచారాలను విమర్శిస్తూ దంభవేషాలను ఆక్షేపిస్తూ తిట్టులో నవ్వు పుట్టించినదిట్ట వేమనయోగి—

పుణ్యక్షేత్రాలకు పోయి బుజ్జ గొరగించుకున్న వారికి

'మంత్రజలముకన్న మంగలి జలమెచ్చు'—అని బోధ చేస్తున్నాడు.

‘గొడ్డుటావు బిదుక
కుండ గొంపోయిన
పాల నీదు పండ్లు రాలదన్ను’ అని చివరి చరణంలో.

‘లోభివాని నడుగ లాభంబు లేదయా’– అంటాడు—

మోక్షానికిపోతే మొసలెత్తుకపోయిందంటాడు. గుహలలోకి పోయి జపం చేయబోతే పులిప్రత్యక్షమై మోక్షం సునాయాసంగా ఇస్తుందన్నాడు వేమన్న–మోక్షమేకదా కావలసింది జీవికి—తలచి చదవవలసే రచన వేమన శతకం–

హాస్యంకోసం ప్రాచీన కవుల గ్రంథాలు స్థాలీపులాకన్యాయంగా ఇంతవరకూ స్పృశించాము.

ఇటీవలివారిలో వారి జీవితాలకు సంబంధించే ముచ్చటలు కొంచెం అనుకొందాము.

వీరేశలింగంగారి ప్రహసనాలూ, పానుగంటివారి సాక్షి కొంచెం కరకుగానూ, అక్కడక్కడ చాదస్తంగానూ ఉన్నా హాస్యప్రధానములైన రచనలుగా వినోదానికి ఎన్నుకోవచ్చు:

తెలుగులో గ్రంథాలు వ్రాయకపోయినా వడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రులుగారు సరసంగా మాట్లాడే కవి అని ప్రసిద్ధి.

చెల్లెలూ, తానూ భోగిపండుగకు అత్తవారింటికి వెళ్ళారట. తెల్లవారిన తరువాత చెల్లెలు వరహాలపుంచెతో నగలు తోముకుంటూంది. శాస్త్రిగారి వదినగారు ఆమెను చూచి ‘వదినే! పందివా? ఏదుపందివా? అడవిపందివా’ అని అడిగిందట. శాస్త్రిగారి చెల్లెలు కొంచెం బొద్దుగా ఉంటుంది. అందుకు ఆవిడ హాస్యమాడింది. అక్కడికి పలుదోముపుడకకోసం వచ్చిన శాస్త్రులుగారు పందివో, ఏదుపందివో, అడవిపందివో తెలియదుగాని ముత్తెంమీద పందివే అన్నారట. చటుక్కున వదినెగారు లోపలికి పోయారట. వరహాపుంచె ఏపందిరోమంతో కట్టారనే ప్రశ్న చమత్కరించబోయి వదినెగారు పొందిన జవాబిది.

శాస్త్రులుగారు వామనావతారం. వడ్డన బంతి జరిగింది. ఆకుకొసను కందకూర వడ్డించారు–వదినగారు – తెలిసే. కందకూరంటే శాస్త్రులుగారికి మహాప్రీతి. చూస్తూ కూర్చున్నారు. అప్పుడు వదినగారు ‘ఏమిటి మరిదిగారు అలా కూర్చున్నారు? ఆ కందకా?’ అని అడిగారట. ‘ఔను వదినే! ఆ కందకే’ అన్నారట. సరేలెండని మళ్ళీ ఇంత కూర తెచ్చి అందేట్టు వేశారట ఆమె.

శాస్త్రులుగారు జగన్నాధస్వామి దర్శనానికి పూరీ క్షేత్రానికి వెళ్ళారు. స్వయంపాకం చేసుకొని మట్టావుల విస్తరిలో భోజనం చేస్తున్నారు. ఆ సమయంలో పెద్దపండా వచ్చి ‘ఏమిటి శాస్త్రులుగారూ! అన్నీ తెలిసిన పెద్దలు తమరు. ఎంత అఘాయిత్యప్పని చేస్తున్నారు? మా అవతారం పండుకోసే మట్టావును ఉచ్ఛిష్టం చేశేసేరా?’అని ఆక్షేపించాడు. చటుక్కున శాస్త్రులుగారు ‘భయపడకండి. మీకంటె నేనుచేసేదానిలో విచారించవలసేది లేదు. నేను మీ అవతారం పొన్నును ఉచ్ఛిష్టంచేశానేకాని మీరు అవతారాలకు అవతారాలనే మింగేస్తున్నారుగా’–అన్నారు నదురుబెదురూ లేకుండా. ఆ దెబ్బతో పెద్దపండా తలదిమ్మరింది. మరి కంటిచూపు లేదు. ఏప్యం అయిపోయాడు.

ఈ శాస్త్రులుగారు వ్రాసినదే సమాసకుసుమావళి. సంస్కృతం ఏమాత్రం చదివిన తెలుగువారికీ అది పరిచితమే. దానిలో విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ శాస్త్రులుగారు సహజహాస్యప్రియత్వమును చమత్కారంగా వెలిబుచ్చారు.

‘భూనాయకం వా ధననాయకం వా
భజన్ భువం వా ధనమేతి లోకః
తద్విఘ్ననాథం న భజామి కింతు
సహస్రశస్తం ప్రణమామి నిత్యమ్’—

లోకంలో భూనాయకుణ్ణిగాని, ధననాయకుణ్ణిగాని భజిస్తే భూమినిగాని, ధనమునుగాని పొందుతాడు. అందువల్ల విఘ్ననాథుణ్ణి నేను భజించను. వేయివిధాలా వానికి మొక్కులు మాత్రం చెల్లించుకొంటాను అంటారు శాస్త్రులుగారు. విఘ్ననాయకుణ్ణి సేవిస్తే విఘ్నాలు వస్తాయని చమత్కృతి.

అడిదం సూరకవికూడా ఈ ధోరణి కలవాడే అని అంటారు.

ఒకనాడు సూరకవిగారి భార్య భర్తను చూసి ‘ఏమండీ! అవునండీ మన అబ్బాయి

# ★ మన ప్రాచీన రచయితలు: ★

మీద ఓపద్యం చెప్పరండీ' అని అడిగింది. వెంటనే చెప్పాడు సూరకవి.

'బాచా బూచులలోపల
బాచన్నే పెద్దబూచి భావింపంగన్
బూచంటె రాత్రి వెఱతురు
బాచన్నను చూచి పట్టపగలే వెఱతుర్'
అని చదివాడు.

(బాచన్న అనేది ముద్దుపేరు. ఈబాచన్నే శుద్ధాంధ్ర రామాయణం వ్రాసిన బాలభాస్కరుడు.)

కొడుకు అంత చక్కనివాడట. రఘువంశాది కావ్యాలకు వ్యాఖ్యానం వ్రాసి అనేతుశీతాచలం పేరు పొందిన ప్రతిభాశాలిమల్లినాథసూరిని ఒకనాడుభార్య 'అవునండీ! నామీద ఒకశ్లోకం చెప్పరూ-' అని అడగగా వెంటనే 'ఇదుగో చెబుతున్నాను విను.' అని

'తింత్రిణీదళ విశాలలోచనా
నింబపల్లవ సమానకుంతలా
మేరుమందర సమానమధ్యమా
మల్లినాథగృహిణీ విరాజతే'
అని చదివాడట.

చింతాకులవలె వెడల్పయిన కళ్ళు వేపచిగుళ్లకు పోటి వచ్చేకురులు, మేరుమందర పర్వతాలను పోలిన నడుము కలదై మల్లినాథుని యిల్లాలు విరాజిల్లుతూంది—ఆ యిల్లాలు ఇది విని ఎల్లా సహించిందో గాని యీరోజుల్లో అయితే? . . .

ప్రస్తావికంగా చెప్పినదే అయినా తిరుపతివెంకటకవులలో ఒకరైన తిరుపతిశాస్త్రి గారు చెప్పిన యీ పద్యం ఎంతో గంభీరమైన అర్థాన్ని చెబుతూ పక్కున నవ్విస్తుంది.

"మును సౌగంధిక పుష్పమున్ గొనగ
భీముండేకైరం బోవ త్రో
వను సాక్షాత్కృతిచేసి ఖడ్గమృగమున్
వారింపగా నంజనా
తనయుం డెక్కుశు పేర్మి నిచ్చిన పదార్థంబే
సుమా యీపయిన్
జనువా డార్జనసేయు వెంకటకవీ!
సారస్య మట్లుండుటన్—

ఈ పయిని లోకంలో సారస్యమునుబట్టి ఆర్జనకుపోనే వచ్చేది వెంక్రుకలే అనే భావాన్ని శాస్త్రిలుగారు ఇంత గంభీర ధ్వనితో చెప్పారు.

చాలా శ్రమపడి హాస్యరసం పోషించి వ్రాయాలనే సదుద్దేశం గల ప్రతిభావంతులున్నా అలాటి గ్రంథాలు చాలా - చాలా యేమిటి - వేళ్ళమీద చెప్పాలన్నా అట్టే లేవు.

కూచిమంచి జగ్గకవి చంద్రరేఖావిలాపం తిట్టుకవిత్వంగా పొందిన పేరు బాగానే ఉంది. అందులో హాస్యం లేకపో లేదు. కాని దానిని ప్రమాణగ్రంథంగా పండితులు అంగీకరించినట్లు కన్పట్టగు ఏమైనా హాస్యం ప్రధాన రసంగా ఉద్భవిల్లవలసే కథావస్తువును తీసుకొని కావ్యాలు ప్రత్యేకంగా వ్రాయవలసే అవసరం ఎంతైనా ఉంది. కాని అది మాటలతో అయేపనిమాత్రం కాదు. ★



# పల్లకీ

(3 వ పేజీ తరువాయి)

పిల్లకి తెలిస్తేనా యేడిస్తేనా?

'ఒరె అబ్బాయిలూ! ఈ శపథిష లన్నీ నాతో లాభంలేదు. బస్తీమేసవాల్! గురువు కట్టిన ఆంజనేయులు బిళ్ల నా మెళ్లో వుండగా నన్ను జయించంది నాముందు మరో పిల్లి గాణ్ణి పల్లకీ యెక్కనిస్తావా?—హౌ! యూర్ ఫులి!'—(మీసం దువ్వి తొడ గొడతాడు)

'అరే! ఏమిటిదంతా? సాహిత్యానికి కుస్తీకి సంబంధం ఏమిటి?'—

'ఒరేయ్! అతిగా పేలకు. నాకసలు చిరాగ్గా వుంది—సాహిత్యంట సాహిత్యం! పల్లకీ యెవడెక్కినా సరే పీక నులిపేస్తాను. మందలించే పెద్దా చిన్నా లేకపోయినప్పుడేం చేస్తాం - నాబోటి రౌడీవెధవే జోక్యం చేసుకోవలసి వస్తుంది!' ★

# కుక్కతో కాదు

## మొరిగేవి కరవ్వు

కుక్కలేగాదు—మొరిగేవి ఏవీ కరవ్వు అని నా దృఢ విశ్వాసం. మొరిగే కుక్కలు కరువ నేరవు అని అందరూ ఒప్పుకుంటారుగదా! అందరూ ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా—మొరిగే కుక్కలు మొరిగేటప్పుడు కరవ్వనీ, కరిచేకుక్కలు కరిచేటప్పుడు మొరగవనీ ఒప్పుకుంటారు. అయితే, నా ఉద్దేశంలో మొరిగేవి ఏవయినా కరవనేకరవ్వు—మనుష్యులైనాసరే, కుక్కలైనాసరే, మరేవైనాసరే! కమ్యూనిస్టుల సంగతితీసుకోండి. కరిచినంతకాలం కరిచారా? మొరగటానికి అవకాశం దొరకగానే కరవటంమానేసి, మొరగటం ప్రారంభించారు. మరి బడిపంతుళ్ళు కరవలేకపోవడానికి కారణం పొద్దున్నుంచి సాయంత్రంవరకు వాగుతూండడమే. ఈవాగేఅవకాశమే (ఈ మొరిగే అవకాశమే)—కుర్రాళ్ళకివ్వండి: మాస్టర్లను కరవటం మానేస్తారు. అసలు ఈథియరీ విశాలహృదయంతో ఆలోచిస్తే ఆంధ్రులందరికీ వర్తిస్తుంది. వాళ్ళు (అంటే మనంఅన్నమాట) ప్రతివిషయంపైన మొరిగినంతకాలం మొరుగుతారు: తీరా సమయంవచ్చేసరికి కరవటం మానేస్తారు. మిగతా వాళ్ళు (—అంటే ఎవరో తెలుసుగా?) సమయంవచ్చేవరకు నిశ్శబ్దంగాఉండి, తటాలున కరిచేస్తారు.

అయితే—ఈథియరీలో నాకు పూర్వం అసలు విశ్వాసం ఉండేదికాదు. నాకీ దృఢ విశ్వాసం ఎలాకలిగినదీ అన్నది ఓపెద్దకథ. మీరు ఓపికపడతానంటే ఒక్కనిముషంలో చెప్పేస్తాను. మహా అయితే పదిహేను నిముషాలు.

పూర్వం నేను నాలుగురోజులు మాష్టరీ చేశాను. సరిగా మొదటిరోజునే ఏంజరిగిందంటే—ఒద్దులెండి! ఇక్కణ్ణించి చెబితే మీకేమీ అర్థంకాదు. మొదట మాఅన్నయ్యగారి బాపూ ఏమన్నాడో చెబుతాను. అక్కణ్ణించిచెబితే మీకు బాగా అర్థమవుతుంది—

మా అన్నయ్యగారి రెండోఅబ్బాయి బాపూ ఒకసారి నూతికి ఒకగట్టుమీద నిలబడి—రెండోగట్టుమీదకు తనుదూకగలనని తనకంటె చిన్నకుర్రాళ్ళకు నిరూపిద్దామనే ప్రయత్నంలోఉండగా—మామగారికి తెలియకుండా ముక్కుపొడుం పీలుద్దామని కిటికీదగ్గరకొచ్చిన మాఅన్నయ్య చూశాడు. కోపంవస్తే, మా అన్నయ్య వీపుచిట్లకొడతాడు. అదే! ఎవరిమీద కోపంవచ్చిందో వాళ్ళవీపు! గూఢచారులవలన విషయం తెలుసుకున్నాడు మావాడు. తెలుసుకొని, తిన్నగా వంటింట్లోకిపోయి వంటావిడ వెనకాల నిలబడ్డాడు. మావంటావిడ రాజమ్మగారి వెనకాల నిలబడ్డానికి ఎప్పుడూ ఇద్దరు ముగ్గురికి చోటుంటుంది. మా అన్నయ్య, ముద్దాయి కనపడకపోయేసరికి సాక్షులవీపులు రెండుచిట్లకొట్టి వెళ్ళిపోయాడు. బాపూ నాదగ్గరకొచ్చాడు.

ప్రమాదకరమైన పనులుచేయగా మిగిలిన కాలాన్ని బరువైన వాక్యాలతో ఖర్చుచేయటం మాబాపూకి అలవాటు. వాడు నాదగ్గరకొచ్చి అన్నాడు: 'పెద్దవాళ్లు ఒకప్పుడు తాము కూడా చిన్నవాళ్ళమని గ్రహించి ప్రవర్తించాలి' అని. నాకు తలకోపం తోకొచ్చింది, 'చిన్నవాళ్లుకూడా ఒ

**తురగా కృష్ణమోహనరావు**

ప్పుడు పెద్దవాళ్ళమవుతామని గ్రహించి ప్రవర్తించాలి' అన్నాను తీక్షణంగా. మావాడు నెమ్మదిగా జారుకొన్నాడు.

అసలు నాకైతే కోపం వచ్చింది కాని—మరెవరైనా అయితే మా వాడి మాటలకు పగలబడి నవ్వేవారే! నాకు కోపం రావటానికి కారణం ఉంది. ఒకప్పుడు నేనూ చిన్నవాణ్ణే. అంటే వయస్సులో. మా నౌఖరు వెంకన్న బజారు వెళ్ళేటప్పుడు నన్ను భుజంమీద కూచోపెట్టుకుతీసుకెళ్ళేవాడు. 'నువ్వు కలకటేరు నవుతావా?... మేస్ట్రేటు చేస్తా...వా?...మునసబుగిరీ చేస్తా...వా?' అంటూండేవాడు. నేను మాస్టరు చెయ్యవలసిన పరిస్థితి వాడెన్నడూ కలలో కూడా అనుకొని ఉండడు. అనుకొంటే కలలోనే ఆత్మహత్య చేసుకొనేవాడు. నేను కూడా ఎప్పుడూ అనుకోలేదు. అనుకుంటే మా డ్రాయింగు మాష్టార్ని 'పూరీకూర' అని పిలిచేవాణ్ణి కాదు. లెక్కల మాష్టారిపేరు కోపేటాగారని, జాగ్రఫీ మాష్టారిపేరు దడదడనాయుడుగారని గోడలమీద రాసేవాణ్ణి కాదు.

పొరపాటు మానవ సహజం. ఈ సంగతి నాకు పూర్తిగా తెలుసు. ఐతే-మా లెక్కల మాష్టారికి తెలియదనుకుంటాను. ఎప్పుడైనా పొరపాటున మా అన్నయ్య నా లెక్కల పుస్తకంలో ఎనిమిది తొమ్మిదులు ఎనభై తొమ్మిది అని వేస్తే, నా నెత్తిమీద మూడ్రెళ్ళు ఎనిమిది మొట్టికాయలు మొట్టేవారు. అసలే తెలివైన వాణ్ణేమో-నెత్తిమీద మొటితే బాగా నెప్పిగా ఉండేది. ఇలా ఉండగా - ఆయనే ఒకసారి పొరపాటు చేశారు. ఆయన చేసిన మొదటి పొరపాటు నాకో కవరు ఇచ్చి పోస్టు చేయమనటం. ఆయన చేసిన రెండో పొరపాటు కవరుమీద 'కొత్తపేట-తూ. గో. జిల్లా' అని రాయటానికి బదులు 'కోపేటా-తూ. గో. జిల్లా' అని రాయటం. రైళ్ళకంటె, గుడిదగ్గర జోళ్ళకంటె, ఆడవాళ్ళ నోళ్ళకంటె-వేగంగా కదులుతాయి మాష్టర్ల మారుపేర్లు. ఆయనకు 'కోపేటా' పేరు స్థిరమైపోయింది. మర్నాటి నుంచి ఆయన అమలాపురం నుంచి కొత్తపేట వెళ్ళవలసి వస్తే, ఆ బస్సు ఎక్కటానికి బదులు, ఎవరైనా చూస్తారేమోనని, కోటిపల్లి వెళ్ళి రాజమండ్రీ మీదుగా వెళ్లేవారు.

మరో మాష్టారుండేవారు. ఆయనకు నేనంటే ప్రాణం. అందుకని, ఏ పని కావలసి వచ్చినా, నా చేతే చేయించుకునేవారు. సిగరెట్లు కావలిస్తే-నా చేతే తెప్పించుకొనేవారు. సరిగా చదవటంలేదని నన్నే తిట్టేవారు. ఒకరోజున రాత్రి పన్నెండు గంటల వరకు పరీక్షకు చదివి అలసిపోయాం. విశ్రాంతి కావలసి వచ్చింది. ఒకపని చేసి అలసిపోతే, మరోపని చేస్తే విశ్రాంతి కలుగుతుందని పట్టాభిగారి లాగే మాకూ విశ్వాసం. మా మాష్టరుగారింటికి బయలుదేరి వెళ్లాం. ఆయన ఒక బేంకు మేనేజరుగారి ఇంట్లో ఉండేవారు. బేంకు మేనేజర్ల సంగతి మీకు తెలుసుగా? దేశంలో బేంకింగును అభివృద్ధి చేయటంకోసం చాకళ్లకు మంగళ్ళకు కూడా డబ్బివ్వటానికి బదులు చెక్కులు రాసి ఇస్తూంటారు. ఇంట్లో ఒక రూపాయి

# కుక్కలే కాదు

చిల్లర అట్టే పెట్టుకొని మిగతాది బేంకులో వడేస్తారు. రూపాయి చిల్లర ఇనప్పెట్టెలో పెట్టి, తాళం వేసి, తాళాలు బేంకులో పడేస్తారు. బేంకు మేనేజరుగారి తండ్రి 'ప్రాక్టికల్' వేదాంతిగా ఉండేవారు. ఆయన ఇహంలో దొంగల్నీ, పరంలో పాపాల్నీ ద్రోలడం కోసం ఆమడ దూరం వినపడేటట్టు భగవద్గీత పారాయణ చేస్తూండేవారు. వాళ్ళు రాత్రి పదిగంటలవరకూ బయటనే కూచొని - ప్రపంచకొన్నంతనీ ధైర్యంగా విమర్శించి, పదిగంటలు కొగానే లోపలికి పోయి తలుపు వేసుకొని కుర్చీలడ్డు పెట్టి పడుకున్నారు.

మేము విశ్రాంతికోసం మాష్టరుగారింటికి వెళ్ళి, 'దొంగలు, దొంగలు' అని అరిచాం. మా అరుపులు వినగానే ప్రేక్టికల్ వేదాంతిగారు ఒక్క దూకులో వచ్చి, ఎందుకైనా మంచిదని, కిటికీ తలుపు కూడా గడియ పెట్టేశాడు. పెట్టేసి, 'గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః...' అంటూ తిరిగి పారాయణ ప్రారంభించాడు. 'దొంగలు, దొంగలు' అన్నాం మేం. 'వస్తున్నా, వస్తున్నా' అన్నారు మేనేజరుగారు, లోపల్నించే, 'మాష్టారూ! దొంగలు, దొంగలు' అన్నాం. 'క్రరేది? తన్నండి. పట్టండి. కొట్టండి' అని అరిచారు మాష్టారు లోపల్నించే—మాకు సాయంచేయాలనే ఉద్దేశంతో. 'దొంగలు' అన్నాం మేం. మేష్టారు కూడా 'దొంగలు' అని అరిచారు. మాష్టారిపెళ్ళాం కూడా 'దొంగలు' అని అరిచింది. తలుపుకి మాష్టారు మరో పడక్కుర్చీ అడ్డుపెట్టారు. అరుస్తూనే వెళ్ళి, అప్పంగరిటె కూరపళ్ళెం అడ్డం పెట్టింది మాష్టారిపెళ్ళాం కిటికీ తలుపుకి.

ఎదురుగా 'మరిడి' అని మామిడితోపులో గుడిసేసుకొని కాపురముంటోంది. 'ఏంటయ్యా?' (అంది అని) బయటకువచ్చి. 'దొంగలు, మరిడీ!' అన్నాను. అది దేవాంతకురాలు. అబద్ధమనితోస్తే, అమ్మ దగ్గరికి పోయి చెబుతుంది. ఆవిడ చీపురుకట్ట తీస్తుంది. 'దొంగలు, మరిడీ!' అన్నాడు మా కిష్టిగాడు కూడా. 'మిడిగుడ్లు! కోరమీసము! వెడదమొగము! పెద్దనోరు! ప్రేలెడి పెదవుల్!' అన్నాను నేను మరిడిని నమ్మించాలని వ్యర్థప్రయత్నం చేస్తూ, ఆ పద్యం అప్పుడే చదివాం. మా కిష్టిగాడికి నవ్వాగలేదు. మరిడికి నవ్వు కనిపించకుండా హరికేన్ లాంతరు అటూఇటూ ఆడించాడు. 'ఇప్పుడేం దొంగోళ్ళయ్యా? పోయి పడుకోండి! అర్థరేతిరి కాని రారు. నేనల్లా పుంతకాడి కెల్తున్నా. నన్ను చూసి దొంగోడనుకునేరు' అంది మరిడి.

మాష్టరుగారు స్కూలుకి వారం రోజులు



దాక్షారామ ఆలయములో ముఖద్వారం ముందున్న శ్రీ దుండిగణపతి. ఆలయమునకు పోవు యాత్రికులు ముందు దుండిగణపతికి నమస్కరించి స్వామివారి దర్శనమునకు పోవుదురు.

ప్రతి చిత్రం: వి. ఆర్. శ్రీపతి

సెలవు పెట్టారు. ఆయన వచ్చేసరికి 'దడదడ నాయుడు' పేరు గోడలమీద చెక్కడం, చెరపడం కూడా అయిపోయింది.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే— నేనే మాష్టరీ చేయవలసి వస్తుందని కలలో కాకిచేత కబురొచ్చినా, చిన్నప్పుడింత అల్లరిచేసేవాణ్ని కాను. కాని ఏం చేస్తాం! విధిబలీయమని తెలుసు. తెలిసి, నోరు మూసుకొని ఊరుకుంటాం.

నేను నాలుగు రోజులు మాత్రం మాష్టరీ చేశాను. మొదటి రోజునే ఏం జరిగిందో తెలుసా? డ్యూటీలో ప్రవేశించగానే హెడ్మాష్టరుగారు నావైపు జాలిగా చూశారు. నన్ను నాలుగో క్లాసుకి పంపిస్తూ, కణ్వమహర్షి శకుంతలను పంపించారు. నేను వెడుతూంటే వెనక్కి పిలిచి-జస్ట్ ఏ మినిట్! నేను కుక్కలసంగతి కాదు చెబుతూంట? కుక్కలదగ్గర మొదలెట్టి అనుకోకుండానే మాష్టర్లలోకి పోయాను. మొదట కుక్కల సంగతి చెప్పనీండి! తరవాత మాష్టర్ల సంగతి చెబుతాను.

మా ఇంటికి వెళ్ళేదారిలో చాలా కుక్కలున్నాయి. అందులో ఏదీ నన్నింతవరకూ కరవలేదు. ఏదీ నన్ను చూసి మొరగలేదు కూడా. అవన్నీ సమయం కోసం వేచి చూస్తున్నాయని నా అనుమానం. ఉన్నట్టుండి, అది పరధ్యానంగా ఉన్నప్పుడో, నేను పరధ్యానంగా ఉన్నప్పుడో, లేచి తటాలున కరిచేస్తాయని నా భయం. నగరాలన్నిటిలో కుక్కలెలాగా రోడ్డుమధ్యనే పడుకొంటాయి కాబట్టి, నేను రోడ్డువెంట అర్థప్రదక్షిణాలు చేస్తూ నడవాల్సి వస్తూంటుంది. మా ఇంటి పక్కనే ఒకాయన ఉన్నాడు. అందరూ ఒకలా ఉండరుగా!

 

# కుక్కలే కాదు



ఆయనకు మొరిగే కుక్కల థియరీలో అంతు లేని విశ్వాసం. రోడ్డుమీద మొరగని కుక్కలు కనిపిస్తే, ఎక్కడ కరుస్తాయో అని భయపడి, అవి మొరిగేదాకా అక్కడ నుంచి కదిలేవాడు కాదు. ఆఫీసుకి వెడుతూన్నా సరే. రక్షమని ఆగి ఆ కుక్కమీద ఓ రాయి విసిరేవాడు, దారిలో రాళ్ళు దొరకవేమో అని భయపడి, ఇంటిదగ్గరే నాలుగు రాళ్ళు కోటుజేబులో వేసుకు బయలుదేరేవాడు. కుక్క నెత్తిమీద రాయి విసిరిన మరుక్షణం, ఆ కుక్క (ఎ) మొరిగేదయితే మొరుగుతుంది. లేకుంటే (బి) కరిచేదయితే కరుస్తుంది. కుక్క మొరిగేదయితే తోక ముడుచుకు పరుగెడుతుంది. కుక్క కరిచేదయితే ఈయన డిటో. ఆయనను ఎన్ని కుక్కలు కరిచాయంటే ఆయనలో కుక్క రక్తమే ఎక్కువ వుందని నా నమ్మకం. ఆయన వాగుతున్నంతసేపూ సరే! కాసేపు మాటాడకుండా నిలబడితే తొందరగా శెలవుతీసుకొని పరుగెడతాను. థియరీమాట దేముడెరుగు! బ్రతికుంటే బలుసాకు ఏరుకొని తినొచ్చు.

ఈ కారణంవల్లనే ఎవరైనా నాకేసి నిశ్శబ్దంగా నిలబడిచూస్తే నాకు తగనిభయం. నేను నాలుగో క్లాసులోకి వెళ్ళగానే క్లాసంతా నిశ్శబ్దంగా అయిపోయింది. అంతకుముందే హెడ్మాష్టరుగారు నావైపు జాలిగా చూసి: 'చూడండి, రావుగారు! కొత్తమాష్టర్ని చూసినప్పుడు పిల్లలు కొంచెం ఇదిగా ఉంటారు. ఓపికపట్టాలి!' అన్నారు. నేను క్లాసులోకి వెళ్ళగానే కుర్రాళ్ళు నావైపు నిశ్శబ్దంగా, బహిరంగంగా, లజ్జారహితంగా తేరిపారచూస్తూంటే నాకు అరికాలి ప్రాణం తోక్కొచ్చింది. 'ఏ క్లాసు?' అన్నాను. 'నాలుగు' అన్నారు కొందరు. 'కాదు, జాగ్రఫీ' అన్నారు మరికొందరు. 'ఎంతవరకు వచ్చారు?' అన్నాను. 'ఇంకా రాలేదు' అన్నారు కొందరు. 'సగానికి వరకు' అన్నారు మరికొందరు. 'ఆవు అయిపోయిందిసార్, కుక్క చెప్పాలి. మీరు చెబుతారా సార్?' అన్నాడు. రెండో బెంచీలో చివర్న కూచున్న ఓ కుర్రాడు. నాకు చాలా ఆశ్చర్యంవేసింది. మేం చదువుకునేరోజుల్లో జాగ్రఫీలో కుక్కల్ని గురించీ, ఆవుల్ని గురించీ చెప్పేవారు కారు మరి!

కుక్క పాఠంలో ఏం చెబుతారు? కుక్క విశ్వాసంకల జంతువనీ, దానికి రెండు కళ్ళు, నాలుగుకాళ్ళు అని, ఒక తలా తోకా అని ఎటుపెటగా. నేనులేచి సమాజ నినదమేఘ ధ్వనంలో గంభీరమైన ఉపన్యాసం చేశాను. యజమానులపట్ల విశ్వాసంతో ప్రాణాలనే బలియిచ్చిన కుక్కలనుగురించి, నే చెబుతూంటే నాకే కళ్ళమ్మట నీళ్ళు కారాయి. కుక్కపిల్లలు చేసే చిలిపి పనులు వర్ణిస్తూ, పిల్లలందరితోబాటు నేనూ పకపకా నవ్వేను. పిల్లలందరూ ముగ్ధులైపోయారు నాటి ఉపన్యాసానికి. పగలబడి నవ్వారు నా కథలకి. నవ్వనప్పుడు నోరు తెరుచుకువిన్నారు.

అందరూ అన్నాను: పొరపాటు! ఇద్దరు తప్ప మిగిలినవాళ్ళందరూ అనాలి. నాకు మనస్సు కష్టమనిపించింది. అందులో రెండో బెంచీమీద కుర్రాణ్ణి పిలిచి, జాలిగా: 'అబ్బాయి! నీకు చెముడా?' అన్నాను. 'లేదండి' అన్నాడు. 'పాఠం అర్థం కాలేదా?' అన్నాను. లేదండి - అన్నాడు. 'ఏముందోయ్ అందులో అర్థంకాకపోవటానికి కుక్కకి నాలుగుకాళ్లు...' అంటూ మొదలెట్టాను. 'నాకు తెలుసండి - మాకో కుక్క ఉంది' అన్నాడు. 'గుడ్. వెరీగుడ్!' అన్నాను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో. 'అది ఊ...రికే మొరుగుతుందండి' అన్నాడు. 'ఆరోగ్యానికి మంచిది' అన్నాను. 'అది కరుస్తుంది కూడానండి' అన్నాడు. 'నాన్సెన్స్' అన్నాను. 'నన్ను కరిచింది సార్ మూడుసార్లు! ఎడంకాలిమీద ఓసారి, కుడికాలిమీద ఓసారి, ఎడంకాలిమీద మరోసారి!' అన్నాడు. ముందు పొరపాటున 'ఇంజక్షనులాగ' అన్నాను. వెంటనే తేరుకొని 'స్టాండప్ ఆంది బెంచ్' అన్నాను.

రెండో కుర్రాడు: 'సార్?' అన్నాడు. 'ఏం కావాలి?' అన్నాను తీక్షణంగా—గంభీరంగా—పాడెలుకొట్టేటట్లు. ఈ విప్లవాన్ని నేనిక సహించదలచుకోలేదు. అంతకు ముందు నాకు మొరిగేకుక్కల థియరీలో నమ్మకం లేకపోయినా, నా ఉపన్యాసాన్ని కళ్ళార వింటూంటే నాకే నమ్మకం కలిగింది. అతను నావైపు బిత్తరపోయి చూశాడు. నాకు జాలేసింది. 'ఏమిటోయ్?' అన్నాను మెత్తగా. 'మాయింట్లో ఓకుక్క ఉందండి' అన్నాడు. 'మొరుగుతుందా?' అన్నా తీవ్రంగా. 'మొరగదండి' అన్నాడు. 'గుడ్. వెరిగుడ్. దొంగలు భయపడతారు' అన్నాను. 'అదికాదు సార్! మా కుక్క కరవదుకూడానండి' అన్నాడు. 'ఏదయినా జబ్బేమో! డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళు' అన్నాను. 'జబ్బేమీ లేదు, సార్! మూడుపూట్లా తిండి తినేసి మంచం కింద పడుకొంటుంది' అన్నాడు. నాకు నవ్వు ముంచుకొచ్చింది. 'ఒకరోజున తిండి పెట్టడం మానేయ్! అదే మొరుగుతుంది' అన్నాను విసురుగా, 'మానే కాదు, సార్!' అన్నాడు. 'ఏం జరిగింది?' అన్నాను చిరాగ్గా. వాడు నా వైపు తీరుగా చూసి 'అదే వంటింట్లోకి పోయి - తినేసి పడుకొంది' అన్నాడు. 'స్టాండప్ ఆంది బెంచ్' అన్నాను. వాడు బెంచి ఎక్కుతూనే - 'అప్పుడూ కూడా మొరగలేదు సార్' అన్నాడు.

నేను క్లాసు విడిచి వెళ్లేసరికి మా హెడ్మాష్టరుగారు బయటే నిలబడి ఉన్నారు. 'అంతా విన్నాను' అన్నారు. 'వాడు మా వాడే' అన్నారు. 'ఎవరు?' అన్నాను. హెడ్మాష్టరుగారు తలవంచుకొని, 'మొరగని కరవని కుక్క సంగతి చెప్పాడే! వాడు' అన్నారు. నేనాయన వైపు గుడ్లురిమి చూశాను. ఎంత హెడ్మాష్టరయితే మటుకు. నా మొహం చూసి ఆయన భయపడ్డారు. వెంటనే 'అంతా తల్లి పోలిక' అన్నారు. నా కాయన్ని చూస్తే జాలేసింది.

అప్పట్నుంచి ఇప్పటివరకు నా కాయనంటే జాలే! నాలుగు రోజులు పూర్తి కాక ముందే నేను మాష్టరీ మానేశాను. ఆయన హెడ్మాష్టరు వదలలేదు. మాష్టర్లు ఎప్పుడూ వాగుతూంటారని, కుర్రాళ్ళు ఎప్పుడూ కరవటానికి సిద్ధంగా ఉంటారని మనవి చేశాను. మాష్టర్లను చూసి జాలిపడితే— హెడ్మాష్టరును చూసి ఇంకా జాలిపడాలి!

మొరిగే వాళ్ళు కరవలేరన్న సంగతి విడిచిపెట్టి, ఎక్కువ వాగేవాళ్ళు తక్కువ కరుస్తారని, తక్కువ వాగేవాళ్ళు ఎక్కువ కరుస్తారని అంటే అందరూ ఒప్పుకుంటారు మనమంత్రులే ప్రత్యక్ష నిదర్శనం. వాళ్ళు వాగిన విషయాలలో సత్వరం కరిచిన ఉదాహరణలు బహుకొద్ది. మరి నిజంగా కరిచిన సమస్యలను గురించి ఎందుకో 'మొరగనే మొరగరు.'

ఏది ఏమయినా—మొరిగేవి ఏవయినా కరవనేరవని నా దృఢవిశ్వాసం. ఇది స్థానికమయిన విషయం కాదు. తెలుగు వారికొక్కరికే సంబంధించినది కాదు. అంతర్జాతీయ ధర్మశాస్త్రాలలో ఇది ఒక్కటే. పండిట్ నెహ్రూ మొన్న ఒక్క చోట మాట్లాడుతూ - 'మొరిగే కుక్కలు కరవనేరవని ప్రచారం జరుగుతోంది. నాకు నిశ్వాసం లేదు' అన్నాడట. పండిట్జీ వంటి పలుకోధవాది అంతమాట అన్నాడంటే నేను నమ్మను. కాకపోయినా—విషయాన్ని సాకల్యంగా పరిశీలిస్తే ఆయనే అభిప్రాయం మార్చుకొంటాడు.

జస్ట్ మినిట్! నా అభిప్రాయం ఎలా మారిందో చెబుతానుకున్నాను. ఆ విషయమే మరిచిపోయాను. నాకు మొరగటం ప్రారంభిస్తే ఎక్కడ ఆపాలో తెలియదు. ఈ మాటెప్పుడైనా చెబుతాను. 



# చేబదులిచ్చిన రూపాయి




## పంతుల సావిత్రి

కామాక్షమ్మగారంటే మా ఇంటి పక్క వాటాలో కాపురముంటున్న రిటైర్డు రైల్వేస్టేషనుమాస్టరుగారి భార్య. వారిది ఒకప్పుడు బాగా డబ్బుండి, తరువాత చితికి పోయిన సంసారమని అంటుంటారు తెలిసిన వాళ్లు. కాని నేనెరిగిన ఈ నాలుగైదేళ్ళలో ఆమె 'చితికిపోవడ' మేమిటో ఎవ్వరికీ తెలియనియ్యకుండా, గుట్టుగా కాలక్షేపం చేస్తోంది. పిల్ల జల్ల లేకపోవడంచేత, ముసలి కాలంలో కూడా ఆ దంపతు లిద్దరూ ఇరుగు పొరుగు వారితో స్నేహంగా ఉంటూ చీకూ చింతా లేకుండా కాలం గడుపుతూ ఉంటారు. కామాక్షమ్మగారంటే నాకెంతో స్నేహమే కాక, గౌరవంగాకూడా ఉండేది. అందుకనే ఆవిడ నాదగ్గర చేబదులుగా పుచ్చుకున్న ఆ ఒక్క రూపాయి ఈ సంవత్సరం పొడుగునా తిరిగి ఇవ్వకపోయినా, నేనావిడని అడిగేందుకు సాహసించలేదు. అదే ఇంకొకరైతే, అలా అప్పుగా పుచ్చుకొని ఎగవేసినందుకు నేను వారి భరతం పట్టేదాన్నే. కాని కామాక్షమ్మగారి సంగతి వేరు. అసలు ఆవిడ నా రూపాయి ఎగవేసేరకం కాదనీ, కేవలం మరచిపోయిందేమోననీ నా విశ్వాసం.

మొదట్లో ఆవిడ కారోజు రూపాయ ఇచ్చిన సంగతి మరచిపోదామని నేను చాలా ప్రయత్నించాను. కాని అది అప్పట్లో సాధ్యంకాలేదు. ఆ పరిస్థితి అలాంటిది. గత సంవత్సరం సరిగ్గా ఆగస్టు నెల ఆఖరువారంలో జరిగిం దీసంఘటన. మా ఆయన చేసేది లెఖ్ఖల ఆఫీసు గుమాస్తాగిరీ అవడంచేత ప్రతి నెలా ఆఖరివారంరోజులు మా గృహ పంచాంగరీత్యా పూజ్యమైన పర్వదినాలు! నెలంతా ఎంత పొదుపుగా ఖర్చుచేసినా, ఆఖరువారం బజారు వెచ్చాలకి ఇబ్బందిపడక పోవడం మా జాతకాలకి వ్రాయలేదు. అందులో ఆగస్టునెల అంటే వరుసగా వచ్చే రెండవ ముప్పైఒక్క రోజుల నెల! మా దుర్భిక్షానికి అది అధికమాసం!

ఆ రోజు ఆమె వాళ్ల చెల్లెలిగారి ఊరి నుంచి వచ్చి రిక్షా దిగుతూనే, "సావిత్రమ్మ గారూ. ఏది ఒక్క రూపాయి ఉంటే ఇలా ఇవ్వండి," అన్నారు. రిక్షా అబ్బికివ్వ డానికైతే నాలుగణాల డబ్బులతో సరి పోతుందే అని నాలో నేననుకున్నా. పొత్తుగా అణా, అర్ధణా అయితే ఇవ్వడం పుచ్చుకోడం కూడా మొహమాటంగానే ఉంటుందికదా అనిపించింది. ఆవిడ దగ్గర చిల్లర నోట్లుకూడా లేవో యేమో! వెంటనే నేను మా ఆయన పర్సులో మిగిలిన ఆఖరి ఒక్క రూపాయి తెచ్చి ఆవిడ కిస్తూ మాట వరసకి 'చాలా?' అని కూడా అన్నాను. 'ఆఁ' అంటూ చిన్న చిరునవ్వుతో ఇంట్లోకి పోయిందావిడ. అలాటి ఆ 'రూపాయి' ఆవిడ అప్పుగా పుచ్చుకున్నదికాదని నేను ఇంకోలా ఎట్లా భావించేది?

మరో నాలుగురోజుల తరువాత ఓసారి ఆవిడ మా ఇంటికి వచ్చి, ఏదో లోకాభి రామాయణం మాట్లాడుతూ తన చెల్లెలిగారి ఊరిగురించి చెప్పడం ఆరంభించింది. ఆ ఊరిలో ఎండ లెక్కువనీ, చలికూడా ఎక్కువగానే 'వేస్తుందట' అనీ ఏమేమో చెప్పిందేకాని, నా రూపాయి సంగతే మాట్లాడదే! పోనీ మరచిపోయింది కాబోలు, ఏదో రోజున జ్ఞాపకంరాకపోతుందా అని మరో పక్షం రోజులు ఎదురు చూశాను. కాని నా ఊహ నిష్ఫలమైంది. నాకూ మొండి పట్టుదల కలిగింది. పట్టుదలకి లోబడి 'నా రూపాయి నా కివ్వండి' అని సూటిగా అడిగే సాహసం మాత్రం చాలక, ఏదోవిధంగా ఆవిడకు జ్ఞాపకం చెయ్యడానికి ప్రయత్నాలారంభించేను. (అప్పుడావిడ మరిచిపోయిందనేగా, నా అభిప్రాయం.)

రెండుమూడుసార్లు నేను మళ్లీ పని కట్టుకొని ఆవిడతో వాళ్ళ చెల్లెలిగారి ఊరి విషయమై ప్రస్తావించేను. ఆ ఊళ్ళో బహుశా ధరవరలు ఎక్కువగా ఉంటా యేమోననికూడా అడిగేను. ఈ రోజుల్లో ప్రయాణాల్లో కలిగే ఇబ్బందులు, 'ఖర్చు' గురించి వ్యాఖ్యానించేను. మాటల సందర్భంలో అవకాశం కలుగ చేసుకొని, "అబ్బే రిక్షావాళ్లకి అయిపోతుందండి, బోలెడు డబ్బు," అని కూడా అనేశాను. ఆ మాట లన్నప్పుడు, 'రిక్షావాడు', 'డబ్బు' అనే మాటలను ఘట్టిగా, వత్తి పలికేనుకూడా! అయినా ఆమె నిండు విగ్రహం చలించలేదు. ఇక లాభం లేదని ఆఖరు ప్రయత్నంగా "మీ చెల్లెలిగారి ఊరు వెళ్ళి వచ్చినందుకు ఈ ప్రయాణంలో మీకు చాలా డబ్బు ఖర్చుఅయి ఉంటుందే" అన్నాను. "ఇలాంటి చిల్లరి విషయాలకి లెక్కలు పద్దులు రాయడం నా కలవాటు లేదమ్మా," అందామె చిన్నగా నవ్వుతూ. దాంతో నా నోరు బందైంది!

### చమకబేరం

ప్రసిద్ధ ఇంద్రజాలికుడు గారడీ ప్రదర్శనంలో ఒక ఖాళీ పెట్టెలో ఒక అమ్మాయిని పెట్టి మూత వేసేశాడు. కొన్ని నిమిషాల తరవాత మూత తీసి చూపించాడు. అమ్మాయి బదులు రెండు కుక్క పిల్లలు బయటికి వచ్చాయి.

ప్రదర్శనమైన తర్వాత ఒకడు ఇంద్రజాలికుని వద్దకు వెళ్లి రహస్యంగా ఇలా అన్నాడు:

"అదుగో ఆ ఎదటి సీటులో కూర్చున్న మాఆవిడని పెట్టెలో పెట్టి మాయం చేయగలరూ?"

"చెయ్యగలను. కాని మీ ఆవిడ బాధపడలేక నేనా?" అని అడిగాడు ఇంద్రజాలికుడు నవ్వుతూ.

"అంతేకాదు. మా బాబిగాడు కుక్కపిల్లలు కావాలని రోజూ ఒకటేపోరు. సరే రెండూ కలిసొస్తాయిగదా అని"

# ★ చేబదులిచ్చిన రూపాయి ★

ఆ తరువాత కూడా ప్రతీసారి మేం కలిసినప్పుడు ఏదోవిధంగా నే నావిడతో డబ్బు మీది సంభాషణతో తప్పనిసరిగా సాగించాను. కాని ఆవిడ జ్ఞాపకశక్తి మాత్రం –ఆ ఒక్క రూపాయికి– ఎంతో అతీతంగానే ఉంటూ వచ్చింది! కాకపోతే, కొత్త పేపర్లు చదివే అలవాటున్న మనిషి. కాబట్టి కామాక్షమ్మగారు ప్రపంచ బ్యాంకు భారత రైల్వేలకు ఎన్ని కోట్ల రూపాయలు ఋణం ఇవ్వబోతున్నదో దగ్గరనుంచి వాళ్ళ ఆయన రిటైరు కాకముందు తన క్రింద పని చేసే వారికి "చిన్న చిన్న అప్పులు ఇస్తూ ఉండే వారి" మనిన్నీ–వాళ్ళు మాత్రం ఏదో రీతిగా ఆ పైకం ఎగవెయ్యాలని ప్రయత్నిస్తుండేవారనీ ఎంతో విపులంగా చెప్పేది.

అవన్నీ వింటూంటే నా కప్పుడప్పుడో అనుమానం కలుగుతుండేది: "ఒక వేళ ఎప్పుడైనా నే నే ఆవిడదగర ఒక రూపాయి అప్పుగా పుచ్చుకొని, ఇవ్వడం మరచిపోయానా?" అని అలా తిట్టుకున్నప్పుడల్లా, నాకు నిజంగా 'ఏడుపులాంటి నవ్వు' వచ్చేది. కాని పొరపాటున కాబోలు నేమోననిపిస్తూ ఉండేది కూడా!

కాకపోతే కామాక్షమ్మగారంతటి మనిషి ఒక్క రూపాయి కోసం అంత మతిమరపుగా ప్రవర్తించడ మేమిటి?

అదైనా ఏ తిరునాళ్ళలోనో, ఏ సినిమా హాలు దగ్గరో పుచ్చుకున్న చిల్లర డబ్బులైతే మరచిపోవచ్చు కాని, ప్రత్యేకం మా ఇంటి దగ్గర, నెలాఖరు రోజుల్లో నా దగ్గర ఉన్న ఒకే ఒక్క ఆఖరు రూపాయి పుచ్చుకొని మరచిపోవడం అంటే, సాక్షాత్తు ఘోరమే కాక, మన యావద్భారతదేశానికి ఎంతో నైతికపతనం కూడా!

ఒకసారి అనుకున్నాను, ఒక్క కామాక్షమ్మగారిని మినహాయించి మిగతా మా వీథిలో ఉండే నలుగురు సోదరీమణులను చేరదీసి, నా నాయకత్వాన ఒక "అఖిల భారత నైతికోద్ధరణ" సంఘం [చిల్లర అప్పులశాఖ] లాంటిదేదైనా స్థాపించేద్దామని! ఆ సంఘ సభ్యురాండ్ర (చేరితే సభ్యులకూడా) ముఖ్య బాధ్యత; తాము ఎవరెవరిదగర ఒక్క రూపాయి, లేక అంతకులోపు మొత్తాలు అప్పుగాపుచ్చుకొని తీర్చకుండా మరచిపోయారో వారి పేర్లన్నీ అకారాదిక్రమంలో లిస్టుగా రాసుకొని ఉంచుకోవాల్సి ఉంటుంది..."

నా ఈ ప్రతిపాదనలనుగాని నా స్నేహితురాండ్రెవరైనా కామాక్షమ్మగారి చెవినిపడేశారా, ఆమె పరుగెత్తుకొనివచ్చి ముందుగా నా రూపాయి నాకిస్తారని నాకు బాగా

## భర్తవేపు చుట్టాలు

భార్యని అస్తమానం ఏదో వేళాకోళం చేయడం భర్తకీ, భర్తకి ఛెళ్లుమని జవాబు లివ్వడం భార్యకీ అలవాటు. ఒక రోజు షికారుకు పోయారు. రెండుగాడిద లెదురొచ్చి ఓండ్ర పెట్ట నారంభించాయి.

భర్త:—ఏమేవ్, మీచుట్టా లల్లేవుంది నిన్ను చూసి ఓండ్రిస్తున్నారు."

భార్య:—అలా ఓట్రించకండి మరీ. పెళ్ళయ్యాకేగా వీళ్లు నాచుట్టాలైంది!"

తెలుసు. అయితే దయచేసి ఆవిడతో ఈ విషయాలు ముందుగా ప్రస్తావించవద్దని నా స్నేహితురాళ్లను ప్రార్థించాలనికూడా నిశ్చయించుకున్నాను.

ఇలాగ అలాగ ఆలోచించుకుంటూ ఉండగానే మరోవారం పదిరోజులు గడిచాయి. ఈ ఆలోచనలతో సతమతమవుతూ గోజువారి గృహకృత్యాల్లో చాలా పరధ్యానంగా ఉంటున్నానని మా ఆయన చాలా సార్లు హెచ్చరించేరు. (పప్పులో ఉప్పు ఎక్కువ కావటం, కాఫీలో పంచదార వెయ్యకపోవడం ఇత్యాదులకి మా ఆయన నిఘంటువులో అర్థం నాకు పుట్టింటికిపోయి మా వాళ్ళను చూసిరావాలనిఉంది అని, తదనుగుణంగా ఆయన ప్రయత్నాలారంభించి వారంరోజుల శెలవుకికూడా దరఖాస్తిచ్చి వచ్చారట!)

ఓ రోజు మధ్యాహ్నం కొత్త బద్ధకంగా పడుంకాల్సి, మూడుగంటల ప్రాంతంలో నిద్రలేచేసరికి మా పక్కవాటా కామాక్షమ్మగారింటోంచి ఏవో రాద్ధాంతాలు, సిద్ధాంతాలు వినిపిస్తున్నాయి.

ముందు గోడపక్కకిపోయి నిల్చునివిన్నాను. అవతల వీథిలోని సోదరీమణు లిద్దరూ, వారిలో ఒకరింకొకరి కిచ్చిన ఒక పావలా అప్పునుగురించి వాదులాడుకుంటున్నారు. కామాక్షమ్మగారా ఉభయుల్ని రాజీపరచాలని సంప్రదిస్తున్నారు.

"అయినా, ఇలాంటి చిల్లర అప్పులు పుచ్చుకోనే కూడదు. పుచ్చుకున్నా, వెంటనే చెల్లించెయ్యా లమ్మడూ..." కామాక్షమ్మగారి గొంతుకతో ఈ మాటలు

# * లింకన్ ఛలోక్తులు *

అమెరికన్ కాంగ్రెసు ఎన్నికల ప్రచారం ముమ్మరంగా జరుగుతోంది. ఒక స్థానానికి అబ్రహాంలింకన్, పీటర్ కార్ట్‌రైట్ అనే మత ప్రచారకుడు పోటీచేస్తున్నారు. ఒకరోజున కార్ట్‌రైట్ ఒక సభలో తనకే ఓట్లువెయ్యమని ప్రజలను కోరుతూ ఇలా అన్నాడు:

"అన్నివిధాలా మంచి వాడైన వ్యక్తిని కాంగ్రెసుకు ఎన్నుకొని స్వర్గానికి పోదలచుకున్న పుణ్యాత్ములు నుంచోండి."

ఒకడు తప్ప అంతా నుంచున్నారు.

"పాపాత్ముడూ, అధర్మపరుడూ అయిన వ్యక్తిని కాంగ్రెసుకు పంపించి, నరకానికి పోదలుచుకున్న వారు నుంచోండి."

ఎవ్వరూ లేవలేదు. ఇందాకా నుంచోక ఇప్పుడూ నుంచోక అలాగే కూర్చున్న వ్యక్తికేసి అంతా ఆశ్చర్యంగా చూశారు.

"నువ్వు స్వర్గానికీ వెళ్ళక, నరకానికీ వెళ్ళక ఎక్కడికి వెడదామని?" అని కార్ట్‌రైట్ అడిగాడు.

"కాంగ్రెసుకి" అని సమాధానం చెప్పి లేచిపోయాడా వ్యక్తి. అతడే అబ్రహాం లింకన్.

అమెరికా అంతర్యుద్ధ కాలంలో అధ్యక్షుడుగా ఉన్న లింకన్ పేరు చెబితే జాలిగా, గంభీరంగా, ఏదో ఆలోచనలో మునిగినట్లు చూసేవ్యక్తి జ్ఞాపకం వస్తాడు. అతడు హాస్యచతురుడనీ, ఎప్పుడూ ఏదో హాస్యకథ చెప్పి తనుకడుపుబ్బనవ్వి, ఇతరులను నవ్వించేవాడనీ చాలామందికి తెలియదు.

లింకన్ తన్ను గురించిన ఈ కథ ఎప్పుడూ చెబుతూ ఉండేవాడు:



"ఈ యుద్ధంలో జెఫర్‌సన్ డేవిస్ గెలుస్తాడని నా నమ్మకం. ఎందుకంటే జెఫర్‌సన్ ఎప్పుడూ దైవప్రార్థన చేస్తూ ఉంటాడు" అని ఒకావిడ అన్నదట. రెండో ఆవిడ "లింకన్ కూడా దైవ ప్రార్థన చేసే మనిషే. అతడెందుకు గెలవకూడదు?" అని అడిగిందట. "లింకన్ తమాషాకి ప్రార్థన చేస్తున్నాడని దేవుడనుకుంటాడు, అందుకని," అని మొదటావిడ అన్నదట.

అధ్యక్షపదవికి లింకన్‌తో పోటీచేసిన డగ్లస్ ఒకసారి లింకన్‌ను "Two Faced man" (రెండుముఖాల మనిషి) అని ఒక సభలో ఆక్షేపించాడట. లింకన్ సభకేసి తిరిగి "సభికులారా! నాకే రెండు మొహాలుంటే ఈ మొహం ఎందుకుంచుకుంటాను చెప్పండి," అన్నాడట.

ఇక కొద్దికాలానికి చనిపోతాడనగా లింకన్‌కి ఒక కలవచ్చిందట. తను ఉండే "వైట్‌హౌస్" లోనే గొల్లున ఏడుపులు వినిపించినట్టు, "ఏం ఎవరు పోయారు?" అని రక్షక భటులను అడిగితే "అధ్యక్షుడు పోయాడు. ఆయన్నెవరో హత్యచేశారు" అని వారు సమాధానం చెప్పినట్టు కలవచ్చింది.

లింకన్ భార్య ఈ కల విని చాలా విచార పడింది. ఆమెకు ధైర్యం చెప్పడానికి లింకన్ ఛలోక్తిగా "అబ్బే నేను కాదు కలలో చచ్చిపోయింది, అధ్యక్షుడట." అన్నాడు.

లింకన్ హాస్యోక్తులలో ఇదే ఆఖరుది. ఆతరవాత కొన్నాళ్ళకే ఆకల నిజమై ఊరుకుంది. ★

---

వినగానే చెప్పొద్దూ నాకు అరికాలిమంట నెత్తికెక్కింది.

ఈ రోజు ఆవిడ కెలాగైనా పాఠం నేర్పాలని నిశ్చయించుకొని, నేనూ అక్కడికి బయల్దేరేను.

నన్ను చిరునవ్వుతో పలకరించి ఆహ్వానిస్తూనే ఆవిడ! "అయినా, ఇందులో నీ దోషం కూడా ఉందమ్మాయి. ఒకవేళ నీ దగ్గర పావలా పుచ్చుకున్న విషయం ఆవిడ మరచి పోయిందనే అనుకో. ఒకసారి జ్ఞాపకం చేసి ముఖతః అడిగి తీసుకోవాల్సిందే కాని, ఇన్నాళ్ళూ ఊరుకొని ఇప్పుడీవిధంగా సాధించడం తగదు సుమీ!" అంది ఆ రెండో ఆవిడ్ని సంబోధిస్తూ.

దాంతో నా ఉత్సాహం కొంపలేచరు మళ్ళీ నార్మలు కొచ్చింది. ఈవిడ్ని మరి సాధించలేనేమోరా, భగవంతుడా అని విచారించాను.

పోనీ మరోవిధంగా ప్రయత్నించి ఆవిడతో: "ఇదిగో, కామాక్షమ్మగారూ! ఫలానా రోజున మీరు మీ చెల్లెలిగారి ఊరి నుంచి వచ్చి రిక్షా దిగుతుండగానే, అవసరమై మీ దగ్గర ఒక రూపాయి పుచ్చుకున్నాను," అని నేనే ఆవిడకింకో రూపాయి ఇవ్వ జూపితే?

ఇది కొంత ఘటిమాతాదే కావచ్చు. దీంతో ఆవిడ సిగ్గుతో చచ్చినంత పనిఅయి, పశ్చాత్తప్త హృదయంతో క్షమాపణ కోరుకుంటూ నా రూపాయి నాకు తిరిగి ఇవ్వవచ్చు.

కాని ఆవిడముఖం చూస్తే నాకు, ఆ నమ్మకం కూడా సడలిపోయింది. తీరా ఆవిడ చిన్నగా నవ్వుతూ: "సరేలే, అమ్మా, దానికేముందిలే" అంటూ ఆ రెండో రూపాయి కూడా తీసుకుంటేః పోయిన రూపాయికోసం ఇంకో రూపాయి కూడా పందెం కాచి జూదం ఆడినట్టే!

ఆవిడ 'మరచిపోయిన నా ఒక్క రూపాయి' వసూలు చేసే కార్యక్రమంలో, నా ప్రణాళికకి అక్కడితో పెద్ద ఫుల్‌స్టాపు పెట్టాను! ఆ విషయం 'మరచిపోవాలి. మరచిపోవాలి' అని రోజూ వందసార్లన్నా మననం చేసుకుంటుంటాను.

మరచిపోదామనుకున్న నా నిర్ణయం పొరపాటుగా మరచిపోతానేమోనని జ్ఞాపకంగా నా చీరకొంగు ముడివేసుకొని, మాటిమాటికి చూసుకుంటుంటాను కూడా! ★

# వెయిటింగు రూంలో



(విజయవాడ రైల్వేస్టేషన్ వెయిటింగ్ రూం. రైల్వేవారు లావుపాటి ప్రయాణీకులను దృష్టిలో వుంచుకొనే ఆ గదిలో విశాలమైన ఈజీచైర్లు ఏర్పాటు చేశారు. ఒకకుర్చీలో ఓ లావుపాటి శరీరం విశ్రాంతి తీసికొందామనుకొన్నది. కాని ఆయనకు తగని చిరాకుగా వున్నది. ఆయనపేరు శ్రీ గణపతిశాస్త్రి ఇంటిపేరు చిలకమర్తి వారు...)

గణ: ఛీ.. ఛీ.. ఏం రైల్వేలూ! ఊపిరాడడంలేదు. దానికుంపాటెగిరి.. పోనీ తినడానికేమైనా వుంటే! మా బావగారింట్లో తిన్న పకోడీలేగాని.. మళ్ళా ఎరగను అలాంటివి... తింటే విజయనగరం పకోడీయే—

గిరీశం: (ప్రవేశం.. పొడుగ్గా, ధోవతీ, లాల్చీ, జరీయంచు వుత్తరీయం, చలువ కళ్ళజోడు ... వస్తూనే గణపతినిచూసి— తనలో) వీడెవడో విజయనగరం వూసెత్తుతున్నాడు. పాతకాపు కాడుకదా! ఇటువంటప్పుడే—" అట్నుంచి నరుక్కు రావడం వుత్తమమైనపని. (పైకి) నమస్కారం. .

గణ: ఎవరూ! (తనలో) వీడెవరో ప్రదేశ ఆహారశాఖాధికారి కాడుకదా!

గిరీ: నాపేరు గురజాడ గిరీశం...ఎక్స్-సోషల్ రిఫార్మరును. ప్రస్తుతం పొలిటికల్ రిఫార్మర్స్ సొసైటీ చైర్మన్ను. అసలు దేశం నన్ను యెరుగును. కాని — "ఇంత తెలివిగలవాడితో మనం వేగలేం?" అనుకొని నన్ను ఆదరించడం మానేశారు ... ఆంధ్రప్రదేశం యేర్పడ్డదేగాని మా అప్పారావుగారి వాక్కు యింకా అమలులోకి రాలేదనే నావిచారం ... ఆహా యెంత బాగా చెప్పారండీ ఆయన "పరుల కలిమికి పొర్లియేడ్చే పాపికెక్కడ సుఖం కద్దోయ్"అని బుద్ధొచ్చేట్లన్నారు. ప్చ్ ... ఏంలాభం? ఈ గిరీశం వూరుకొంటేగాని...ఆ అన్నట్లు తమ నామధేయం...?

గణ: మీరడిగారుకాదూ! నాపేరు చిలకమర్తి శ్రీ గణపతిశాస్త్రి. నన్ను యెందరో యెరిగి వున్నారు. మీకు తెలియదేమో! పోన్లెండి...ఇప్పుడుకలిశాంగా...మీకెక్క

> **ఏకాంకిక**
>
> పాత్రలు:
> గురజాడవారి గిరీశం
> చిలకమర్తివారి గణపతి
> మొక్కపాటివారి పార్వతీశం...
> బుచ్చిబాబుగారిజగన్నాథం(పురఫ్) జగ్గు.
>
> కాలం:
> మధ్యాహ్నం 12 నుండి 8 గం. ల లోపల.
>
> స్థలం:
> విజయవాడ రైల్వేవారి 3 వ తరగతి వెయిటింగ్ రూం.

డైనా స్టేషన్లో పకోడీలంటూ కన్పించినవా? అవంటే నాకు తగనియిష్టం... యీవెధవ స్టేషన్లో అవే కరువయ్యాయి...

గిరీ. అబ్బే! లేదండీ! పోని స్టేషన్ కొస్తూ బజార్లో తీసుకోలేక పోయారా?

గణ: ఊరిలోకి వెళ్ళివుంటే ఆపనే చేసి వుందును. ఈ శరీరంతో ఎక్కడ పోగలను! అయినా- వెధవరకం తవుడుబిస్కట్లు, పంచదార చాకలెట్లు అమ్ముతుండకపోతే- ఆంధ్రుల అభిమాన పిండివంట, ఆపకోడీలు...

గిరీ: మన నివాసం విజయనగరమనుకొంటాను!

గణ: అబ్బే! విజయనగరమే అయితే యింక లేనిదేమిటి? ఆ దేవిగారి మిఠాయి దుకాణమే మన నివాసం అయివుండేది. అయినా నేనే ఓకొట్టు పెట్టివుంటే-"విజయనగరం పకోడీదుకాణం" అని పెద్దపెద్ద అక్షరాలతో ఓ బోర్డువ్రాయించి, ఆబోర్డులో కొసను ఓనకిలీ వెండిపళ్ళెం బొమ్మ, అందులో నిగనిగలాడుతూ, ఎర్రగా వేగినట్లున్న పకోడీలబొమ్మ వేయించి—

**సత్యసాగర్**

గిరీ: చంపేశారు పొండి! మీ రిక్కడ వుంటారని తెలిసివుంటే- ఓ మణుగు నేతి పకోడీలు ఓ కూలివాడి నెత్తిన పెట్టి, పట్టించుకొచ్చి వుండేవాడిని. ఏంచేస్తాం? ఇప్పుడు "టైమ్" చాలదు...

గణ: ఆహా! యెంత మంచివారండీ మీరు! ఏదో నా బాధ గమనించారుకనుకా ఆమాటైనా అన్నారు. ఈ కాలంవాళ్ళు చూశారూ...మరీ యీ యింగిలీసు చదువు మరిగి- నోటి కెంతవస్తే అంత.. ! మొన్న మా బావగారి మూడోవాడు- ప్రేలెడువెధవ, నన్ను పట్టుకొని- "తిండిపోతూ!"అన్నాడు. ఎంత యిదిగా అన్నాడో చూశారూ! అయినా మీరేచెప్పండి. తినగలవాడూ, హరాయించుకోగలవాడు తినక మన్నుగొట్టుకొంటాడాండీ?

గిరీ మాబాగా చెప్పారు.. "పిలకాకికేం తెలుసూ వుండేలుదెబ్బ!" వెనక యెవరో గాంధిగారికి వేరుశెనగ మంచిఆహారం అన్నాడట. నేనయితే- మిమ్మల్ని చూపి, పకోడీలను మించిన తిండి లేదనేవాడిని... ఇంతకీ మీరు పొగ త్రాగుతారా?

గణ: ఛీ. పొగా! యాక్! దానికి మనకూ ఆమడ అంటే ఎనిమిది మైళ్ళ దూరం మనం...ఒకటోరకం. నశ్యము వాడుతూ వుంటాము.

గిరీ. ఓహోహో! యెన్ని ఉత్తమ లక్షణాలూ! ప్రాచీనాంధ్రకవులందరూ నశ్యవశ్యులే. అందుచేతనే వారు అనేక ఉత్తమ కావ్యాలు వ్రాయగల్గారు. ఈ విషయమే నేను ప్రాచీనాంధ్ర సాహితీ పరిషత్లో మూడుగంట లేకబిగిని లెక్చరిస్తే.. "ఓహో గిరీశంగారూ! వన్సుమోర్" అంటూ-అబ్బ- ఏం మెచ్చుకొన్నారనుకొన్నారూ! పొగాకు చక్కగా నశ్యం చేసుకోకుండా వెధవాయలు కాల్చి పారేస్తున్నారు. ఏ నాటికైనా యీ గిరీశమే టుబాకో మినిష్టర యిన్యాడంటె—పొగాకు కోటానంతా నశ్యం కోసమే కేటాయిస్తాడు. అసలు "నిర్బంధ నశ్యవాడక విధానం" అమలు చే[illegible]లి. లేకుంటే పొగ లోపలికి పీల్చి, ఊపిరి[illegible]లో క్షయరోగులు పెరిగి, బోలెడు క్షయాను

పత్రులు కట్టించాలి... అదా లేకపోగా అనేక లక్షల వ్యయం ప్రభుత్వానికి. క్రమంగా యీ విధానం విశ్వవ్యాప్తం చేస్తాను. అప్పుడు మీరు నా వద్దకు వస్తే— "హిస్ హైనెస్-గిరీశం ది గ్రేట్" మీకు ఓ రత్న ఖచితమైన డబ్బాలో మేలురకం నశ్యం బహూకరించి, దానిని మీరు పీలుస్తుండగా—ఆ... అన్నట్లు యేదీ? ఓ చిటిక యిలా రాల్చండి? (చేయి జాపును.)

గణ : ఓ దానికేం... అయ్యా! యిదిగో! (ఓ చిటిక రాల్చును.)

గిరీ : (పీల్చి) ఆహా! ప్రాణాన్ని నిలబెట్టారు... థాంక్స్.

గణ : అయ్యో! యెంతమాట! మీరు పుత్రులు... మీకు నావంటివారు సవాలక్షలు దొరుకుతారు... (రైలుకూత విన్పించును.) అరే! రైలు వచ్చిందే! మీరు వస్తారా?

గిరీ : అబ్బే! నేను హైదరాబాదు ఎక్స్‌ప్రెస్‌కు వెళ్ళాలి... ప్రణాళికా శాఖాధికారులు సలహా కావలసి నాకు 'వైర్' చేశారు. ...నాకసలు తీరికేదీ? కాని — మాట తీసేయలేక—

గణ : అలాగా అయ్యా! మరి వస్తా! మావేపు... అంటే పిఠాపురం వస్తే—యీదాసుడ్ని మర్చిపోకండి... వస్తామరి! (పోవును)

గిరీ : ఎంతమాట! మన బ్రెయిన్ "ఫారిన్ మేడ్"......గుడ్ గాడ్! దేశం అసలే కరువులో పడి తన్నుకు చస్తూవుంటే—యీ తిండిపోతుల్ని సృష్టించావా నాయనా? నీకసలు బుద్ధివుంటే—దేవుడివెందుకవుతావ్? అయితే అయ్యావు కాని — విప్లవ కారులకు కన్పించేవు... "భడవా! యిదా నీసృష్టి" అని ఎముకలు విరగ కొట్టేరు...! ఎవరది? వాడెవడో నాకు పోటీ... కొంపదీసి లాయరు కాదు కదా! కాకేం? ఆ నల్లకోటూ...

(సమ్మర్ క్రాఫు, అక్షింతల బొట్టు, ధోవతి నల్లకోటు, తెల్ల ఉత్తరీయం—ఓ పరుపు చుట... మొక్కపాటి పార్వతీశం ఎక్స్ బారిస్టర్ ప్రవేశం)

పార్వ : అబ్బా! (ఓ కుర్చీలో కూర్చుని గిరీశంను అనుమానంగా చూచును.)

గిరీ : నమస్కారం... నన్ను గిరీశం అంటారులెండి... పొలిటికల్ రిఫార్మర్స్ సొసైటీకి అధ్యక్షుణ్ణిలెండి... తమరూ?...

పార్వ : నేనాండి! నాపేరు పార్వతీశం... మా యింటిపేరు మొక్కపాటి వారు. ఉత్తరదేశ యాత్రకు బయలుదేరాను. ఓ కొద్దిపాటి పని కల్పించుకోవాలని సంకల్పంలెండి. ఢిల్లీకని బయలుదేరాను. తీరా టిక్కట్టుతీసి, యీవలకు వచ్చి చూద్దును గదా—వాడు—ఆ టిక్కట్టు యిచ్చేవాడు—కలకత్తాకు టిక్కట్టు యిచ్చాడు. సరే!... పోనీ... యేదయితేనేం? ఢిల్లీ మాత్రం చేయదా కలకత్తా! ఏమంటారు?

గిరీ : బాగా చెప్పారు... కలకత్తాకేమండీ? అసలు ఆ మాటకొస్తే—కలకత్తా ఢిల్లీ బాబులాంటిది. నన్నడగండి, చెప్తాను... అసలు నా లైఫ్‌లో చాలాభాగం కలకత్తాలోనే గడిచింది! What a won

# ★ వెయిటింగ్ రూములో గిరీశం ★

derful city! కలకత్తా యెంత గొప్పదను కొన్నారు... అబ్బో! చెప్పలేం! అంత గొప్పది! చూస్తే కలకత్తాయే చూడాలి... తింటే అక్కడి రసగుల్లాలే తినాలి...

పార్వ : అబ్బే! నాకుమాత్రం అవేవీ నచ్చలేదండీ! అందుకని మూడురోజుల క్రితం మా ఆవిడవుంది చూశారూ! దానికి మరీ మరీ చెప్పి—మైసూరు బూరెలు-అంటే పెద్దసైజు చక్రాలు చేయించి, పరుపు చుట్టలో పెట్టేశా...! ఇంకా పండుంపు ల్లలూ, ఓ యిత్తడిచెంబూ, ప్రక్కక్రింద కని మా ఆవిడవి రెండు పాత చీరలూ... యేదో ఓ చిన్న సంసారంలా.... యింకా యేమో—

గిరీ : ఎంత జాగ్రత్తగలవారండీ! నిజంగా మీలాంటివారు నూటికి—అహ. కోటికి కూడా ఒకరుండరు. ఏమయినా మనవైపు చక్రాలు అంత బావుండవు, చక్రాలు తినాలంటే—పూనా వుంది చూశారూ! అక్కడ తినాలి... ఆహా!

పార్వ : అబ్బెబ్బే! అలా అనకండి! మా ఆవిడా! మహాశేర్వరి... వేరుశెనగ నూనె మరిగించి చేసిన చక్రాలు... తింటే వదలరు... అందులోనూ స్పెషల్. తెలుసా? ఉండండి. మీరే చూస్తారుగా! (బెడ్డింగు త్రాళువిప్పి, అందులోని ఓ పాత గుడ్డమూట విప్పి, నాలుగు చక్రాలు గిరీశంకు పెట్టి, సామానులన్నీ లెక్కచూసి, మరల బెడ్డింగు బిగించి) ఏమంటారు? అమృతం కదూ! చెప్పేదాకా కనుక్కోగలరా సెయ్యేనముకొంటారా? (రైలు ఆగిన శబ్దం విని) అరే! అదుగో! రైలు వచ్చిందే! వస్తా మరి! (క్షమించండీ! మరి... (పోతూ) వాటిరుచి తప్పకుండా ఉత్తరం వ్రాసి, తెల్పుతారుగా! పార్వతీశం, యింటిపేరు మొక్కపాటివారు అంటే చాలు... మావూరికే వ్రాయండీ...(వెళ్లెను).

గిరీ : అబ్బా పోరా నాయనా! వూరికే అన్నారూ! "చాదస్తంమొగుడు..." ఘోరం కంపు! కస్బా బజారులోగూడా వుండదు. ఏంజేస్తాం? మన చేతుల్లోవనా! టేబుల్సు టరనయినప్పుడు... వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకొన్నాడు. మనమూ అంతే... తప్పనిసరి...

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా తిండిమ్రింగి అంతో, యింతో-
దుప్పటి నిండుగ కప్పక
చప్పున మరి నిద్రతోడ తూగుటెతగురా!

(వాకిలివైపు చూసి) వీడెవడు కుర్రకుంక! మా వెంకటేశం కాడుగదా! (నిదానించి) కాడులే...వీడెవడో వెధవాయ! చూద్దాం! మంచం తలక్రిందుగా కొలవమనిగదా గురూపదేశం ...... జైగురుదేవా! నీదయ వుండాలేకాని......అలా...అలా "వటుడింతై, యింతింతై" అన్నట్లు అహంతముగా—

(జగన్నాథం వరఫ్ జగ్గుప్రవేశం...ఖద్దరు పైజమా ... కంటిమెడలాల్చీ ... చేతిలో పేము సంచి.)

గిరి : కమిన్‌ప్లీజ్ !

జగ : (ప్రవేశిస్తూ) అయా చిత సత్కారం ...... ధన్యుడను. కృతజ్ఞుడను. (కూర్చొంటూ) తమ నామధేయము వినకుతూహలం బయ్యెడిని..."ఆప్ కా నామ్ జాన్‌నాచాహతాహూఁ!" ఈమధ్య హిందీ కూడా దంచేస్తున్నాంలెండి...!

గిరి : ఐ యామ్ గురజాడ గిరీశం!

జగ : ఓహో! తమరా! కిళ్ళన్నావ్? కిళ్ళన్నావ్? త్రిప్పి చదువుకొండి...... ప్రతిభావంతులు. ప్రస్తుత మేవిధినిర్వహణము "హాండిల్" చేయుచున్నవారూ?...

గిరీ : "వాట్ ఎమాన్?" (తనలో) వీడెవడో నా గుట్టుమట్టు లెరిగినాడాయేమి చెప్మా! కొంచెం వళ్ళు దగ్గరపెట్టుకోవాలి......అంతిగా తప్పినట్టే—పుంజాలు త్రెంపుకపోవడమే ... (పైకి) నాయనా! ఎవరివాడవోయి నీవు?

జగ : (నవ్వుతూ) మాటదాటేశారా మహాత్మా! "తొల్లిగతించె-నేడు" యిక్కడెక్కడో అరసున్నావుండాలే...పోనీ... తరువాత శర్మగారినడిగి కనుక్కోవచ్చు. ఆ...వీడు జగన్నాధుడు అనగా లార్డ్ ఆవ్ యూనివర్స్ పేర విలసిల్లువాడు....స్వామీ! తమ విడో-లవ్వర్ బుచ్చమ్మ కుశలమా?... Just out of curiosity అంతే.

గిరీ : (తనలో) వీడెవడో...మన కమామిషు అంతా యెరిగినవానిలా వున్నాడు. డామిట్! కథ మళ్ళీ అడ్డంతిరిగింది....! ఇక్కడనుండి బయటపడటమే యిక గత్యంతరం! కాకుంటే వీడెవడో-ఆ పూటకూళ్ళముండనిచూడా వెంటబెట్టుకొచ్చేట్టున్నాడు....వెధవాయ....! (పైకి) ఆ...ఏవన్నావు నాయనా? బుచ్చెమ్మా! ఇంకెక్కడి....అరె! రైలువచ్చినట్లుంది. వస్తా.... మరి శెలవ్! (గబగబా వెళ్ళును).

జగ : (నవ్వుతూ) శుభం! పోయిరా స్వామీ!

(రాగయుక్తంగా) "ఎందరో మహానుభావులూ...."

(అంటూ ఈజీచైరులో పడుకొనుచుండగా.) ★

—తెర—

# కరణాల ముచ్చట్లు

"కరణము విరసుండైనను
మరణాంతికమైన గాని మానడు భువిలో"
అనేది ఒక లోకోక్తి—అంటే కరణమే గనుక విరసత్వం బూనితే, ఎదిరి మరణంవరకు వదలడన్న మాట. గ్రామంలో కరణానికున్న ప్రభావానికిది నిదర్శనం. పెక్కు పల్లెల్లో ఉన్నట్లు గ్రామపతికూడా కరణమే ఐతే ఇంక చెప్పాలా?

"సామజము చేను మేసిన
దోమలు పదివేలు దాని దోలంగలవా?
గ్రామపతి తగవు దప్పిన
గ్రామస్థులు వేవురైన కాదనగలరా?"

అన్నారు ఇందుకే కాబోలు. అయితే ఒకరు పై రెండు పాదాలు విని ఎదిరినిగూర్చి గాదు "కరణం చచ్చినా వదలడు" అన్నట్లు వ్యాఖ్యానించవచ్చు కాని దీనికీ తార్కాణం లేకపోలేదు — బతికినవాళ్ళను మంగలంలో మాడ్చినట్టు గ్రామస్థుల్ని వేపుకుతిని, చచ్చీగూడా సాధించాడట ఒక కరణం!

ఆ వూళ్లో హిందువులకు మహమ్మదీయులకు పచ్చగడ్డివేస్తే భగ్గుమనేదట. కరణం బతికున్నన్నాళ్లు వీరివైరాన్ని పురస్కరించుకుని, ఉభయుల్నీ సాధించేవాడట. తుదకు ఆయనకు అంత్యకాలం ఆసన్నమైంది. ఇంక నేడో రేపో పోతాడు సుఖపడతాం అనుకుంటున్నారట ఉభయ పార్టీలూను. అంతిమశ్వాస విడుస్తూ, ఆత్మీయుల్ని చేరబిలిచి, "నాకొక కోరిక—ఇదే తుదికోరిక—వుంది చెల్లిస్తారా?" అన్నాడట. "అలాగే" అని వాళ్ళు చేతిలో చెయ్యివేశారట. "నేను చనిపోగానే, నా శరీరాన్ని దహనం చెయ్యకండా, తురకల గోరీల దొడ్డిలో పూడ్చిపెట్టండి." అన్నాడట. "సరే" అన్నారు వాళ్లు కొన్నేపటికి కాలం చేశారు కరణంగారు. ఆయన కోరిక ప్రకారం శవాన్ని గోరీల దొడ్డికి తీసుకెళ్ళి గొయ్యి త్రవ్వడం మొదలు పెట్టారు. ఇంక చూసుకోండి. తురకలు చురకత్తులు, బాకులు, ఖడ్గాలు తీసుకు బయలుదేరారు యుద్ధానికి. రైతులు మటుకు వూరుకుంటారా? కత్తులు, బల్లేలు పట్టుకు వీరభద్రుడు సంబరానికి వేంచేసినట్లు ఎగబడారు. ఇరుపక్షాలా పుర్రెలు కొబ్బరికాయల్లాగ ఆకాశంలో ఎగిరాయట. పోరు ముగిసిన తర్వాత ఊరంతా అనుకుంది "కరణం చచ్చి సాధించాడురా బాబూ!" అని. ఈ కథ నాకు చెప్పిన గడిదేరిన ముదికరణంగార్ని "ఆవూరు ఏవూరండీ?" అని అడిగి తీరా వెళ్లి వాకబుచేస్తే "ఏడు మూడు పురు సాంతరాలా ఇక్కడలాంటిది జరగలే" దన్నారు. ఏది ఎలాగున్నా ఈ కథ మటుకు తెలుగునాట పల్లెసీమలో పాతుకుపోయింది.

* * *

కొందరు చెప్పే కథనం ప్రకారం క్రీస్తు

"శండిల"

పూర్వం నుంచీ కూడా కరణాల ప్రభ గ్రామాలలో వుండినట్లు తోస్తుంది. మొగలాయీ పాదుషాల కాలంలోను బ్రిటిషు హయాంలోను వీరు గ్రామపాలకులుగా వుంటున్నారు. ఊరు ఊరంతా కరణం అంటే గజగజలాడేదట. ఒక సందర్భంలో గ్రామస్థులంతా కరణానికి ఎదురు తిరిగారట. వాళ్లకి తగినశాస్తి చెయ్యాలని పై అధికారులతో "ఈ సాలున పంటలు విరగబండాయి" అని చెప్పాడు కరణం. దానికి తార్కాణంగా "ఏ పైరు చూచినా, కర్ర బారెడు-వెన్ను మూరెడు" అని వర్ణించాడు. అధికారులకి రిపోర్టు యిచ్చి కరణం ఊళ్లోకి రాగానే రైతులిది తెలుసుకున్నారు ఎలాగో. క్రియకు ఆయనతో రాజీపడక తప్పిందిగాదు. అధికారి అజమాయిషీకి విచ్చేశాడు. "పన్ను బడకూడదు - నా మాట అధికారి ముందు దబ్బర కాకూడదు - ఎలాగా?" అని ఆలోచించి నిలువెత్తు పెరిగి వెలివెన్నువేసిన వరిమడిలోకి తీసుకెళ్లాడు, ఆయన్ను. ఆ పొలంలో ఏ వెన్ను కోసినా మూరెడుకు తక్కువలేదు తెల్లగా మిలమిలలాడుతోంది. కర్ర నిలువెత్తు పెరిగున్నదాయె నా పెను కోయించి కళ్లంలో వేయించి ఏ కర్ర వలిచి చూసినా గుప్పెడు గంజలు కనబడదు! "ఇదేమిటయ్యా- 'కర్ర బారెడు, వెన్ను మూరెడు' అన్నావే - గంజ కనబడదే!" అన్నాడు అధికారి.




* రెక్సోనా సబ్బులో, కేడిల్...
చర్మమును పోషించునటువంటియు
మీ సహజ సౌందర్యమును బయ
ల్పరచుటకు సహకరించునటు
వంటియు ఒక ప్రత్యేక నూనెల
మిశ్రమము గలదు.




ఇది ఒక్కటే కేడిల్‌తో గూడిన టాయిలెట్ సబ్బు
రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్ తరఫున భారతదేశంలో తయారుచేయబడినది

# ★ కరణాల ముచ్చట్లు ★

**"కామెడీ ఆఫ్ టెర్రర్స్"**

ఒకలావుపాటి గృహిణీమణి అర్ధరాత్రి ఇంట్లో జొరబడ్డ గజదొంగని అమాంతం వళ్లు చితగ్గొట్టి, పళ్లు రాలగొట్టి, కాళ్లు విరగ్గొట్టి కట్టి పడేసింది. ఈ గలభా విని పరుగెత్తు కొచ్చిన ఇరుగు పొరుగువాళ్లు ఆవిడ శౌర్యధైర్యాలకు ఆశ్చర్య పడ్డారు. అందులో ఒకాయన ఆవిణ్ణి మెచ్చుకుని "ఏమండీ, మరీ అంత ఇదిగా హూనం చేశారేమండీ వెధవని!" అని విచారపడ్డాడు.

"అబ్బే వాడు దొంగ వెధవని నే ననుకోలేదండీ. మా ఆయనకోసం మూడు గంటలనేపు నుంచి కాసుక్కూర్చున్నాను. గోడదూకి వస్తుంటేను, ఆయనేనేమో అనుకున్నాను," అన్నది ఆ మహా ఇల్లాలు.

"చిత్తం-చిత్తం ఎండమూరి పంట కర్రబారదు, వెన్ను మారదు-ఊదితే ఉట్టిదేనండి," అన్నాడు కరణం తనను సమర్థించుకొని. వెంటనే ఇంక అజమాయిషీ అక్కరనే లేదని ఊరంతకి ముజరా ఇప్పించాడు అధికారి.

*　　*　　*

అయితే, అనేకసార్లు మిడిమిడిజ్ఞానంతో మిడిసిపడే అధికార్లు కొందరు - అందరూ కాదనుకోండి. అనుభవజ్ఞులైన కరణాల్ని తేలికగా చూడ్డం కూడా కద్దు. ఒకసారి తాశిల్దారుగారు కరణానికి తాఖీదు చేశారుట-"మీరు పంపిన లెఖ్ఖల నిండా తప్పులున్నాయి, ఇక ముందు ఇట్టి తప్పులు చేయవద్దు. మీకు వార్నింగు యిస్తున్నాను. ఈ లెఖ్ఖలు, నోటీసు ముట్టినట్టు సంతకం చేసి వెంటనే వాపసు చేసేది." అని వుందిదానిలో. ఆ కరణంగారికి ఇంగ్లీషు రాదు. నోటీసు చూసుకుని, మళ్ళీ మళ్ళీ చదువుకుని. అందలి వెనక్కీటేని ఇలా వ్రాసి త్రిప్పేశాడట. "అయ్యా! మీ తాఖీదు చూసుకున్నాను. లెఖ్ఖలు చేరినవి. వాటిలో ఎక్కడ వెదికినా మీ రిచ్చిన "వార్నింగు" కనుపించడం లేదు. బహుశా తమరు మరచిపోయి వుంటారేమో. కాన ఈ జవాను ద్వారా సదరు "వార్నింగును" వెంటనే పంపించ గోర్తాను."

*　　*　　*

బెజవాడలో నేలనుకుంటా జిల్లాకలెక్టరు - ఆయన పేరు కృష్ణారావుగారుట - జమాబందీ ఏర్పాటుచేయించి కరణాలందరినీ రమ్మని తొందలుడిపిస్తూ తాఖీదు చేశాడట. గేదె దూడల్లాగ మోయలేని బరువు గల దస్త్రాలు



29 ఆగస్టు 1956 బుధవారం గోదావరి వరదల రోజులలో శ్రీ కృష్ణజయంతి రోజున ఉదయము 10 గం॥ పుష్కరరేవులో 6వ స్తంభం అవతల నీళ్ళలో మునిగి డబ్బులు ఏరుకొనే పుత్రవాళ్లకు దొరికిన శ్రీ విఘ్నేశ్వరస్వామి.

ప్రతిచిత్రం: వి. ఆర్. శ్రీపతి.

తెమ్మని ఆయన అనుగ్రహంకోసం పడిగాపులుపడి కరణాలు కంచిగరుడసేవ చేస్తున్నారు. ఎంతకీ సంతకానికి పిలవడే - రోజులు గడుస్తున్నాయి. సంక్రాంతి నెల. నాతిగల బ్రహ్మచర్యం భరించ శక్యం గాకుండా వుంది. కాని ఏం చేస్తారు? ఏమన్నా అంటే జిల్లాకలెక్టరు మండిపడతాడేమో! తుదకొకనాడు విసిగిపోయి ఆయన బంగళా ప్రక్కనుంచిపోతూ ఆయనకు వినబడేలాగ ఈ పాటపాడుతున్నాడట ఒకరణం:

"కృష్ణలో చన్నీళ్లె చే బళ్
కష్టముల్ బడుచుండగా మా
కష్టములు మదిదల్పడాయెను కృష్ణరావు పంతులూ
రాములూ, సీతారాములూ —
వంటపూటి సుబ్బమ్మ పెట్టిన
కందిపప్పూ మెతుకులూ
మంటలే పుట్టించుచున్నవి మా పు రేపున కడుపులో
రాములూ, సీతారాములూ"

ఓపిగ్గా ఈపాట విని ఆనాళే మధ్యాన్నం అందరినీ కబురంపి లెఖ్ఖలమీద గీకెట్టి పొమ్మన్నాడట కలెక్టరుగారు!

*　　*　　*

"కరణంబు లేని యూరును" అన్న సుమతీ శతకకారుడు, "నియ్యోగిలేని చావడి" అంటూ కవి చౌడప్ప, "పోనేగూడదు - చూడగూడదు" అని చెప్పడాన్ని బట్టి ఊరిలో కరణాల గురుత్వం బోధపడుతుంది. అంత మాత్రాన "మేం లేని ఊళ్లే లేవన్నారు చూశావా?" అని విర్రవీగకండి. సరసులుగా వుండాలి - అన్నట్లు సరసత తెలియని కరణాన్ని లేకిగా చౌడప్ప, "కరణము గాదు. సపిండీకరణమురా!" అంటాడు. ఇవి వ్రాసిన వారు ముఖ్యంగా నియోగులనే, అందునా ఆర్వేలనియోగులనే దృష్టిలో వుంచుకొని చెప్పారు. అయితే సెక్యులరిజం అని నినాదం చేస్తున్న శ్రీ నెహ్రూగారి హయాంలో వకారగుళ్లె గాక అందరూ కరణాలుగా ఉండొచ్చు. ఉంటున్నారుగూడా అని తేలిపోయింది.

"పురికిని ప్రాణము కోమటి
వరికిని ప్రాణంబు నీరు వసుమతిలోనన్
కరికిని ప్రాణము తొండము
శరికిని ప్రాణంబు మగువ సిద్ధము సుమతీ"

అనేచోట కోమటికి మారుగా కరణము అని వుంచితే బావుంటుందేమో అనిపిస్తుంది.

*　　*　　*

ఇలాగ్గా కరణాలను గురించి కట్టుకథలు ఎన్నెని ఉన్నాయి తెలుగునాట ప్రజల్లో. కరణాలనుగురించి చక్కని లోకోక్తులు, సామెతలు ఉన్నాయి. వీటిని సమగ్రంగా పరిశీలిస్తే కొన్ని వీరి ఘనతను చాటేవిగాను, కొన్ని వీరి ప్రజకు తార్కాణాలుగాను, మరికొన్ని వీరికి ఉత్సాహదాయకాలుగాను, ఇంకా కొన్ని వీరికి హెచ్చరికలుగాను ఉన్నట్లు తెలుస్తుంది. మచ్చుకు కొన్ని!

"కరణము సాదైయున్నను
కరిమదముడిగినను పాము కరవకయున్నన్

# కరణాల ముచ్చట్లు

ధర తేలు మీట తున్నను
కరమరుదుగ లెక్కగొనరుగదరా సుమతీ."
"కరణముల ననుసరింపక
విరసంబున దిన్న తిండి వికటించును గా
యిరుసున గందెన వెట్టక
పరమేశ్వరు బండియైన పారదు సుమతీ."
"సుజనుడౌ వైద్యుడు ప్రజకు రోగముగోరు
సజను డౌ విప్రుండు చావుగోరు
గడి కరణము.. గ్రామ దండన గోరు
జంబుకంబె వేళ్ళ శవము గోరు."

* * *

## సామెతలలో కరణం

"కౌదన్న వాడు కరణం."

"కటావిప్పా సమర్థుడైనవాడే కరణం."

"తెగేదాకా లాగితే తెప్పాలా నూతిలో పడుతుంది."

"ఉభయపార్టీల దగ్గరా తింటే ఊరిలో చెడతాడు."

"ముసర్దికి ముప్పైరెండు పనిముట్లు."

"ఊరుమీద ఊరుబడినా కరణంమీద కాసుబడదు."

"కాపూ కరణం నా వాడైతే కక్షేసి కొట్టా."

"కాపుని కందినీ వేపిన కొద్దీ కమ్మన" (కరణం దృష్టిలో).

"కరణాన్ని కందినీ వేపిన కొద్దీ కమ్మన" (కాపు దృష్టిలో).

"కాగితంమీద దొరికినవాడు కరణమే కాదు."

"ఆడించే బొమ్మా ఆడేబొమ్మా దస్త్రంలోనే ఉన్నాయ్ మాసుకో."

"తాత సంపాదించిన ఆస్తికన్నా దస్త్రం గొప్పది."

"తొక్కినా కరవక పోతే నీటికట్టు అంటారు."

"బుసకొట్టాలి గాని కాటు వెయ్యగూడదు."

"కరణంతో తగవు పెట్టుకుంటే కాటికి పోయినా వదలడు."

"కరణం కాగితానికీ రైతు విత్తనానికీ లోటు చెయ్యగూడదు."

"కాపుతో వైర మెట్టుకుంటే కలకాలం వుండొచ్చుకాని కరణంతో తగవుపడి ఘడియైనా బ్రతకడం కష్టం."

"ఇంట్లో పస్తు వీధిలో దస్తు."

"కరణమూ కంసాలీ తల్లి దగ్గరైనాసరే విసమెత్తు కక్కుర్తి పడక మానరు."

"తల్లి తగ్గరకాని పిల్ల దగ్గర అమ్ముతాడు."

"మా బావ కరణం దేశానికి—"

రాజాజీ.

# పకపకలు

ఒకావిడ: మీవారు ఎప్పుడూ గాంధీ టోపీ పెట్టుకొని తిరుగుతుంటారు. కాంగ్రెసు పార్టీలో పనిచేస్తున్నారా?

రెండో : ఎబ్బే! లేదండి! మావారిది బట్టతల.

* * *

భార్య : అప్పులవాళ్లు మన యింటి చుట్టూ తిరుగుతున్నారండీ!

భర్త : రేపు వచ్చినప్పుడు, "మా యింటిచుట్టూ తిరిగితే ఏమి ప్రయోజనం, ఆ గుడి చుట్టూ తిరిగితే కాస్త పుణ్యమన్నా దక్కుతుందని" చెప్పు.

* * *

భార్య : ఆ కొత్తగా చేరిన ఎదురింటాయన చూడండి! మీ లాగే స్వతంత్రంగా వ్యాపారం చేస్తున్నాడు! వాళ్లునలుగురూ హాయిగా తింటూ మరి నలుగురుకి భోజనం పెడ్తున్నాడు!

భర్త : బహుశః 'భోజనం హోటలు' వ్యాపారం చేస్తున్నాడు కాబోలు!

* * *

భార్య : అయినదానికి, కానిదానికి అలా విసుక్కుంటూ రెందుకూ? మన ఎదురింటాయన చూడండి; ఆవిడ ఎంత అరుస్తున్నా ఆయన చిరునవ్వు నవ్వుతూ మాట్లాడుతుంటాడు.

భర్త: అసలు విషయం తెలిస్తే నువ్వు అలా మాట్లాడవు. ఆయనకు పుట్టిచెవుడు!

* * *

భార్య: (సినిమా నుంచి వచ్చిన తర్వాత) సినిమా చాలా బాగుందండి! హీరో, హీరోయిన్‌ని ముద్దుపెట్టుకుంటున్నప్పుడు మిమ్మల్ని నేను గట్టిగా ముద్దుపెట్టుకుందామని అనిపించింది కాని......

ఎల్. వెంకటేశ్వర్లు

భర్త: అయితే హాల్లో నన్ను ముద్దుపెట్టుకున్నది నువ్వు కాదన్నమాట......

* * *

ఒకడు: ఏమండీ! మీవి పిల్లికళ్లు గదా! మీకు చీకట్లో వస్తువులు బాగా కనిపిస్తాయా?

రెండో: మీవి పాము చెవులుగదా! మీ గొంతులో బాగా వినపడున్నదా?

* * *

ఒకడు: రాత్రి నుంచి గుండె ఎందుకో విపరీతంగాకొట్టుకుంటున్నదండి!

డాక్టరు: మీరేం భయపడకండి. తొందరలోనే ఆగిపోయే టందుకు ఘాటైన మందు యిస్తాను.

* * *

చత్వారపుమనిషి : నాకు దూరపు వస్తువులు బొత్తిగా కనిపించటం లేదండి!

డాక్టరు: దగ్గరకు వెళ్లి చూస్తూ ఉండండి!

* * *

ఒకడు: (సర్వరునుద్దేశించి) మంచి నీళ్లగ్లాసుల్లో ఎడమచేతి వేళ్లుముంచి పట్టుకొని వస్తున్నావేం?

సర్వరు: కుడిచేతికి గజ్జి లేచిందండి!

* * *

కవి: మీ మీద నాలుగు పద్యాలు రాయాలని ఎంతో కుతూహలంగా ఉన్నదండి.

ఒకరు : అయితే చొక్కా విప్పేయమంటారా? వీపు విశాలంగా ఉంటుంది.

* * *

ఒకరు: మీ ప్రెస్సులో పనివాళ్లంతా కమ్యూనిస్టులు లాగా ఉన్నారే!

యజమాని: జీతాలు అడిగేటప్పుడు మాత్రమేనండి. పనికి కాంగ్రెసువాళ్లే! ★

# పెళ్ళిళ్లలో

మరదలు పిల్లకి పెళ్లి నిశ్చయం కాగానే, అందరిమాటా ఏమోగాని, నామట్టుకు మాత్రం అంత కులాసా అనిపించలేదు అయినా జరగక తప్పదు కదా! ఎందుచేతంటే . కూతుళ్లులేని మేనమామలూ, మరదలు లేని బావలూ, ఎందుకూ! నవ్వు పుట్టని హాస్యం లాగ!. మరదలికి పెళ్లిఅయేవరకూ ఆమె మీద హక్కు బావదే!.. అది కాస్త పోయిందన్నమాట! అందుకేనా ఏడుపు! . కాని. ఏంచేస్తాం! ... ఏ పెంకుడూ దొరక్కపోతే అక్క పెంకుటే అన్నట్టు మా మరదలికేం! 'పో! బావా! పాత చింతకాయ పచ్చడి! నువ్వెవరిక్కావాలి!' అని అన్నట్టు, రెండువేల కట్నంతో కొత్త బావని కొనేసుకుంది

నేను వెళ్ళేవరకూ, పెళ్ళికి వస్తానని ఎవరూ అనుకోలేదు. నేచేసిన అలస్యంచేత, నేను వెళ్ళగానే మా ఆవిడ మొఖం చాటంత అయింది

"ఏం అల్లుడి గారికి పిలుపు తక్కువయిందా, యింత ఆలస్యంగా వచ్చేరు!" అని మా అత్తగారు శ్లేషతో పలకరించింది

"మీ పిల్ల వచ్చేసింది కదా! యింక కొత్త మోజులో మేం కనిపిస్తామా! మేం రాకపోతే మాత్రం పెళ్లి ఆగిపోతుందా!" అని నేను నవ్వుతూనే దెబ్బకొట్టాను. దానికెవరికీ నవ్వురాలేదు

"కాని బావగారు సమయం చూసుకు వచ్చేరు పాపం! అందరి టిఫిన్లూ అయిపోయి విస్తరాకులు మిగిలేయని ఏం తెలుసును?" అని మా మరిది, నవ్వుతూ అన్నాడు తట్టుకోలేని మాట అన్నాననుకొన్నాడు.

"అసలు టిఫిన్లు చేసే అలవాటు మీ యింటో లేదని, తినేసే వచ్చేనోయ్! కొత్తగా మొదలెట్టేరా ఏమిటి యీ నాల్గురోజులూ గొప్పకి?" అని నేననగానే నోటికి బిరడా పడింది తతిమ్మా వాళ్లు నవ్వేసేరు

"బావా! వచ్చేవు!" అని ప్రశ్నార్థంగా కలగజేసుగొని మరదలు ఒక ప్రక్కనుంచొని అడిగింది నేను అంత ఆలస్యంగా వచ్చేనని ముఖం జారీ చెంబులా పెట్టింది.

"ఏం మీ ఆయన అనుకున్నావా?" అని నేను తేరిపార చూసేసరికి—

"ఏం అలాచూస్తున్నావు? దిష్టి పెడతావా?" అంది

"అబ్బే, అదికాదు, నిన్ను చూసి చూసి పెళ్లాడ్డానికి ఎలా ఒప్పుకున్నాడా! అని!" అని నేననేసరికి—ఆమె నవ్వుతూ ముఖం తిప్పుకుంటూ—

"ఆసంగతి ముందు మా అక్కయ్యని అడిగి చెబుతావుందు!" అని అంటించింది



దానిలో అర్థంనాకు బోధపడింది

అటువంటి మరదలు వుండాలి! బావ అలిగితే—బతిమాలి స్వయంగా లాడూ, మినపయున్ని వుండలు చిదిపి యిచ్చే మరదలు వుంటే—వాడూ బావ

* * *

ఆ రోజున సంతర్పణ-వీధిలో వాళ్ళు, వచ్చేసేరు వడ్డనలు అన్ని అయిపోయినాయి కాని మొగపెళ్లివారు రాలేదు . ఆసంగతి సందడిలో వున్న పెద్దలెవరూ గుర్తించక "వడ్డించండి వడ్డించండి. నిలబడ్డారేం" అని అరవడం మొదలెట్టేరు అది విని వడ్డన వంతులో వున్న ఒక ఆసామీ "అలాగా అయితే యింక

★ ద్వివేదుల

పట్టండోయ్ మజ్జిగ ఎవరూ తిన్నా తినకపోయినా వడ్డన మాత్రం జరిగిపోవాలి!" అని అనగా అప్పుడు ఆడపెళ్లి వారికి చురుకు పుట్టి పిలవడానికి పరుగెట్టారు ఆ ఆసామీ సమయోచితంగా అన్నమాటలకి తతిమ్మ వాళ్ళు నవ్వుకున్నారు

* * *

## ★ మొగ శనివారాలు: ఆడ శనివారాలు ★

నాలుగేళ్ల క్రిందటి మాట మా మేనత్త కూతురి పెళ్ళికి వెళ్ళాము పెళ్లిలో ఖర్మం చాలక శనివారం వచ్చింది అసలే మొగపెళ్లివాళ్లు తెగగోలచేస్తున్నారు అందులో శనివారం. వాళ్లకి భలే హుషారుగా ఉంది ఆ పెళ్లికి పెద్దలు మా బాబాయ్ వాళ్ళూను శనివారం సాయంకాలం నాలుగుగంటలకి మొగపెళ్ళివారి తరఫున ఒకాయన మా బాబాయి దగ్గరకు వచ్చి "చూడండీ! ఇవాళ మా వాళ్లలో ఒక ఇరవైమంది శనివారం, రాత్రి భోజనం చెయ్యరు ఫలహారం చేయించండి" అన్నాడు. "అలాగే నండి" అన్నాడు మా బాబాయ్ ఇంకా గట్ట పోయాక ఇంకో ఆయన వచ్చి "ఇంకో పాతికమంది శనివారం రాత్రికి భోజనం చెయ్యరు" అని చెప్పి వెళ్ళిపోయాడు. మా బాబాయ్ చాలా ఛలోక్తిగా మాట్లాడే మనిషి ఊరుకున్నంతసేపూ ఊరుకొని మనుషుల్ని ముప్పతిప్పలూ పెట్టి ఏడిపించే రకం మొగపెళ్లివారి తరఫున పెద్దమనిషి వెళ్లిపోయిన తరువాత 'ఇంక ఊరుకుంటే లాభంలేదు ఇంకా ఎంతమంది శనివారాలని చెప్తారో, వీళ్ల పని పట్టిస్తా'నని విడిదిలోకి వెళ్లి "ఏమండీ! అయితే మొగ శనివారాలు ఎన్ని? ఆడ శనివారాలు ఎన్ని?" అని అడిగాడు పాపం వాళ్ళంతా గొల్లుమని నవ్వేసరికి ఇంకేమీ చెయ్యలేక ఎంతమందో అప్పుడు సమంగా చెప్పారు.

ఎస్. రాజేశ్వరి

# ళాకోళాలు




వడ్డన జరుగుతూ ఉంది—వడ్డించేవాళ్ళ కేకలతోటీ పర్యవేక్షించే పెళ్ళి పెద్దల హెచ్చరికలతోటీ 'చాలుచాలు' అనో 'అది పట్రండి' 'పులుసులో ముక్కలు వెయ్యండి' అని యిలా భోక్తల మాటలవల్ల—అప్పుడప్పుడు, చదువుతున్న సంతర్పణ పద్యాల వల్ల "గోవిందా గోవింద" అని పందిరి ఎగరగొట్టే, కబుంతో టీ ఒక ప్రక్క నుండి, అగ్నిహోత్రంలోనుండి వస్తూన్న పొగతోటీ... 'అయ్యో మోమాట పడకండి' కొద్దిగా వేయించుకోండి!' అంటున్న.. వంటవాళ్ళ మాటలతోటీ ఆపెళ్ళి పందిరంతా కోలాహలంగా, ఆనందంగా వుంది. ఆ యింతలో ఒక వంట బ్రాహ్మడు

ోమనాథశాస్త్రి ★

బూరెలు పట్టుకు వచ్చేడు.. అవి వడ్డిస్తూ. "బాబూ వక్కటి...బాబూవక్కటి— వేయించుకోండి బాబూ" అని అంటూ వడ్డిస్తున్నాడు, అంటే—అతని వుద్దేశం— ఒక్కటయినా అధమం వేయించుకోండి, అని.. అలా అనుకుంటు పోతుండగా... ఒక రసికుడు కనిపెట్టి అతగాడిని ఆపి వేసి—

"ఒక్కటేమిటయ్యా! ఒక్కటికన్నా ఎక్కువ వెయ్యవద్దని పెళ్లివారు చెప్పరా ఏమిటి .ఒక్కటి.. ఒక్కటి, అంటావేం! అందికే...అంత మందికీ తినాలని వున్నా నువ్వు ఒక్కటికన్నా ఎక్కువ వెయ్యవు కాబోలునని వూరుకుంటున్నారు! నాకు నాలుగు వుండేలు కావాలి. అలాగయితే వెయ్యి!" అని సమయస్ఫూర్తిగా నవ్వుతూ అన్నాడు.. దానికి ఆ వంట బ్రాహ్మడు చిన్నబోయి మరి ఆ ముక్క అనలేదు... అందరూ యతని ఛలోక్తికి తిన్నతిండి పైకి వచ్చేలా నవ్వుతున్నారు.

* * *

ఎందుచేతోగాని వియ్యపురాలు ఆ పూట భోజనానికి ఆలస్యంగా వచ్చింది. ఆ విడ ధర్మమా అని అందర్నీ ఆమెకోసం చూడకుండా తినేయమని చెప్పేసింది. ఆమె అందరి భోజనాలు అయినాక వచ్చింది. ఆమెకి పందిరిలో ప్రత్యేకంగా పీట వేసినారు.

వీరకత్తె. సరసమాడదామని—"యివాళ వియ్యపురాలికి మిగిలిపోయిన వంటకాలే విందు. ఏమయినా అయిపోయి లేకపోతే... ఏమీ అనుకోకమ్మా!" అని అంది... నవ్వుతూ...కూరలు వడ్డిస్తూను.

"ఉంచుకుని లేదన్నా...ఒక వేళ చూస్తా నేమోనని వంటింటికి దూరంగా వేసేరు!" అని అంది...వియ్యపురాలు!

"కాదమ్మా! ఒక వేళ వియ్యకపోయినా వంటింటోపీట వేస్తే చేతికి అందుతాయి కదా! ఎక్కడ తినేస్తారో! అనే వాళ కత్తె భయం!" అంది ఒకామె

"అయినా మావాడిని ఎలాగూ మీవాణ్ణి చేసేసుకున్నారు. ఇంక ఏంచేసినా తప్పుతుందా! ... కానీండమ్మా! కానీండి..." అని ఆ వియ్యపురాలు నిట్టూర్చింది .. అపుడు ఆడవాళ్ళందరూ నవ్వుకున్నారు.

* * *

కట్నం చదివించే ఘడియవచ్చింది. అల్లునికి కట్నం.. మామగారు చదివిస్తున్నారు. వెంటనే...రెండో అల్లుడు ."అయ్యా! చిన్నమనవి!" అని అన్నాడు. 'ఏమిటి?' అన్నట్టు అందరూ అటుచూశారు—

"ఈ సందర్భంలో పాత అల్లుళ్ళం మాక్కూడ ఏమయినా కట్నం ముడుతుందేమోనని!" అని అన్నాడు.

'నీ కొడుక్కి పెళ్ళిచేసేప్పుడు అందుకుందూగాని లేవోయ్!' అని అతని మామగారు వెంటనే జవాబుయిచ్చేడు .. అక్కడున్న అందరికీ నవ్వాలనిపించింది.

* * *

ఈ పెళ్ళితంతులో ఒక సందర్భంలో, బావగారికి 'మరదలు మాడ' అని ఇస్తారు

(62-వ పేజీ చూడండి)

## ★ నాతోనా సరసం? ★

ఒకసారి మావాళ్లింట్లో పెళ్లిజరిగింది. పెళ్లికొడుకు చదువుకున్నవాడు. నాగరికతకలవాడు. పల్లెటూళ్లో పెళ్ళి. పాపం ఆడపెళ్ళివారికి అన్ని వేడుకలూ యథావిధిగా జరిపించాలని సరదా ఆ అబ్బాయి దేనికీ ఒప్పుకోలేదు. పెద్ద ముత్తైదువులంతా ఊరుకుంటారా? నాగవల్లి అయిన తరువాత అనుకుంటాను. ఉయ్యాల్లో పిల్లవాడుగా గంధపు చెక్క పెట్టి ఏదో చేస్తారు. పెళ్ళికూతుర్ని, పెళ్ళికొడుకుని మంచంమీద కూర్చోపెట్టి ఉయ్యాలలో గంధపు చెక్క వేసి ఇద్దరిమీద వసంతం పడేలా ఊపారు. వసంతంమీద పడేసరికి "ఈ న్యూసెన్సంతా ఏమిటి?" అన్నాడు పెళ్లికొడుకు. ఆ సందట్లో ఎవరు వింటారు? తరువాత ఆ గంధపుచెక్క తీసి పెళ్ళికొడుకు. చేతికిచ్చి "నేను ఆఫీసుకు వెళ్లాలి, పిల్లాడిని తీసుకో" అని పెళ్ళికొడుకుతో చెపుతోందో లేదో ఆ అబ్బాయి గంధపుచెక్క తీసుకొని గిరవాటు వేశాడు. వేసేసరికి ఈ సంభాషణంతా వినడానికి ముచ్చటపడి కూర్చున్న ఒక బామ్మగారి కాళ్ళకి వెళ్ళి తగిలింది. ఇంక ఆవిడ "నీ పెళ్లాంతో సరసాలు కాని, పెద్ద ముండని నాతో నీకేం సరసాలు నాయనా" అని దండకం మొదలు పెట్టింది.

ఎస్. రాజేశ్వరి

# ఆంధ్రకేసరి హాస్యోక్తులు

## క్రొవ్విడి లింగరాజు

అతి గంభీరంగానూ, బహుముక్తసరిగానూ కనబడుతూ ఉంటే ఆంధ్రకేసరిలో హాస్యమంటూ ఉన్నదా అని ఒక మిత్రుడికి సందేహం కలిగింది. అయితాలాగే కనుపించేమాట నిజమే. కాని ఆయనలో సున్నితమైన హాస్యధోరణి ఉండేది. మేము హాస్యమే వ్రాస్తాం, హాస్యం మాట్లాడుతాం అనేవాళ్ల లెక్క ప్రకారం పంతులుగారిలో హాస్యం లేకపోవచ్చును.

కొందరు వ్రాసే హాస్య వ్రాతల్లో 'ఇక్కడ నవ్వాలి' అని గుర్తుపెట్టడం అవసరం. హాస్యంగా మాట్లాడతా మనుకునే కొందరు ఎక్కడ నవ్వాలో వాళ్లే నవ్వి దారి చూపిస్తారు. ఒకప్పుడు ఆయన నవ్వి చూపించినా ఇతరులకు నవ్వురాకపోవచ్చును. కాని నిత్యజీవితంలో జరిగే సంభాషణలోని హాస్య ప్రయోగాలవల్ల, అప్రయత్నంగా, సహజంగా వినేవాళ్ళకు నవ్వు కలిగించి మనస్సును ఆనందింపచేయడమే హాస్యమని నిర్వచనంచేస్తే, ప్రకాశంగారిలో బహు సున్నితమైన హాస్యం ఉండేదని ఆయనతో దగ్గర పరిచయంగలవా రందరికీ తెలుసు.

ఇంగ్లీషుభాషలోని 'హ్యూమర్'కు హాస్యమని స్థూలంగా అర్థం చెప్పవచ్చు కాని, అది సరిపోదు. సంగీతంలో రాగాలూ, స్థాయిలూ ఉన్నట్లే హాస్యానికికూడా అనేకమైన స్థాయిలు, అనుభవాలు, తరతమాలు ఉన్నాయి. ఆ పరిశీలన రసజ్ఞుల కొదిలిపెట్టి ప్రకాశంగారి విషయానికొస్తే, హాస్యమనిపించుకోకలిగిన కథ లెన్నో ఉదంతాలుగా చెప్పకోవచ్చును. అన్నీ గ్రంథస్థం చేయడం మాత్రం సాధ్యంకాదు. అంతటి వివిధత్వంగల ఉన్నతపురుషుడికి 'హ్యూమర్' లేకుండా ఉండడం సాధ్యమా!

కష్టాలు మీదపడుతుంటే నవ్వయ్యగలగడం మహాపురుషులకే చెల్లింది. ప్రకాశంగారు పడినకష్టాలువంటికష్టాలను మరొక సామాన్యమనిషి ఎదుర్కోవలసివస్తే ఆత్మహత్య చేసుకునేవాడే. ఆంధ్రకేసరి, కష్టాలొచ్చిన కొద్దీ, వాటిని చిరునవ్వుతో భరించి జయించుకొచ్చేడంటే ఆయనలో ఎంత హాస్యముండేదో గ్రహించవచ్చు.

* * *

ఏడెనిమిదేళ్ళక్రితం పంతులుగారు తన చేతుల్లో పెరిగి పెద్దవారైన సహచరులమీద కాంగ్రెసు వర్కింగుకమిటీవారి ఎదుట ఫిర్యాదుచేయడానికి ఢిల్లీ వెళ్ళేరు. అక్కడ స్వర్గీయ శ్రీ వల్లభాయిపటేలు ఇంట్లో సమావేశం జరుగుతోంది. కాంగ్రెస్ హేమాహేమీలంతా ఆసీనులైఉన్నారు. ఆసందర్భంలో మరొకఆంధ్రనాయకుడూ, ఆయనామాటలు వినుకున్నారు. పంతులుగారేదో అంటే 'తవ శిష్యేణ ధీమతా' అన్నట్లు అతలాయన జవాబు చెప్పేడు. పంతులు కొంచెం నిదానించి, 'ఆయన నాకు శిష్యుడైతే గురువు నేకాడికి తెచ్చాడో చూడండి!' అన్నాడు. ఘనికిపాట్లు పడుతున్న పెద్దలు సహితం నవ్వేరు. మరొక్కక్షణమాగి "నా శిష్యుడిని మీకు బహుమతిస్తున్నాను" అన్నాడు. శ్రీ వల్లభాయిపటేలు ప్రకాశంగారి నభినందించి, "మీఆంధ్రు లెన్నితగాదాలుపడినా, బెంగాలీలలాగ కుస్తీపట్లుపట్టి తగవులాడుకోరు. మీరు చాలా సాయిలా పాయిలాగా మాట్లాడుకుంటారే! మీలో చాలా 'హ్యూమర్' ఉందండీ!" అన్నాడు. పంతులొక్కక్షణం నిదానించి: "ఔనండి. ఎంత 'హ్యూమర్' లేకపోతే మేమిల్లా మీ దగ్గరకు రాగలం!" అన్నాడు. అంతా మళ్ళీ కడుపుబ్బనవ్వేరు. ఆయన అభిప్రాయం ప్రకారం హాస్యం పరమార్థ మేమిటో ఆయనే చెప్పేరు.

* * *

రాజమండ్రి ఆర్ట్సుకాలేజిలో ప్రకాశం పంతులుగారు చదువుతున్నరోజుల్లో శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిలవారు తెలుగు పండితులు. వ్యంగ్యసంభాషణ ఆయన సొత్తు! ఆయన వ్యంగ్యసంభాషణలుగురించి పంతులుగారే కులాసాగా ఉన్నప్పుడు చాలా కథలు చెప్పేవారు. ఒకప్పుడు ప్రకాశంగారు రాత్రి నాటకంలో వేషంవేసి, మొగంమీది కోటాఅయినా బాగా కడుక్కోకుండానే క్లాసులోకొచ్చారు. ఒక సహాధ్యాయి హేళాకోళంచేస్తూ, విసిగించడం మొదలెట్టేడు. ఆ సంగతి మల్లయ్యశాస్త్రిగారు కనిపెడుతూనే వున్నారు. ఇంతలో శ్రీ పంతులుకు ప్రాణం విసిగి ఫెళ్లున చెంపకాయ కొట్టేడు. పంతులు కొట్టడం అవతలి విద్యార్థి దవడకాసుకోవడం ఒక్కక్షణంలో జరిగిపోయింది. ఇది చూచిన శ్రీ మల్లయ్యశాస్త్రిలవారు 'ఏమోయి ప్రకాశం అలా 'షేక్ హేండిస్తున్నా' వేమిటి!' అంటూ మాట తప్పించేసరికి క్లాసంతా గొల్లుమన్నారుట!

* * *

పచ్చిగా ఉంటే హాస్యంకాకుండా గుంభనగా ఉంటే హాస్యాన్ని పంతులుగారు పసంద్ చేసేవారు. ఆనందించ గలిగేవాడు. ఒకసారి హైకోర్టులో ఇద్దరు జడ్జీలముందు పంతులుగారు వాదించడం జరిగింది. ఒకజడ్జీ ముందుగానే కేసు చదువుకుని ఒక అభిప్రాయానికొచ్చి వారికి అడ్డుతగలడం ఆరంభించాడు. ప్రాణం విసిగి 'వినేవాడిని కూడా వినకుండా అడ్డుతగుల్తారేమండీ' అని మెల్లగా వినిపించేసరికి ఆ జడ్జీగారు సర్దుకున్నారు. ఆయన సమకాలికులైన వకీళ్లు అలాంటి కథలు చాలా చెపుతారు.

బారిష్టరు ప్రకాశంగారు హైకోర్టులో ఒక ప్రసిద్ధులైన ఆరవజడ్జీ ఎదుట 50 ఒకేరకమైన దావాలను గుత్తిగా వాదించవలసి వచ్చింది. మొదటిసారిగా జడ్జీ వాదాన్ని విని వినడంతో 'నేదావాకొట్టేశా'నన్నాడు. ప్రకాశంగారు రెండోదావా ఎత్తుకుని ఆ సంగతే చెప్పేడు. మళ్ళా దావా కొట్టేస్తూ కొత్తవారి కాలం వృథా చెయ్యదల్చ[illegible]

## భయంకాదు, సిగ్గు

భార్య:—ఏమండీ, మంటింట్లో ఏదో చప్పుడవుతోందండీ?

భర్త:—పిల్లేమో, పడుకుందూ.

భార్య:—పిల్లి కాదండీ. ఎవరో మాట్లాడుకుంటున్నారు కూడాను. దొంగలేమో చూడండీ.

భర్త:— దొంగలే?

భార్య:—అంత భయమేమిటండీ మరీని.

భర్త:—భయంకాదే. కొత్త వాళ్లతో మాట్లాడాలంటే నాకు తగని సిగ్గుగదా. ఎలా మాట్లాడనూ పోయి?

జడ్జీగారు. 'ఏ దావా కాదావాలో నే కోర్టువారికి స్టాంపు, నాకు ఫీజు ఇచ్చారుగదండీ!' అని మెల్లగా చెప్పేరు పంతులుగారు, జడ్జీగారు రుసరుసలాడడం మొదలెట్టేసరికి ప్రకాశంగారు '50 సార్లు చెప్పగానైనా, నా వాదం తమ కర్థమవుతుందేమోనని చూస్తున్నాను' అన్నారు కోర్టులో గుసగుసలు బయలుదేరేయి. అంత గొప్ప జడ్జీమీద అలా విసిరినందుకు ధైర్యం మాటల్లా ఉండగా, ఆ సున్నితమైన చమత్కారానికి పంతులు ప్రశంసలనందుకున్నాడు అంతకన్న గొప్ప విషయం ఆ జడ్జీగారిది. దావాలన్నిటిని ఓపికతో కొట్టేసిన హైకోర్టుజడ్జీ కొద్దిరోజులకు తనంతట తానే ప్రకాశంగారిని పిలువనంపి ఆకేసుల్లో ఆయన వాదాన్ని మళ్ళీవిని అన్ని కేసులు పంతులుగారిపక్షాన్ని తీర్పు ఇచ్చారు. హైకోర్టులో ఇలాంటి దెప్పుడూ జరుగలేదనీ ముందు బహుశా జరుగదనికూడా జడ్జీగారే చెప్పేరు!

* * *

బొరిపరికి నీళ్ళొదిలేశాక, పంతులుగారు 'స్వరాజ్య' పత్రికకు వాటాలు వసూలు చేయడం ఆకాలపువాళ్లందరికీ తెలిసిందే తెలుగుజిల్లాల్లో మనుష్యుల నెందరినో సన్నిహితంగా ఎరుగుండడం పంతులుగారి విశేషం. అదేకాకుండా, జన్మలో దాతృత్వమెరుగని కొందరిదగ్గర ఆయన చెపుతుంటే మాటలు వింటుంటే, ప్రక్కనున్న వాళ్లకు కడుపుబ్బ నవ్వొచ్చేది ఒకానొక తాలూకాలో ఒక పెద్ద భూవసతిగల ఆసామీదగ్గర కెళ్లాలన్నారు ప్రకాశంగారు కూడా ఉన్న వాళ్ళల్లో స్థానికంగా ఉండే లాయరు, ఆ భూస్వామిదగ్గర కెళ్ళడం వృథా అన్నారు. పంతులుగారి కీసలహాలు నచ్చలేదు. ఆ ఆసామీకి ప్లీడ రెవ్వరని అడిగేరు. ఆయనగారి కసలు దావాలే లేవనీ, ప్లీడరసలే లేడనీ చెప్పేరు. పంతులుగారికి మరీ విపరీతంగా తోచింది 'కొన్ని వేల ఎకరాలభూమి, లక్షలకొద్దీ వడ్డీ వ్యాపారం గల ఆసామీకి దావాలు లేవంటే అతను చాలా మహనీయుడే కనుక,ఆ యనను చూచి వద్దాం పదం'డన్నారు విధిలేక అంతాబయలు దేరి వెళ్ళేరు. ఆయన మామూలు గృహస్థ మర్యాదలు చేశాడు. తర్వాత పంతులుగారు ఆయనకు భూములు, ఆస్తిపాస్తులు, సమంగా పంచిపెట్టమనే 'బోల్షివిక్'నుసరించిచెప్పడం ప్రారంభించారు. వాడు ఆఫ్ఘనిస్తానం వరకూ వచ్చాడనీ, ఎప్పుడో మనదేశం మీదా పడతాడనీ చెప్పేరు. ఆ కథంతా ఆయన చెపుతుంటే ఆ ఆసామీ అతి జాగ్రత్తతో విన్నాడు. ఆకథలో అసత్య దోషం లేకపోయినా, పంతులుగారు చెప్పిన ధోరణి చూస్తే ప్రక్కవాళ్లు నవ్వాపుకోలేక పోయారు! అసలాసామీ లోపలి కెళ్ళి రెండు 'పచ్చనోట్లు' తెచ్చి ఇవ్వడంమాత్రం అందరికీ ఆశ్చర్యమేసింది. పంతులుగారి కామొత్త మొక లెక్కకాదు

### సగం జీ(వి)తం

ఏమోయ్! వచ్చే జీతంలో సగమన్నా నిలవవేస్తున్నావా?

బడిపంతులు:— నిలవచేద్దామనే ఉందిగాని, అంతకూడా రావటం లేదోయ్.

కాని, ఆ ఆసామీ రెండువందలిస్తే మిగిలిన వాళ్ళందరికీ రెండువేలులా తోచింది. ఆమాటెల్లా ఉన్నా ఇప్పటికీ ఆకథ తలుచుకుంటే నవ్వొస్తుంది.

* * *

ప్రకాశంగారికి చెల్లని రూపాయంటే సానుభూతి ఎక్కువ. చెల్లని రూపాయ ఉందంటే, ఆయన హుంకరించి 'రూపాయి చెల్లకపోవడ మేమిటయ్యా' అనేవాడు. విశేష మేమిటంటే ఆయన చేతిలో చెల్లని రూపాయలు కూడా చెల్లిపోయేవి. ఏ పెట్రోలువాడో రూపాయి చెల్లదంటే, "నేను నాయింట్లో చేశానుటయ్యా, వెండి రూపాయి చెల్లకపోవడమేమిటి?" అనేవాడు అసలు కరెన్సీ అంటే ఆయనకుండే అభిప్రాయాలే హాస్యరసాన్ని ప్రకోపింపచేసేవి. స్వరాజ్య పత్రికలో పనిచేసినవారు




# ★ ఆంధ్రకేసరి హాస్యోక్తులు ★

రూపాయిల్లో శీతాలడిగి తోందరచేస్తే ఆయన "రూపాయలు తింటారయ్యా! ప్రజల దగ్గర రూపాయిలా ఉన్నాయి? ధాన్యం, బియ్యం, పప్పుదినుసులు ఉన్నాయి అవి ఇస్తారు పుచ్చుకోరాదూ!" అనేవాడు. తిరిపురాళ్ల కోసం బాధలుపడుతూఉండే వాళ్లకీమాట చెపితే మంట కలగడం సహజమేకాని ఆయన విషయంలో మాత్రం ఎవరూ అలా అపార్థం చేసుకునేవాళ్లుకారు. హాస్యం, సానుభూతినీ కలిపి మాట్లాడే ధోరిణే అందుకు కారణం.

* * *

ఎన్నికల సంచారంలో ఒకసారి వారు రాజమహేంద్రవరం వచ్చారు. ఏదో హఠాత్తుగా ఆయనకు క్షౌరం చేయాలసిన పనొచ్చింది. ఒకమిత్రుని పిలచి "ఏమయ్యా! క్షౌరం చేయడం వచ్చునా?" అన్నారు. కాదనేసరికి, "ఏమయ్యా! ఈరోజుల్లో ఆడపిల్లలు క్షౌరం చేస్తున్నారే నీకు క్షౌరం రాదని ఎలా చెపుతున్నావయ్యా!" అనేసరికి ఆ మానవుడు నీరైపోయాడు.

* * *

**1930** సంవత్సరంలో కన్ననూరు జైలులో ప్రకాశంగారు 'ఏ' క్లాసు ఖైదీ. కె. కె. మేజర్ ఖండ్వాలా జైలు సూపరెంటు ఆయన కస్తూర్బాగాంధీకి దగ్గర బంధుత్వాన్ని కలుపుకున్నాడు. 'సి' క్లాసు ఖైదీల కిఇబ్బందొచ్చినా, ప్రకాశంగారాయనమీద హుంకరించి 'ఆగాంధీకి చుట్టమంటూ వేమిటయ్యా నువ్వు!' అనేసరికి ఆయన మెత్తబడిపోతూ ఉండేవాడు. ప్రకాశంగారిదగ్గరకు రావడానికి బెదురుతూ ఉండేవాడు. ఒకసారి ఆయన మలబారు కలెక్టరుగా ఉండిన వుడ్‌ను తీసుకొని ప్రకాశంగారి గదిదగ్గర కొచ్చాడు. పంతులుగారు పడకకుర్చీలో కూచుని చదువుకుంటున్నారు. మేజరు, కలెక్టరును ఆయనకు ఎరుకపరచారు. పంతులుగారు తలపంకించి ఊరుకున్నారు. కలెక్టరు ధొరవారు "నేను రాజమండ్రి సబ్‌కలెక్టరుగా నున్నప్పుడు నా దగ్గర ఏదో కేసులో వాదించారే!" అన్నాడు. పంతులుగారు తలెత్తకుండానే, "ఎందరి దగ్గరో వాదించాను" (I appear<sub></sub>ed before so many fellows) అన్నారు. కలెక్టరు గారికి మంటెత్తి వుండవచ్చును. కాని మేజరు ఖండ్వాలా నవ్వాపుకోలేకపోయాడు. పర్యవసాన మేమంటే వుడ్ 'రాజకీయ ఖైదీలు కన్ననూరు జైల్లో పడకకుర్చీలమీద పడుకుని రాజభోగం అనుభవిస్తున్నారు," అని రిమార్కు వ్రాసి చక్కాపోయాడు. అంతకన్న ఏమీ చేయలేక!

* * *

గాంధీజీ ఆగ్రహానికి గురియైకూడా బ్రతికి బట్టకట్టినవారిలో చెప్పుకోతగ్గవాడు శ్రీ ప్రకాశంగారు. వారుభయులూ చాలా తీవ్రంగా మాట్లాడుకున్న ఘట్టాల్లో సహితం వ్యంగ్యసంభాషణలు జరుగుతుండేవి. 1929 లో గాంధీజీ ఆంధ్రలో సంచారాని కొచ్చారు. అప్పుడే ప్రకాశంగారు స్వరాజ్యంకోసం మలయా సంచారం బయలు దేరేరు. ఒక్కసారి బందరులో గాంధీజీని దర్శించారు. ఉభయులకూ ఖద్దరుబోర్డుకు ఖాది ఉత్పత్తిసంఘంవారి బాకీనిగురించి పేచీ వచ్చింది. ప్రకాశంగారిమీద ఖాది బోర్డును సివిల్‌కోర్టులో దావా వెయ్యమంటానన్నాడు గాంధీజీ తీవ్రంగా "ఇద్దరమూ బారిష్టర్లమేకదా! మీరు అఖిలభారత ఖాదిబోర్డువారి తరఫున నల్లకోటు వేయండి. నేను ప్రతివాదితరఫున నల్లకోటు తగిలించుకుంటాను," అన్నారు ప్రకాశంగారు. అంత తీవ్రంగా వాదించిన గాంధీజీ నవ్వేశాడు!

* * *

ప్రకాశంగారిలో హాస్యముండదు అన్న సంశయం కొందరికి కలిగినట్లే, కొందరు ఆయనకు జాలిఉండదు అనికూడా అంటూంటారు. మనిషి భయంకరిగిం వేటట్లు కనబడ్డా ఆయనలో జాలిఎక్కువగా ఉండేది. గాంధీజీ కొడుకు హీరాలాల్ గాంధీనిచూస్తే, ప్రకాశంగారికి అమితమైన జాలి. అతను తండ్రిని కాదని అనేకవిధాలుగా పతితుడైనాడు. హీరాలాలు చెన్నపట్నంవస్తే విధిగా ప్రకాశంగారిని మాచేవాడు. "రావయ్యా రా! ముప్కల్ని భ్రష్టుల్ని చేసిన ట్లే నన్నూ చేశాడులే మీనాన్న" అని హాస్యంగా ఆహ్వానించి, తనదగ్గరున్నంతలో ఏ రూపాయలకు తక్కువకాకుండా డబ్బిచ్చి పంపే వాడు ఆయనదగ్గర లేకపోతే, ప్రక్కనున్న వాళ్ళను పిలిచి, "ఆతడెవ్వరో తెలుసా? గాంధికొడుకు. ఆయనగారు వాడిని భ్రష్టుణ్ణి చేశాడులే! పాపం! డబ్బు లేదుకాబోలు ఇవ్వండి!" అనేవాడు ఎవ్వరైనా తక్కువ మొత్తాలిస్తే చాలా చికాకుపడేవాడు.

* * *

బిహాక్లిష్టమైన సమస్యల నెదుర్కొంటల. నప్పుడు పంతులుగారి హాస్యోక్తులాయనను

బాగా కోపాడేవి. ఏదైనా ఒక ప్రభుత్వ వ్యవహారంలో ఇదమిద్ధమని సమాధానం చెప్పాలసొచ్చినప్పుడు, తమాషాగా సర్దుకునే వాడు. "ప్రభుత్వమిల్లా చేస్తోంది మీ అభిప్రాయమేమిటని ఏ పత్రికావిలేఖరో, లేక ఎవరైనా ఏ బహిరంగసభలోనే అడిగినప్పుడు దానికి సమాధానం చెప్పడం ఇష్టం లేకపోతే, "ఏమిటి ప్రభుత్వం సంగతా అడుగుతున్నావు? అసలు ప్రభుత్వ మెక్కడయ్యా ఉంది?" అని మొదటికే ఎసరుపెట్టి నవ్వించి అసలు ప్రశ్నకు సమాధానం చెప్పేవారు కాదు.

* * *

తనకు కావలసిన ఏ విషయమైనా ఇది నాకు కావాలని అడుగకుండా గుంభనగా చెప్పడంలోనే ఆయన నవ్వు తెప్పించేవాడు. నలుగురు కూచుని మాట్లాడుకుంటుంటే ఆయనకు ఆకలివేస్తుంటే, "ఏమయ్యా! మీ కెవరికీ భోజనం వేళ కాలేదా?" అని అడిగేవారు. అలాంటి చమత్కృతులాయనముఖతా తరుచు వినేవాళ్ళం.

* * *

**1947,** ఆగస్టునెలలో ఆయన జన్మదినం వచ్చింది 1946 లో ఆయన జన్మదినంనాడు మద్రాసులో బ్రహ్మాండంగా ఉత్సవం జరిగింది వి. పి. హాలు సభలో హేమాహేమీ లంతా పాల్గొన్నారు. అప్పుడాయన ముఖ్యమంత్రి. ఆయనకు ఆ సంగతి చెప్పేసరికి, 'ముఖ్యమంత్రికి జన్మదినోత్సవంటే' అన్నారు. మరుచటి సంవత్సరం జన్మదినంనాడు చాలామంది నిలువెత్తు గులాబీదండలు వేసి, రెండుపళ్లు చేతులో పెట్టి, దణ్ణం పెట్టి, ఎవరిమట్టుకు వారే వెళ్ళిపోయారు. ఈ తంతు మ॥ 12 గంటలు దాకా జరిగింది. చెన్నపట్నంలోని ఆ ప్రముఖులెవ్వరికీ ఆ వేళ ఆయనను ఇంటికి భోజనానికి పిలవాలని తోచలేదు. అంతా వెళ్ళిపోయాక హాస్టలులో ఉన్న ఒకరికి కబురుచేసి, "ఏమోయి; జన్మదినోత్సవమంటేఏమిటి?దండలు వేయడమేనాఏమిటి?" అని అన్నారు. ఆస్థితిగతులనుబట్టి అక్కడ భోజనానికి ఏర్పాట్లు లేవని అర్థమైంది. ఆ ప్రశ్నలో ఎంతో విచారం ఇమిడి వున్నా, దానినంత తేలికగా హాస్యంగా త్రిప్పేయడం చాలా విశేషమే.

* * *

ఒకసారి తిరుచునాపల్లి జైలులో వారిదగ్గర మామూలుగా తెలుగు భాగవతం పురాణం చదివే మిత్రుడు ఎందుకో రాలేదు. కీ॥ శే॥ డా॥ గుళ్లపల్లి నారాయణమూర్తిగారు ఆపనికి సిద్ధమైనారు. చదివేది కుచేలోపాఖ్యానం. 'ఘనఘనారావసంకుల ఘోరజీమూత' అనే పద్యాన్ని ఒక భాగవతోత్తముడు చదివేడు. దాని అర్థం చెప్పాలసొచ్చేసరికి శ్రీ నారాయణమూర్తికి కొంచెం కష్టమనిపించింది. నోటిలో కారాకిళ్ళీ అలా వుండగా, అర్థమంతా ఎందుకన్నట్టు 'పెద్ద వర్షం కురిసింది' అని అన్వయం చెప్పేశాడు. కారాకిళ్ళీ తుంపరలు పంతులుగారిదాకా పడ్డాయి. పంతులుగారికి నవ్వొచ్చింది. 'బాగా చెప్పేవోయి డాక్టరూ! నువ్వు యాక్టరువు కాదూ. అల్లాగే యాక్టుచేసి చూపించావులే,' అనేసరికి అందరికీ నవ్వొచ్చింది. పురాణం ఆనాటికి అంతటితో కట్టిపెట్టేశారని వేరే చెప్పాలా!

* * *

ఇలా జ్ఞాపకంచేసుకుంటే ఎన్నో కథలు జ్ఞాపకానికొస్తాయి. మోటుతనం ఎంతమాత్రం లేని ఛలోక్తులు, చమత్కృతులు ప్రకాశంగారు చాలా విసిరేవారు. అసలు సహాయనిరాకరణోద్యమం ప్రారంభంలో ఆయన ఇంగ్లీషు తెలుగులో 'అరిసింగు అనే వాడున్నాడే వాడు చాలా ఘట్టివాడు.' అంటూ ఉపన్యాసాలు చెప్పేటప్పుడే మెల్లనిహాస్యం స్ఫురిస్తుండేది. 80 సంవత్సరాల ప్రజాహిత జీవితం గడపగలిగినాడంటే పంతులుగారిలో కావలసినంత 'హ్యూమర్' వుండడకేమైంది!



# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట అవశ్యకమైయున్నది—అయితే ఆటయందుగాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము. మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి. వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేసి మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు, ఇందువల్ల మీరు మరల హాయిగా నుందురు.



# ✻ 'కాని' పాతదే కాని ✻

ఓ రోజు ఉదయాన్నే మా సుభద్ర వదినకు ఓ పాత కానీ దొరికింది. ఇంక ఆవిడ సంతోషం ఇంతా అంతా కాదు. తెలిసిన వాళ్ళందరికీ ఆ కానీ చూపించి మురిసి పోయింది. విక్టోరియా మహారాణీ బొమ్మ ఆ కానీమీద వుండటంచేత మరీ ప్రత్యేకత సంపాదించింది ఆ కాని. పాత నాణాలను సంపాదించి దాచడం మా వదినకు హాబీ, నయాపైసా నాణాలు మరీ కొత్తవవడంచేత ముచ్చటపడి అవీ జాగ్రత్త పెట్టెలో వేస్తుంది; ఖర్చు పెట్టడానికి ఒప్పుకోదు.

పాత నాణాలనూ దాచేస్తే, కొత్తనాణాలనూ కాజేసి నాదగ్గర పైసా పైసా, చేశావని అన్నయ్య రోజూ అంటాడు. కాని, వాటిని వదిన బైటకుతీయదు.

పైసా పైసే, అంటుంది.

మా వదినకు పాతకాని దొరకడం పెద్ద విశేషం కాదుకాని అసలు ఈ కాని చెలామణీ చిత్రంగా కనబడుతుంది. చాలామంది నిత్యజీవితంలో, కాని, అనేమాటను రోజుకు కొన్ని వందలసార్లు వాడుతూఉంటారు!

"కాని," అనే ఊతపదం వాడించనిదే సంభాషణ సాగదు. పౌరాణిక విషయాలు మాట్లాడినా సాంఘిక విషయాలు మాట్లాడినా 'కాని', పాత్ర గొప్పదనే చెప్పాలి; కాని ఒక్కొక్కసారి ఎప్పట్టు అనిపిస్తుంది.



జకార్తా (జావా) మ్యూజియంలోని గణేశవిగ్రహం

ఫలానాపని, తొందరగా చేయమని చెప్పడానికికూడా, 'కాని', కావలసినదే,ముందా పని కాని, కాని, అంటారు.

ధర్మరాజు సత్యసంధుడే. కాని; 'అశ్వత్థామ హతఃకుంజరః,' అనే అబద్ధాన్ని సమయానికి ఆడేశాడు. భీముడు బలవంతుడే కాని; మహా బడాయి. సత్య హరిశ్చంద్రుడు నిత్య సత్య వ్రతుడే కాని! ఏమంత ప్రయోజకుడు కాదనిపిస్తుంది. శ్రీ శ్రీరామచంద్రుడు సీతాదేవియందు ఎక్కువ ప్రేమ కలవాడే కాని! మాలాలిని అడవులకు పంపించేశాడు, హనుమంతుడు మహాబలవంతుడే కాని, నీవు బలవంతుడువురోయ్ అని ఇంకొకరు జ్ఞాపకంచేస్తోవుండాలి.

ప్రతిభావంతురాండ్రయిన రుద్రమ్మ, మొల్ల, మల్లమ్మ, మా జాతివారేనని చెప్పుకో వచ్చే కాని! మనకు ప్రతిభ లేదు, చెప్పుకోగా చెప్పుకోగా,

స్త్రీ స్వాతంత్ర్యం అంటే అతనికి యిష్టమే, కాని! భార్యను ఎక్కడకూ వెళ్ళనివ్వడు.

సంఘం అంటూ ఒకటివుంది. కాని! సభ్యులు తక్కువ.

మోచర్ల సుబ్బలక్ష్మి

మీటింగు అంటూ నోటీసువస్తుంది కాని మీటింగు జరగదు. ఎందుచేతని అడక్కండి అదంతే.

గ్రంథాలయం అంటూ పేరుకివుంది కాని! గ్రంథాలు లేవు.

మంత్రులు వాగ్దానాలు విరివిగా చేస్తారు కాని! ఆ వాగ్దానాలు ఆచరణలో పెట్టరు.

రూపాయకునూరు నయాపైసలన్నమాటే, కాని! అన్ని వస్తువుల ధరలూ విపరీతంగా పెరిగిపోతోన్నాయి.

ప్రయివేటు మేష్టారు పాఠాలు బాగా చెపుతారు కాని! రోజూ రారు.

రాజ్యం పిన్నికి సాహిత్యమంటే సరదాయే కాని, ఏమీ చదువదు.

ఆవిడ చంద్రహారం చేయించుకొందిట, ఆరు వందలైందంటోంది. కాని! అంతవుంటుందంటావా? గోపాలకృష్ణ బి. ఏ. మొదటి తరగతిలో ఉత్తీర్ణుడైనాడు. కాని! కవిత్వం పట్టుకు వేళ్ళాడుతాడు. మన చాకలి బట్టలు ఉతికాడు కాని! తేలేదు; కొన్ని తెచ్చాడు. కాని! అవి మనవి కావు.

మా అబ్బాయి మొండి చురుకైనవాడే కాని చదవడు.

మెలకువ వచ్చేసింది కాని! లేకపోతే ఇంకా నిద్రపోదును.

కాళ్ళు లాగేయి కాని, లేకపోతే ఇంకా పరిగెట్టి వుండేవాణ్ణి.

వంట అయిపోయింది. కాని, కూర వండాలి. మొన్న సినిమాకు వెళ్ళేమన్న మాటే కాని, సినిమా ఏమీ బాగోలేదు. కడుపు నిండిపోయిందికాని; లేకపోతే ఇంకా తిందును.

ఈ కథ హాస్యసంచికకు రాస్తోన్నానన్న మాటేకాని, ఇది హాస్యమంటారా? కానీ, చదవండి.

"చదివాము. బాగానే ఉందికానీ, మరీ బడాయిలెద్దూ" అనకండేం?

నా పేరు రాయకపోదును కాని, బాగుండంటారని ఆశగా ఉంది. నా పేరు మోచర్ల సుబ్బలక్ష్మి, మా ఊరు భీమవరం. ★

**"అచ్చుతప్పు"**

ప్రెస్సులో చాలా కాలం కంపోజిటర్ గా పనిచేసిన ఒకడు ఉద్యోగంపోయి హోటల్లో సర్వరుగా చేరాడు. ఒకరోజున ఒక ఆసామీ అతన్ని పిలిచి "ఏమయ్యా, ఈ దోసకాయపప్పు నిండా ఏమిటో జీవాలున్నాయేమిటి?" అని గద్దించాడు.

సర్వరు ఏమాత్రం తొణక్కుండా "అచ్చు తప్పండి. ఆవాలుండాలి," అన్నాడు.

# షోకేళీ వైరాగ్యం

వైరాగ్యాలలో చాలా రకాలున్నాయి. ఆశా మోహాలు నశించి, వయస్సు మళ్ళిం తరువాత కలిగే వైరాగ్యంగూర్చి కాదు నే చెప్పేది, నిండు యవ్వనంలో ఉండి నిక్షేపంలా కాపరాలు చేసుకొంటూ అష్టకష్టాలూ పడడంలో ఆరితేరినట్టుగా వైరాగ్యంతో మాట్లాడే వారినిగూర్చి.

బద్ధకాన్ని కప్పిపుచ్చడానికి, యిష్టంలేని పని చేయవలసి వచ్చినప్పుడు, చాలామందికి ఎక్కడలేని వైరాగ్యం ముంచుకొస్తుంది.

మా మేనత్త ఒకావిడ ఉంది. సంవత్సరమైనా, నిండని వాళ్ళబాబుకి బొట్టూ, కాటుకల మున్నాలు అటుంచి, పౌడరైనా రాయదు సరికదా, సబ్బుకూడా రాయకుండా, తనకి తోచినప్పుడు, (మట్టమధ్యాన్నమో, సాయంకాలమో) గబగబా రెండు చెంబులు చన్నీళ్లు పోసేస్తుంది.

మనస్సుండబట్టక మా అమ్మ, "అదేంటమ్మా! చంటిపిల్లాడికి చన్నీళ్లు పోస్తావు? బాయిలర్‌లో వేన్నీళ్లు ఉన్నాయికదా? వేసవికాలంకూడా దమటపస్తుంది పౌడర్ రాయవేం?" అని అడుగుతుందనుకోండి.

"ఆ...వాడి ముఖానికి పౌడర్లూ సబ్బులూ ఎందుకు, అంత సుకుమారంగా పెంచకూడదు పిల్లల్ని, ఎప్పుడు ఎలా ఉంటుందో" అంటూ ఏమేమో వల్లిస్తుందేకాని, బద్ధకమని అనదు, అనుకోదు. ఎవరన్నా అన్నా ఒప్పుకోదు.

ఇంకో రకం; మా పని మనిషి రాముకి ఎప్పుడన్నా రవికలగుడ్డ ఇస్తే పుచ్చుకుంటుందికాని "ఆ...ముసలిముండని, ఊరు పొమ్మంటే, కాడు రమ్మంటోంది, నాకెందుకివన్నీ" అంటుంది. బర్మామడి వేసుకొని, బుగ్గను కొరాకిళ్ళి దట్టించి, జాంమ్మంటూ సినిమా కెళ్లేదాన్ని చూసి పసిపిల్లకూడా అనుకోదు ముసలిదని.

ఇవన్నీ ఒకెత్తూ, ఇదొకెత్తూ. ఇంతెందుకు వస్తుందో అర్థంకాదు. మా బంధువొకావిడ ఉంది; కలవారిఇంటికోడలు. చదువుకొన్నది, ఒక్కాతే ఒక్క కూతురుంది ఆరేళ్ళది, అత్తా ఆడబిడ్డాలాంటి బాదరబందీలేదు. భర్త ఆవిడ గీచిన గీటుదాటడు. ఇంతకన్నా ఏంకావాలి చెప్పండి ఏ ఆడదానికైనా?

అయినాకూడా ఆవిడ ఎప్పుడూ వైరాగ్యం వల్లిస్తూ, నిరాశా, నిస్పృహల్లో ఉసూరుమంటూ ఉంటుంది. ఆవిడతో మాట్లాడుతూంటే మనకికూడా వైరాగ్యం ముంచుకొస్తుంది. ఆవిడ ఎందుకలా మాట్లాడుతుందో చివరకి ఆవిడ భర్తకికూడా అర్థంకాదు. అదో రకమైన సరదాలే, అంటాడు మా అన్న.

ఇదంతా చూసో ఏమో, ఓసారి మావారు బ్యాంక్‌నుండి వస్తూనే, నా దగ్గరకొచ్చి, విసుగ్గా; "ఏం బ్రతుకు, ఛీ చచ్చిపోతా" అన్నారు.

నే నేమాత్రం ఆశ్చర్యపోకుండా, తల దువ్వుకొంటూనే, ఆయనవేపు చూడకుండా తాపీగా "ఎప్పుడూ?" అన్నా!

అప్పుడు చూడాల్సిందే మావారి ముఖం!

కోపంతో "ఏం? నేను త్వరగా పోవాలని ఉందా? ఎప్పుడో యెందుకు? ఇప్పుడే" అన్నారు విసురుగా!

"ఆహా-మరేంలేదు జత అల్లుకొనేవరకూ ఉంటారో లేదో అని, అడిగాను. ఇద్దరం కలసి ఒకేసారివెళ్దామని", అన్నా కొంటెగా నవ్వుతూ.

మా వారికి నవ్వాగిందికాదు. అది మొదలూ మావారెప్పుడూ వైరాగ్యం జోలికిపోలేదు. ఏమైనా అలా ఉసూరుమంటూ మాట్లాడేవార్ని చూస్తూంటే విసుగ్గా ఉంటుంది. వాళ్లి అర్థంలేని మాటలూ, చేతలూ వింటూ కంటూ ఉంటే చిరాకేస్తుంది. ★



పోలికలు

చిత్రకారుడు: పట్టుమట్ల వెంకటసత్యపాండురంగారావు —నరసాపురం

# * కోతలు: ఒకనీతికథ *

పవని నిర్మలప్రభావతి

ప్రేయిన సెలవులో ఒకసారి మా ఇంటికి దూరపు బంధువు ఒకాయన వచ్చాడు. వచ్చినప్పట్నుంచీ తెంపు లేకుండా తెగ కోతలు కోస్తున్నాడు. పైగా తాను చెప్పేదంతా చుట్టూ వుండేవాళ్ళు నమ్ముతున్నారనే నమ్ముతున్నాడు కాబోలు! హఠాత్తుగా మా ఇంట్లోంచి పిల్లొకటి అక్కడికి వచ్చింది. పిల్లిని చూడడమే తడవు మరి పుంజుకున్నాడాయన...

"చూశారూ! ఈ పిల్లిలాటిదే తెల్ల పిల్లి నొకదాన్ని నే పట్టుకొచ్చానోసారి! అంటే కొనుక్కొచ్చానన్నమాట! సరిగ్గా 820 రూపాయలయింది. అదీ బేరం చేస్తే! అవల్ల పిల్లిని చూచి మా అక్కయ్య మోజుపడి అలాటిదే కావాలనని పట్టుబత్తే మా నాన మద్రాసు వెళ్ళారు కొనుక్కొరావటానికి! తీరా అక్కడలాటి పిల్లుల్లేవట. అందులోనూ వాళ్ళకు పిల్లులేరు. రానే వచ్చారు గదా అనుకొని పిల్లికి బదులు మూడువేలా రెండు వందలు పెట్టి కుక్క నోదాన్ని కొనుక్కొచ్చాడు. మొన్నీ మధ్యనే మా అక్క చనిపోయిన నిముషంలోనే ఆ కుక్కా చచ్చిపోయింది...!" అంతవరకు ఎల్లాగో పళ్ళు గిట్టకరిచి నవ్వును ఆపుకో కలిగాగాని–తర్వాత ఆపుకో లేక పోయినా...అక్కడ నవ్వితే బాగుండదని లోపలికెళ్ళిపోయా!

ఈగొప్పలు చెప్పుకునే జాడ్యం చాలా మందిలో వుంది. ఇందులో ఆడ, మగ భేదం లేదు. వాళ్ళూ వీళ్ళూ కూడా వున్నారు. మరి ఇలా లేని పోని కోతలు ఎందుకు కోస్తారు? అని కాస్సేపాలోచిస్తే నా మటును నాకు తోచేదేమిటంటే బహుశా వాళ్ళు తమలో వుండే ఏదో లోపాన్ని కప్పిపుచ్చుకోటానికిగ్గాను ఇలా గొప్పలు చెప్పుకుంటారేమోననిపిస్తుంది. కాని జీవితంలో కాస్తా కూస్తో గొప్పలు చెప్పుకోని వాళ్ళుంటూ వుండరు. ఉన్నా, తాము చెప్పేదాన్ని ఎదుటి వాళ్ళు నమ్ముతున్నారా లేదా అని ఆలో



"ఏయ్ వదినా! పెద్దపందా లెయ్యవోయ్!"

చించాలి కాస్త. లేకపోతే పైన నేనుచెప్పిన ఆయన మాటల్లానే ఏదో తమాషాగా చెప్పుకొని నవ్వుకోటానికి ఉపయోగిస్తాయే కానీ అవి నిజాలని గాని—కనీసం అయ్యుండొచ్చునిగానీ, వినేవాళ్ళకు అనిపించదు!

బారెడు పామును చూచాను, కట్టితో చంపాను అంటే నమ్ముతారుగానీ, బారెడు పాముతో నేను మాట్లాడానని గాని, చేత్తో దాని నడుము విరగ్గొట్టి చంపానని గాని చెప్తే నమ్మే వాళ్ళు ఎవ్వరైనా వుంటారా? ఎప్పుడైనా మరీ చెప్పక తప్పని పరిస్థితుల్లో గొప్పలు చెప్పినా అవి అతికేట్టుగా చెప్తే బాగుంటుంది. కాని కొందరు పుట్టి పుణ్యానికి చెప్పుకుంటుంటారు. అలా చెప్తూ ఎదుటివాళ్ళు తమ మాటల్ని పిచ్చిగా నమ్మేస్తున్నారని గూడా ఆనందపడుతుంటారు వాళ్ళు. జీవితంలో ఎప్పుడో ఓ మాటైనా గొప్పలు చెప్పుకోంది జరగదు ఎవ్వరికైనా! కాని నిత్యజీవితంలో అడుగడుగునా అర్థం లేని కోతలు కోస్తుంటే చివరకు వాళ్ళ మాటల కసలు విలువే లేకుండా పోతుంది.

మాకు తెలిసిన ఆవిడ ఓసారి మా ఇంటికొచ్చింది. వచ్చి నప్పట్నుంచీ తన కూతురు కంఠమాధుర్యాన్ని గురించి, గాన కళను గురించి అద్భుతంగా వుపన్యాసం దంచేసింది. రెండోసారి వాళ్ళ కూతుర్ని కూడా వెంట బెట్టుకు వచ్చింది. వుండ బట్టలేక ఓ పాట పాడమన్నాం. ఇక చూసుకోండి మా చావు వర్ణనాతీతం. వెయ్యిరండ్లోళ్ళు అంటేనమ్మరు కాబట్టె, రెండురండ్లోళ్ళు చెవుల దగ్గిర పెట్టి దబదబా కొట్టున్నట్టుగా బాధపడ్డాను నామటుకు నేను ఆ అమ్మాయి పాట ఆపే వరకు. నిజంగా ఆవిడ చెప్పినంత బాగా ఆ అమ్మాయి పాడగలిగుంటే అలా గొప్పలు చెప్పుకో వలసిన అవసరమే లేదుగా. అందుకనే ఏదో లోపాన్ని దాచుకోడం కోసమే వాళ్ళలా లేనిపోని అబద్ధాలు చెప్పుకుంటుంటారు.

ఈగొప్పలు చెప్పుకునే వాళ్ళలో రెండు రకాల వాళ్ళున్నారు. ఉన్న విషయాలనే కొండంతచేసి చెప్పుకునే వాళ్ళు ఒకరకం. ఇక రెండోరకం వాళ్ళకు ఓ విషయం అంటూ వుండక్కర్లేదు. పూరికేనే వాదిస్తుంటారు. ఎలా అయినా మొదటివాళ్ళే నయం

## కోతలు : ఒక నీతికథ

మనిషిస్తుంది. మాట మాటలో అబద్ధాలు గొప్పగా చెప్పేస్తుంటారు కొందరు. ఓసారి మాపిన్ని కూతురిని చూడ్డానికి ఓ పెళ్ళి సంబంధం వాళ్ళొచ్చారు. అబ్బాయి ఏం చదివాడని మందడిగితే, బి. ఎస్. సి. పాసయాడని వాళ్ల నాన్నగారు చెప్పారు. మళ్ళీ ఏదో మాటల్లో వాళ్ల చిన్నాన్న అబ్బాయి బి. ఏ. పాసయాడని చెప్పారు. మాబాబాయి వాళ్ళకు సందేహం వచ్చి తర్వాత విచారిస్తే ఆ అబ్బాయి స్కూల్ ఫైనల్ లో మూడుసార్లు దండయాత్ర చేసి ఇక చదువు జోలికి పోకుండా చాలించుకున్నాడట. ఎలావుందిది? ఆనాడు వాళ్లు చెప్పిన అబద్ధాలు గుడ్డిగా నమ్మింటే ఇవతలి వాళ్ళ జీవితం ఏమయ్యేది? ఇల్లాగే చాలామంది కాలేజీల్లో తమకు చదువురాదని చెప్పకోడం అదో నామోషీ అనుకుని గుట్టుక్కున గొప్పగా అబద్ధం చెప్పేస్తారు. తీరా నిజం తెలిశాక గుడ్లప్పగిస్తారు. ఆ కిందటిసారితో సే తమ మాటలకు విలువపోయిందని బాధపడ్డా తర్వాత లాభం వుండదు.

లేనిపోనిగొప్పలు చెప్పుకున్నంతమాత్రాన మనకు ఒరిగేదేమీ లేదు. అలా మనకుండే పరిస్థితిని గాని ఏదైనా మామూలుగా నిజం చెప్పినందువల్ల మనకు పొయ్యేదేమీ లేదు. కానీ ఎటొచ్చీగొప్పలుచెప్పినా అవతలివాళ్లు నమ్మేలా ఆ పరిస్థితికి అతికేలాచెప్తే రాణిస్తాయిగాని లేకపోతే నగుపాటుచేటయిపోయి తర్వాత వాళ్ళమాటలు ఓపట్టాన నమ్మరు సరికదా, పిల్లుల అరకతో భూమి దున్నానని చెప్తే ఎలా నవ్వుకుంటారో, అలాగే నవ్వుకుంటారు...!

నీతి : గొప్పలు చెప్పటం తప్పు కాదు; కాని బాగా చెప్పవలెను.



### తీరుబడి

ఒకరు:—తొందరపడి పెళ్లి చేసుకున్నవాళ్లు తీరుబడిగా విచారిస్తారని ఒక సామెత ఉంది.

మరొకరు:— తీరుబడి ఉంటేను!

# వినాయకుడికి విసుగేస్తుందని...

ప్రతిసారీ వినాయకుడికి ఉండ్రాళ్లేనా? ఎంత ఇష్టమైనా ఎప్పుడూ అవి మాత్రమే తింటుండాలంటే మరి ఆయనకు మాత్రం విసుగు కాదూ? అందుకే ఈసారి మరొక వంట చెప్తాను. ఉండ్రాళ్ళతోపాటు ఇవి కూడచేసి పెడితే పాపం! సంతోషిస్తాడు!

ఉండ్రాళ్ళెంత గట్టిగా ఉంటాయో, ఇవంత మృదువుగా ఉంటాయి పళ్ళులేని ముసలివారైనాసరే, నోట్లో వేసుకోగానే ప్రచీప్‌గా కరిగిపోయి కడుపులోకి చేరుకుంటాయి. ఇది ఉదయంకన్నా, మధ్యాహ్నం టిఫినుకి అనువుగా వుంటాయి. ఒక్కసారి చేసి చూడండేం!

ఇది 2 రకాలుగా చెయ్యొచ్చు. ఏ రకం



ఏకరేఖాచిత్రం: ఎం. ఎస్. కిషన్
—హైదరాబాదు

బావుంటే (అంటే మీకు నచ్చింది) ఆ రకం వండుకోవచ్చు.

మొదటిరకం.

కావలసిన వస్తువులు. ఒక సోల, మినపపప్పు ఒకసోల పంచదార మూడుసోలలు మంచి పాలు, పది ఏలకులు, డాల్డాగాని నూనెగాని సరిపడ్డంత, పచ్చ కర్పూరం కొంచెం.

సోల మినప్పప్పుని 2 గంటలసేపు బాగా నాననివ్వాలి. ఆ తర్వాత బాగా కడిగి ఉంచుకోవాలి ఈపప్పుని రోట్లో వేసి రుబ్బ గలిగినంత మెత్తగా రుబ్బుకోవాలి. నీళ్లు ఎక్కువ పోయకుండా గట్టిగా ఉండేట్లు రుబ్బుకుని ఒక ప్రక్క ఉంచుకోవాలి

పొయ్యి వెలిగించి 3 సోలల పాలని బాగా కాచాలి మీగడకట్టకుండా కాసేపు కలియబెట్టాలి తరువాత అందులో ఏలకు పొడి, పంచదార, పచ్చ కర్పూరం వేసి బాగా కలియబెట్టి, కుంపటిలో సన్నని సెగ మీద ఉంచాలి. పాలకు సరిపడ్డ చక్కెర (తీపి ఎక్కువ తక్కువలు వారి అభిరుచి ననుసరించి వాడవచ్చు) పొయ్యి మీద బాండలి ఉంచి డాల్డాగాని, నూనెగాని పోసి బాగా కాగనివ్వాలి. తర్వాత రుబ్బి ఉంచుకున్న పిండిని పెద్ద వుసిరికాయలంత ఉండలుగా తీసి దోరగా కాలనివ్వాలి. మరీ కాలితే బావుండదు పచ్చిగా లేకుండా కొంచెం దోరగా వేగనిచ్చి, తీసి ఆ పాలలో వేస్తుండాలి. 2, 3 గం|| సేపటికి బాగా ఊరి మెత్తగా అవుతాయి. సర్వ్‌చేసేటప్పుడు ఉండలతోపాటు కొనినిపాలు పోసిఇవ్వాలి

రెండో రకం—మొదటి దానికీ దీనికీ అట్టే తేడా ఉండదు. ఎటొచ్చీ, దానికి పాలు, దీనికి పంచదార పాకం వాడుతారు. $2\frac{1}{2}$ సోలల చక్కరలో ఒక గ్లాసు నీళ్ళుపోసి లేత పాకం రానివ్వాలి. ఇష్టమైతే రంగు కలపవచ్చు. మిగతా వండటం అంతా పైన చెప్పిన మాదిరే. ఏమీ తేడాలేదు. ఒకసారి చేసి చూడండి!



కుమారి
డి. య. రాజ్యలక్ష్మి

## జలగల శాఖ

వీధిలో గారడీవాళ్లు గారడి చేస్తున్నారు. వాళ్లలో పైల్వాన్ ఒకడు నిమ్మకాయను ఒకకన్నం చేసి రసమంతా పిండేశాడు "ఎవరైనా సరే ఈ నిమ్మకాయ లోంచి మరొక్కబొట్టు తెప్పిస్తే పదిరూపాయలిస్తా"నని సవాల్ చేశాడు.

బక్కపలచగా ఈసురోమంటున్న ఒక ప్రేక్షకుడు ముందుకువచ్చి నిమ్మకాయను పిండి పదిబొట్లు రాల్పించాడు.

బక్కవాణ్ణి చూసి దుక్కవాడు ఆశ్చర్యపోయి "ఎవరు నువ్వు? ఏంచేస్తూ ఉంటావు?" అని అడిగాడు.

"నేను ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంటులో గుమాస్తాని" అన్నాడు ప్రేక్షకుడు.

## "అచ్చు ఒప్పు"

రాజకీయ నాయకుడు ఉపన్యాసమిస్తూ "భారతప్రభుత్వం డబ్బులేక చాలా ఇబ్బందిపడుతోంది" అన్నాడు.

మర్నాడొక పత్రికలో "...చాలా ఇబ్బంది పెడుతోంది," అని అచ్చయింది.

## విలవైన సలహా

గంటసేపటినించీ వాగి వాగి అందర్నీ విసిగిస్తున్న ఒకడు: "నేనేపనిచేస్తున్నా అందులో పూర్తిగా మునిగిపోతాను."

మరొకడు:—"మీరేదన్నా నుయ్యోగొయ్యో తవ్వితే ఎంత బావుంటుంది?"

# వింతవాణి

బాబూ! 'యోర్క్ సాయిబు' బుడ్డి ఉందాండీ?" అని అడిగింది ఒక వయసు మళ్ళినావిడ మందుల షాపులోకి వచ్చి.

ఆ షాపుకే ఎందుకో వెళ్ళిన నేను ఆశ్చర్యపోయా—'ఇన్ని మందులపేర్లు విన్నాను కాని, ఈ సాయిబు మందేవిట్రా!' అని.

ఆ మందులషాపు యజమానికి కూడా, "ఆ! ఉంది!" అంటూ లోపలికి వెళ్ళడంతో నేను మరీ ఆశ్చర్యపోయాను. ఆ మందేమిటో చూద్దామని కుతూహలం ఎక్కువైంది.

లోపలికి వెళ్ళి ఆయన ఒక "యూకలిప్టస్ అయిల్ బాటిల్"తో వచ్చారు. ఆవిడ డబ్బు చెల్లించి, బుడ్డి తీసికొని వెళ్ళిపోయింది. నేను ఆశ్చర్యంతో ఆయనవేపూ, ఆబుడ్డివేపూ, ఆవిడవేపూ, చూస్తూ ఉండిపోయాను.

ఆవిడ వెళ్ళిపోయాక, "ఏమండీ ఆవిడ ఏమని అడిగింది? సరిగ్గా విన్నారా?" అని అడిగాను ఆషాపాయన్ని.

ఆయన నవ్వి "అదో వింత! ఇంకా వింతైనవి వింటూంటాం అలవాటైపోయింది కనుక మాకు అర్థమౌతుంది. 'యూకలిప్టస్ అయిల్'నే ఒక మహానీయుడు "ఏప్ గోక్ సాయిబు" అనికూడా అన్నాడు 'ఏవిటి?' అని మేం అడగలేము." అని ఆయన అంటూంటే ఆశ్చర్యంతో వింటూ ఉండిపోయాను.

"'యూడీకొలోన్'ని కాలా మంది - చాలా ఏవిటిలెండీ,-దగ్గర దగ్గర అంత మందీ 'ఉడుకులాం' అంటారు" అంటూ మళ్ళీ నవ్వారాయన.

కేవలం మందుల్లోనే కాక, మామూలుగా మాట్లాడుకునే చాలా మాటల్ని మనవాళ్ళిలాగే పలుకుతారు.

మా యింట్లో ఒక వంటవాడుండేవాడు. ఓ నాడు నేనెక్కడికో బయలేరబోతూంటే వాడెదురై, "మీ 'విష్ణువాచీ' ఏది బాబూ?" అని అడిగాడు.

'విష్ణువాచీ' ఏమిటా అని విస్తుపోయా, వాడో మేనల్లుడున్నాడు. వాడి పేరు 'విష్ణు' వాడి మొహానికో వాచీ ఉండి ఏడవ లేదు. మరి ఈ విష్ణు ఎక్కడినుంచి, దిగొచ్చాడు? అనుకుని, "విష్ణువాచీ ఏమిటోయ్?" అన్నాను

"అదేనండి మీ వాచీయే!" అన్నాడు వాడు

అప్పటికి అర్థమయింది నాకు.

"హోరి రిస్టువాచీయా! విష్ణువాచీ ఏమిటోయ్" అంటూ నవ్వాను.

మా ఇంట్లోనూ ఇలాంటి పదజాలం ప్రయోగిస్తూండడంలో అఖండుడు. ఓసారి లెక్కల పరీక్షకి వెళ్ళబోతున్నా.

## ఎస్. వెంకటచలం

"ఇయ్యాల పరీచ్చేటి బాబూ?" అని అడిగేడు.

"మేథమెటిక్సోయ్!" అన్నాను.

వాడు నోరావలించి, తెల్లమొహం వేసి,



'అందమంటే నాదే...'

చిత్రం : వేమూరి లక్ష్మి

"మేక పెంటికలు పరీచ్చేటి బాబూ?" అని అడిగాడు.

నేనోమారు సినిమాకెళ్ళాను. నా వెనకాల ఎవరో గోలపెడ్తూ సినిమా చూస్తున్నారు. మధ్యలో "అబ్బ ఏమి స్వెట్టింగులురా! అనడం మొదలెట్టాడు ఒక సోదరుడు. మరో సోదరుడు, "అబ్బ! దాని 'వేక్షను' ఎంతబాగుందిరా!" అన్నాడు.

స్వెట్టింగులూ, వేక్షనూ బాగానే ఉందనుకున్నా నేను.

కేవనింగు రోజుల్లో 'టెంపరరీ కోర్సు'ల్ని 'టెంపరేచరు కోర్సు' లన్నవాళ్ళని కోటి ఎంతమందిని చూశా.

* * *

"వాళ్ళమ్మాయికి 'టైపార్టీ' వచ్చిందట!" అన్నారు పొరుగింటి వెంకాయమ్మగారు. ఇదేదో టీపార్టీలాంటిదేమో అనుకున్నా—వివరాలన్నీ అడుగుతే బాగుండదని, ఊరుకున్నా కాని, ఎప్పుడూ వినని ఆ 'పార్టీ' ఏమిటోనని, భలే అనుమానం పట్టుకుంది.

ఆవిడ వెళ్ళిపోయాక, మా అమ్మని, "వాళ్ళ అమ్మాయికి, 'టైపార్టీ' రావడంయేవిటి?" అని అడిగాను.

"టైఫాయిడ్రా!" అంది అమ్మ.

వెంకాయమ్మగారి పార్టీ చాలా బాగుందనుకున్నా.

మాశారూ! మనం 'గాడిదగుడ్డూ', కంకరపీచూ" అంటాం అది ఈ రకమైన 'వింతవాణి'లోంచి పుట్టినదేనని, ఎవరో చెప్పగా విన్నా.

ఇంగ్లీషు "ఫాదర్లు" వాళ్ళమతాన్ని వ్యాపింపజేయటానికి వచ్చిన రోజుల్లో, 'గాడ్,ది గుడ్; కాంకర్ పీస్' అన్న మాటలు తరుచూ వస్తూండేవి. అంటే 'God the good. Conquer peace'. అని ఇంగ్లీషు అర్థమవనివాళ్లు అదేవిటోనని, ఆసక్తితో వింటున్న కొద్దీ దాని అర్థం మరింత అగమ్యగోచరమైంది. చివరికి వాళ్ళు "గాడిదగుడ్డూ, కంకరపీచూ" అని తేల్చారు.

అక్కణ్ణుంచీ తెలియని దాన్ని గురించి అడిగినప్పుడు, 'గాడిద గుడ్డూ, కంకరపీచూ' అనడం పరిపాటయింది.

'ఎలకనిటీ,' 'కలకటేరు', అన్నవి ఆనేకం మా వెంకాయమ్మగారి "డిక్షనరీ" లోవే!

ఒకరు 'ఎంకి పాటలు' బహు చక్కగా

పాడతారు. బహిరంగ సభల్లో కూడా పాడు తూంటారు. ఒకసారి మా కాలేజీలో ఆయన విజిటింగయింది. ఏదో ఉపన్యాసం ఇవ్వడానికి లాగుంది-పిల్చారు. ఉపన్యాసం అయిపోయాక, శ్రోతలు కోరిన పాటలు కొన్ని పాడతానని చెప్పారాయన.

ఈయన సంగతి కొద్ది కొద్దిగా తెలిసిన ఓ సోదరుడు, సభాస్థలి మధ్యలో నిలబడి, గంభీరస్వరంతో "ఇంక్ బాటిల్ సాంగ్సు పాడండి" అని అర్థించాడాయన్ని. హాలు ఎగిరిపోయేటట్టు నవ్వారందరూ! ఆ సోదరుడు ఏ సిరా బుడ్డిలోనో గంతుంటాడు. ఆ ఉప న్యాసకులు ఒక్క సారి కుర్చీలోంచి లేచి, మా ప్రార్థనలనేనా వినకుండా వెళ్ళి పోయారు కోపంతో.

ఇలాగే తెలుగు మాటల్ని కూడా 'వింత' గోలోకి మార్చేస్తారు.

ఒక రోజు, "ఫలానివారు 'గుఱ్ఱప్రవేశం' చేశారు. విన్నా?" అంటూంటే విన్నా. ఇదేదో 'హెలెన్ ఆఫ్ ట్రాయ్'లో గుఱ్ఱంలా ఉంటే అనుకొని, గుఱ్ఱప్రవేశమేమిటండీ?" అని అడిగా

"అజ్ఞానోయ్! కొత్తింటిలోకి వెళ్ళడం. ఈ పాటి తెలీదూ?" అన్నారు వారు 'గృహ ప్రవేశాన్ని' 'గుఱ్ఱప్రవేశం' చేశారన్న మాట.

* * *

మాయింటిపక్క వెంకాయమ్మగారన్నా కీ ఆవిడకో దండుకోడలుంది! (కొత్త ఇంగ్లీషు వచ్చునావిడకి!) ఓనాడు ఈవిడకీ, కోడలికీ మధ్య హైడ్రోజన్‌బాంబు పేలింది. కోపంలో గిట్టుకోవడం వరకూ వచ్చిన తర్వాత, కోడలు ఇంగ్లీషులో ఏదో అంది. వెంకాయమ్మగారేమో కోడలిదండుతనాన్ని ముక్కుమీద వేలేసుకోవడంకంటె ఏమీ చెయ్యలేక, మా అమ్మతో "చూశారండీ పిన్నిగారూ? ఇది మరీ హద్దుమీరుతోంది! దీని ఇంగిలీషు తగలబడా! నన్నేమందో విన్నారా? 'డుంటాక్! కీచుపిట్టా!' అంది. నేను కీచుపిట్టనా?" అని, పాడికళ్ళని అంతకంటూ పొడిగా ఉన్న శ్వేతవర్ణాంబరంతో తుడుచుకున్నారు.

అసలు ఆ కోడలు "డోంటాక్! కీప్ క్వయట్!' (Don't talk! Keep quiet!) అంది. Keep quiet, కీచుపిట్టయి, వెంకాయమ్మ గారికి 'కీ' పెట్టబడిలింది. ★

# ఫన్ డాక్టర్

# చంద్రశేఖరం

——" అంటూ, థాట్ రీడింగ్ (పరేంగిత గ్రహణ విద్య) పై చిన్న సైజు గంభీరోపన్యాసాన్ని ముగించి, ఆవిద్యను ప్రదర్శించడానికి ఉపక్రమించారు (ఫన్) డాక్టర్ చంద్రశేఖరం.

"ప్రేక్షకులలో ఎవరైనా ఒకరు వేదిక మీదకు రాగోరుతున్నాను" అనేసరికి, మూడు నాలుగు వందల ప్రేక్షకులలోనూ ముందు వరసలో కూర్చున్న ఒక యువకుడు ముందుకు వచ్చాడు తక్షణం.

"ఇతను మా అబ్బాయేం కాదండి. ఎవరైతేనేం ఫరవాలేదు. నాకు పక్షపాతం లేదు. ఇప్పుడు ఈ ప్రేక్షకుడు నా మనసులో ఊహాలను పుస్తకం చదివినటు చదివేస్తాడు చూడండి. చూచి ఆశ్చర్య పడండి" అన్నాడు డా॥ చంద్రశేఖరం. అని, (ఇక్కడ కళ్లజోడున్న బొమ్మ చూడడం అవసరం) గంభీరంగా కళ్ళజోడులోంచి ప్రేక్షకుడి కళ్ళలోకి చూసి, మాటవరసకి పోంచూశాం అని కొత్త హంగు చేసి, 'నాయనా' అనేసరికి ఆ యువకుడు మంత్రముగ్ధుడైనట్లు కుర్చీలో కూలబడ్డాడు.



పల్లెటూరు కోసం కృషి
'సింపుల్ ట్రావెలింగ్ థియేటర్' సాధనం

"నోటు సంఖ్య తెలుసుకుంటాను అది ఎంతో చెప్పచూద్దాం" అన్నాడు పరేంగిత గ్రహణ విద్యా ప్రదర్శకుడు డా॥ చంద్రశేఖరం.

"యూ శైరెంతు" అన్నాడు కళ్లు మూసుకున్న ప్రేక్షకుడు.

"రైట్! యు ఆర్ రైట్" అన్నాడు చంద్రశేఖరం చూశారా నాప్రజ్ఞ అన్నట్టు ప్రేక్షకుల వంక చూస్తూ.

అంతవరకూ, ఏం జరుగుతుందో అని నిశ్శబ్దంగా కూర్చొని చూస్తున్న ప్రేక్షకులు ఒక్కసారి గొల్లున నవ్వారు ఈ హాస్యరసజ్ఞుడి సరసాన్ని ఆస్వాదించి.

కాంగ్రెసు నాయకుడు శ్రీ శే సత్యమూర్తి కరతాళధ్వనులుచేసి "ది మోస్ట్ ఇంటలిజెంట్ నాన్సెన్స్" అని మెచ్చుకున్నారు. అందరూ నవ్వినా ఓకాయనకి మటుకు కోపంవచ్చింది.

చాలా కోప్పడ్డారు 'ఇదేమి విద్య' అని థాట్ రీడింగ్ లో ప్రజ్ఞ ఉందన్న వాడే ఎవటి



సీమరైతు　　డిటో బైతు　　'యు ఆర్ రైటు!'

# బాల సాహితి

## మృత్యు దేవత

గౌతమీ తీరాన
కలదు వన మొకటి-
ఫలవృక్షసముదాయ
ములతోడ నిండి.

మునివరుం డొక డచట
ముక్తిబడయంగ
స్థాపించి - ఆశ్రమము
తపమునకు బూనె.

అనతి కాలములోనె
అతని కబళింప
కాచియున్నది మిత్తి-
కాంచె మునివరుడు.

మృత్యువును వంచించి
బ్రతికిపోదలచి
యుక్తికై యోచించె
యోగిపుంగవుడు.

తనబోలు మునివరుల
తన శక్తిచేత
సృజియించె నెందరినో
పరిసరములందు.

మృత్యుదేవత వచ్చి
మునికోటి గాంచి
నిజమైన ముని ఎవరో
తెలిసికొనదాయె.

"గట్టి వ్యూహమె పన్న-
కాని, ఫల మేమి?
చిన్న పొరపాటుతో
చిక్కె ముని జాడ!..."

అని మిత్తి బొంకి, దర
హాస మొనరింప-
మునివరుని మనసులో
జనియించె భయము.

"ఏమిటా పొరపాటు?"
అని నోరు జారి
మృత్యువును ప్రశ్నించె
ముందు కేతెంచి.

ముని ఎవరో తెలిసిపో
యెను మృత్యువునకు
చెంత కేతెంచి, ముని
చేయి పట్టుకొని,

"నన్ను వంచింపగా
నీ తరమె వత్స?
నన్ను - భువి తప్పింప
కొన్నవా రెవరు?"

అని విరగబడి నవ్వి,
మునిని తన వెంట
లాగుకొనిపోయె; క్షణ
మాగలే దచట.



'సదానంద'

# వినాయకుడి పెళ్లికి...

పూర్వకాలంలో వినాయకుడు అన్నగారైన కుమారస్వామితోకలసి తరుచుగా దేవతల వివాహాలకు వెళ్లి వస్తూ ఉండే వాడు. ఇలా కొన్ని రోజులైనాక తను కూడా పెళ్లిచేసుకోవాలని హఠాత్తుగా కోర్కె కల్గింది. అనుకోవటమే తడవుగా తన వాహనమైన మూషికరాజ మెక్కి, ఒక్క పరుగున హిమవత్పర్వతం మీద మాటలాడుకొంటున్న తలిదండ్రుల వద్దకువచ్చి ప్రణమిల్లాడు. ఆశీర్వాదం పొంది, లేచి అలసట తీర్చుకొని, తల్లియైన పార్వతిదేవితో "అమ్మా! అందరి పెళ్ళిళ్లు అయిపోతున్నవి కాని,నా పెళ్ళిమాట మీరు అసలు తలపెట్టరేం? నాకు అసలు పెళ్ళిచెయ్య తల్చలేదా? నాకు పెళ్లి చేసుకోవాలని ఉన్నది, పెళ్ళి చెయ్యవా"? అని అడిగాడు. ఆ మాటలు విని పార్వతి "నిజమే నాయనా! కాని, పెళ్లి అంటే మాటలతో ఉన్నదా? చాలా డబ్బు కావాలి. ముందు పెళ్ళికూతురికి నగలు కావాలి; మధుపర్కం మంగళసూత్రం కావాలి ముఖ్యంగా, మన మేమో, కొండల్లోనూ గుహల్లోనూ, గుట్టల్లోనూ, ఉండే దరిద్రులమైతిమి. మనకు ఇల్లే లేదు. ఎట్లామరి"? అన్నది.

అప్పుడు వినాయకుడు "అవన్నీ నేను తెచ్చుకుంటే తప్పక పెళ్ళి చేస్తావా"? అన్నాడు. పార్వతి తప్పక చేస్తాను తెచ్చుకోమన్నది.

వెంటనే మన వినాయకుడు తన వాహనమెక్కి పెళ్ళి సరంజామా సంపాదించుటకొరకై బయలుదేరినాడు.

అలా కొంతదూరం వెళ్లినపిదప వినాయకుడి చిన్ననాటి నేస్తమైన



చిత్రం కోట్లపైడి అప్పలస్వామి.

గొర్రెపొట్టేలు కన్పించింది. పొట్టేలుతో "మిత్రమా! నాకో చిన్న సహాయం చేసిపెట్టు. నేను పెళ్ళి చేసుకోవాలని తలచాను. పెళ్లికూతురికి మంగళసూత్రం కావాలి. కనుక నువ్వు కంసాలివద్దకు వెళ్లి సూత్రం చేయించిపెట్టు" అని అడిగాడు. సంతోషముతో అంగీకరించి కంసాలివద్దకు సూత్రం చేయించటానికి వెళ్ళింది.

వినాయకుడు మళ్ళీ బయలుదేరి వెడుతున్నాడు. ఆవిధంగా కొంత దూరం వెళ్లినతరువాత, స్నేహితురాలైన, కోడిపుంజు కన్పించింది. పొట్టేలుతో చెప్పిన విధంగానే, పుంజుతో కూడ, పెళ్లికుమార్తెకు "మధుపర్కం" తెచ్చిపెట్టమని అడిగాడు. పుంజుకూడా, వినాయకుడి పెళ్ళి విందులో బాగా తిందామనే ఉత్సాహంతో మధుపర్కంకొరకై సాలెవాని వద్దకు వెళ్ళింది.

అలా ఇంకా కొలదిదూరం వెళ్లిన తరువాత, ఒకపందికొక్కు కన్పించి, వినాయకుడికి నమస్కారంచేసి కుశల ప్రశ్నలడిగింది. ఆ పైవారికి చెప్పిన విధంగానే పందికొక్కుతో కూడ చెప్పి, తన వివాహానికి కావలసిన ధనం చేకూర్చిపెట్టమని కోరాడు. పందికొక్కు కూడా, అందుకు, అంగీకరించి, పూర్వకాలపు వాళ్లు భూముల్లో పాతిపెట్టిన ధనం త్రవ్వుటకొరకై బయలుదేరి వెళ్లింది.

ఈ విధంగా, లంబోదరుడు ముగ్గురికి మూడుపనులూ పురమాయించి, పెళ్లికి కావలసిన మూడు వస్తువులు, లభిస్తున్నాయనే సంతోషంతో, తలిదండ్రులున్న హిమవత్పర్వతంమీదకు వెళ్లి కులాసాగా కాలం గడపసాగాడు.

ఇది ఇలా ఉండగా, మంగళ

(61-వ పేజీ చూడండి)

జి. లతశ్రీ

# దెబ్బకు దెబ్బ

(7-వ పేజీ తరువాయి)

మెత్తనంగా కరన్ కేసి తిరిగి "ఏం నా విగ్గులో అంతనవ్వ దగినదేముంది?" అన్నాడు. "అబ్బె! విగులో ఏముంది? మీ తలకాయే!" అన్నాడు కరన్.

చార్లెస్ లార్డ్ రసెల్ అనే ప్రముఖ బ్రిటిష్ బారిస్టరు (1832-1900; ఈయన ప్రధాన న్యాయమూర్తికూడా అయినాడు.)ను ఒక రోజున మరొక బారిస్టరు అడిగాడు: "ఇద్దరు భార్యలను చేసుకుంటే పడే శిక్ష ఏమి"టని.

"ఇద్దరు అత్తగార్లు!!" అని రసెల్ తక్షిమని సమాధాన మిచ్చాడు.

ఒక సారి ఒక ఐరిష్‌జడ్జి వాది ప్రతివాదులను చూసి "ఇంత చిన్న కేసుకోసం కోర్టుకెందుకెక్కారు? బయటే మీ తగాదా పరిష్కరించుకోలేకపోయారా?" అని అడిగాడు. అందులో ఒకడు "ఆ పనే చేస్తున్నాముండి. ఇంతలో పోలీసులొచ్చి మమ్మల్ని లాక్కుపోయారు!" అన్నాడు.

ఆస్వాల్డ్ అనే న్యాయవాది లార్డ్ ఇషర్ అనే జడ్జికి ఒకసారి చక్కని రిపార్టీ ఇచ్చాడు. ఆస్వాల్డు ఏదో అప్పీలు విషయమై వాదిస్తున్నాడు. జడ్జి ఈ వాదంతా ఏమిటని చాలా చిరాకు పడుతున్నాడు. చివరికి "ఇదంతా దేనికయ్యా చెబుతావ్. జడ్జీలకి కూడా కాస్త లోకజ్ఞానం ఉంటుందని ఎందుకనుకోవు?" అనేశాడు.

ఆస్వాల్డు "నేను కిందికోర్టులో చేసిన పొరపాటే అదండి" అని తక్షిమని కొట్టాడు.

* * *

ఎన్నికల ప్రచార సమయాల్లో కూడా 'రిపార్టీలు' ఒక్కొక్కసారి బ్రహ్మాండంగా పడతాయి. బానిస వ్యాపారానికి వ్యతిరేక ప్రచారం చేస్తున్న చార్లెస్ బర్లీ అనే ఒకాయనొకసారి సభలో మాట్లాడుతుండగా బాగా కుళ్లిపోయిన కోడిగుడ్డొకటి సూటిగా వచ్చి ఆయన మొహాన చితికింది. తాపీగా జేబురుమాలతో మొహం తుడుచుకుంటూ "బానిస వ్యాపారం ఉండాలనే వారి వాదన ఒక్కటీ సరైంది కాదని నేననడానికి నిదర్శనం ఇదే," అన్నాడాయన వెంటనే.

ఒకానొక అభ్యర్థి తనకు ఓటిమ్మని అర్థిస్తూ సభలో మాట్లాడుతున్నాడు. సభలోంచి ఒకడు "నువ్వు సాక్షాత్తు దేవదూత గేబ్రియల్‌వైనా నా ఓటు నీకివ్వను." అన్నాడు. దానికా అభ్యర్థి తముకుముకోకుండా "నేనే దవదూత గేబ్రియల్‌నైతే నీపేరు వోటర్ల జాబితాలో ఉండనే ఉండదు" అని బదులు చెప్పాడట.

ఒక ఎన్నికల ప్రచార సభలో అభ్యర్థి ప్రసంగిస్తున్నాడు. అతడు పాపం ఎంత ఆవేశంగా మాట్లాడేస్తున్నా ఎవరూ వినిపించుకోడంలేదు. వాళ్లెలాగైనా ఉత్సాహపరచాలని ఆ అభ్యర్థి "చరిత్రలో ఎప్పుడూ కనీ వినీ ఎరగనంత పెద్ద మెజారిటీతో గెలిపించినఖ్యాతి ఈ నియోజకవర్గానికి రావాలంటే ఏం చేయాలి?" అని ప్రశ్న వేశాడు. "ఇంకో అభ్యర్థిని నిలబెట్టాలి" అని సమాధానం వచ్చింది.

ఒకానొక యుద్ధకాలపు ఆస్పత్రిలో ఇది జరిగింది: అందమైన నర్సును చూసి రోగి "నేను బాగుపడినతర్వాత నన్ను పెళ్లి చేసుకుంటావా?" అని అడిగాడు "తప్పకుండా!" అన్నది నర్సు.

"అయితే నన్ను ప్రేమిస్తున్నావన్నమాటేనా?"

"లేదు. మామూలుగా రోగులందరి దగ్గిరా ఇలాగే అంటూ ఉంటాను. లేకపోతే రోగులు మరీ బెంబేలు పడిపోతారు."

"నైంటీంత్ సెంచరీ" అనే పత్రిక సంపాదకుడైన సర్ జేమ్స్ నోల్స్ రిపార్టీలో సిద్ధహస్తుడు. లూతర్ మన్‌డే అనే రచయిత "నేనెందుకు బ్రతికి ఉన్నాను?" అనే ఒక పద్యం పత్రికకు పంపించాడు. దానికి సర్ జేమ్స్ సమాధానంగా "మీరు స్వయంగా తీసుకొచ్చి ఇవ్వకుండా పోస్టులో పంపించారు గనుక!" అని వ్రాశాడు.

[సర్ ఎడ్వర్డ్ పలిహాన్ వ్యాసం ఆధారంగా.] ★

# ★ మబ్బూవానా మల్లెవాసనా ★

(9-వ పేజీ తవాయి)

రించాలి, ఆఁ!" అనుకున్నాడు మాధవరావు. "రానీ చెప్తా" అని గట్టిగా అన్నాడు. వచ్చేదాకా నిదరపోవచ్చు ననుకుని మెల్లిగా నిద్రకు ఉపక్రమించాడు.

మర్నాడు సాయంకాలం ఆఫీసునుంచి ఇంటికి వచ్చేప్పటికి సీత వచ్చేసింది.

మొహం కడుక్కుని కాఫీ తాగుతూ తను చెప్పదలచుకున్నది చెబుదామనుకున్నాడు గానీ, ఆ అమ్మాయి చాకలాడికి బట్టలేస్తోన్నదని చూసి, ఇది మంచిసమయము కాదు' అనుకుని విరమించుకున్నాడు. భోజనాదికాలు పూర్తిచేసిన తరువాత వెన్నెలలో అయితే భేషుగ్గా ఉంటుందని నిర్ణయించుకున్నాడు.

సీత, వంటిల్లుకడిగి ముగ్గెట్టి, తాళం వేసి వచ్చి, పక్కనకూచుని తమలపాకు చిలకలు చుట్టి నోట్లో వేసుకుంటోంది.

మాధవరావు 'రైటో' అని పుంజుకున్నాడు. వెంటనే సరళపదప్రవాహం ఉహూ సెలయేరులాగ వెలువడకపోయినా, ఉపోద్ఘాతంగా గొంతు సవరించుకుని సకిలించాడు: "ఏమిటి—ఆఁ!" అన్నాడు.

నోరు తమలపాకులు నమలడంలో పూర్తిగా నిమగ్నమయి ఉన్నందున కళ్ళతోనే 'ఏమిటి' అంది సీత. అని జవాబుకి ఎదురుచూడకుండా తమలపాకుల పళ్ళెం, దక్కపొడిభరిణా బీరువాలో పెట్టడానికి అటే వెళ్ళింది.

కాసేపు తెల్లబోయి తమాయించుకుని "సీతా—ఇలారా" అన్నాడు మాధవరావు.

దగ్గరకొచ్చింది సీత.

సీతని దగ్గరగా చూడగానే తాను చెప్పదలచుకున్నది అప్పటికి వాయిదా వేసి "పెళ్ళి బాగా జరిగిందా" అన్నాడు.

"ఆ! పెళ్ళికేం. దివ్యంగా జరిగింది. మీరు రాలేదని చాలా ఇదయ్యారు కూడాను" అంది సీత—మళ్ళీ వెళ్ళి బీరువా తలుపు మూస్తూ.

మాధవరావుకి చిరాకేసింది. సీతమీద కోపం వచ్చింది.—ఆ మాత్రం అర్థం చేసుకోదేమని.

కుదుటపడి, ఫ్లాష్‌బాక్‌తో ఆరంభించడం మంచిదని "నేను పెద్దపండక్కి మీ ఇంటికొచ్చినపుడు గుర్తుందా—" అన్నాడు.

"లేకేం. అన్నట్టు అపుడు మా అమ్మ నాకు పెట్టినచీర గుర్తుందా? ఎర్రంచు బార్డరు నల్లముక్కలు ఉంటాయి. అలాంటిదే మగపెళ్ళివాళ్ళు పెట్టారండీ నిన్న పెళ్ళిలో పదిహేను రూపాయలు తక్కువలోనే కొన్నారుటండీ అపుడు మా అన్నయ్యకి చెప్పా కూడాను—వెళ్ళి మళ్ళీ సరిగ్గా ధర కనుక్కురారా అని. బడుద్ధాయి విననే లేదు. బావుండదే—తీసేసుకున్నాంకదా అని సణిగాడు. కానీ భలే ఉందండీ..."

"మంచినీళ్ళు! మంచినీళ్ళు!!" అన్నాడు మాధవరావు.

తెచ్చిచ్చి వెళ్ళి పక్కమీద వాలింది సీత "నిన్న రాత్రంతా నిద్దరలేదూ" అంటూ.

మాధవరావు పిడికిళ్ళు బిగించాడు. పళ్ళు నిశ్శబ్దంగా కొరికాడు. ఆఖరి ప్రయత్నం చేశాడు—గొంతుకని సాధ్యమైనంత మెత్తగా వినబడేట్టుచేయ ప్రయత్నిస్తూ.

"సీతా! నిన్న రాత్రి తలగడాలమీద తల ఆన్చగానే వాసన..."

"అవ్వే మాసిపోయాయండీ—ఇవాళే చాకలాడికి వేసేశా కొత్తవి తొడిగాలెండి—హాయ్—పడుకోండి బాబూ నిదరొస్తోంది" అంది సీత ఆవులిస్తూ.

"లైటార్పేయండి బాబూ కాస్త" అని కూడా అంది.

"ఎర్రంచు బార్డరు—హుఁ!" అని సణుక్కుంటూ స్విచ్చిదగ్గర కెళ్ళాడు మాధవరావు. ★



# వెర్రి మొగమాటం



(11-వ పేజీ తరువాయి)

చెడిపోయిందని తిన్నావు! మానవజన్మ ఎత్తిన వాడూ, పెద్దమనిషి అయినవాడూ, పట్నంలో పలుగురిలోనూ తలెత్తుకు తిరుగుతున్నవాడూ ఒంటిగంటలోపున ఎవడన్నా తింటాడూ! పోనీ పూర్వుల సంగతి ఆలోచించు. నీ అబ్బా, నీ తాతా ఎప్పుడేనా అపరాహ్ణం తిరగకుండా విస్తరిదగ్గర కూచున్నారూ? భోంచేశారా! నువ్వు తింటేచాలు. మేమేం తినక్కరలేదు కాబోలు! ఇంత స్వార్థపరుడవనుకోలేదు," అంటూ ఓ బల్ల దగ్గర కూచోపెట్టాడు. ఉమ్మాయి పాపం తనేదో నేరంచేసినట్టు బాధపడడం మొదలెట్టాడు.

ఫలహారం కాగానే బయటకు వచ్చారు. "ఇంక నన్ను విడిచిపెట్టరా" అన్నాడు దీనంగా ఉమ్మాయి. "అలాగే. మనవాళ్లతోటి చెప్పకుండా ఉడాయిద్దామనే! ఇన్నాళ్ళూ ఉండి చెప్పకుండా పోతావురా? ఎంతవిశ్వాసఘాతకుడవు! ఏహాములో ఏపుట్టి ఉన్నదో ఏం తెలుస్తుంది?" అంటూ వెన్నె తొక్కాడు. ఉమ్మాయికి చైతన్యం పోయింది. కాదని కూడా అనలేదు. ఇంక శంకరం చేతులో కీలుబొమ్మలా తయారయ్యాడు!

ఎందుకో కర్మంజాలక ఆరోజూ, మర్నాడూ అందరకూ శెలవులు. శంకరం భోజనంచేసి, ఉమ్మాయి చేతకూడా మళ్ళీ తినిపించి, గోపాలం ఇంటికీ, అక్కడనుంచి ముగురూ కలిసి వెంకన్న ఇంటికీ వచ్చారు. అక్కడ సావకాశంగా ఉమ్మాయి ప్రయాణం సంగతి ఆలోచించారు. శెలవుల్లో ప్రయాణం చెయ్యడం భావ్యంకాదని మొదటి రిసల్యూషను ఏకగ్రీవంగా సభవారు కరతాళ ధ్వనులతో ఆమోదించారు.

పోయేవాడు ఎలాగూ పోతున్నాడు కనుక, ఈ మూడుపూటలూ సభవారికి విందులూ వినోదాలూ ఏర్పాటుచేసే బాధ్యత ఉమ్మాయిమీద పెట్టబడినది. ఈ రెండో తీర్మానం కూడా ఏకగ్రీవంగానే ఆమోదించబడ్డది. ఆ తరువాత ఈ సభవారందరూ ఉమ్మాయికి రాజగౌరవాలతో వారి గ్రామానికి పంపించ గలందులకు నిశ్చయించడమైనది. 'వీలు వెంబడిని' అని చేర్చమని గోపాలం సవరణ తెచ్చాడు. సవరణ అంగీకరించారు. 'ఆయన స్వంతఖర్చుతో' అని చేర్చాలని వెంకన్న సవరణ ప్రతిపాదించాడు. వాడి స్వంతఖర్చుతో కాకపోతే మన స్వంత ఖర్చుతో ప్రయాణానికి ఉమ్మాయి వచ్చినా వొప్పుకోడన్నాడు శంకరం. ఇలా కొంచెం వాదోపవాదాలు అయినాక, ఏందుకేనా మంచిదని ఈ సవరణకూడా అంగీకరించారు సభవారు. ఇంత సేపూ మరణశిక్షవిధించబడ్డ ఖైదీలా మారుమాటచెప్పకుండా కూచున్నాడు ఉమ్మాయి.

ఇంక కాలయాపన మెందుకని బయల్దేరారు సినిమాకు. బస్సు అయితే ఆలస్యమవుతుందని టాక్సీ చేసుకున్నారు. ఇంక చెప్పడానికేముంది. ఆ మూడుపూటలూ, సినిమాలు, నాటకాలు, ఫలహారాలు, విందులు వినోదాలూ, మహాబలిపురం యాత్రతో క్షణంలాగడిచిపోయినాయి. ఇంక సాయంత్రం ఉమ్మాయిని పంపించేద్దామనుకున్నారు. పాపంవాడేదో కొనుక్కోవాలనుకున్నాడు; "నువ్వు తీసుకెళ్ళరా బజారుకు" అన్నాడు శంకరం గోపాలంతో.

గోపాలం ఉమ్మాయి బయలుదేరారు. గోపాలం టాక్సీ పిలిచాడు. మౌంటురోడ్డు వచ్చారు. ముందు కోస్త కాఫీ తీసుకున్నారు గోపాలం సలహామీద. మళ్ళీ టాక్సీ పిలుస్తానన్నాడు గోపాలం. వలద్దుగాని, ఒక్కమాటు పోస్టు ఆఫీసుకు వెళ్ళవద్దామన్నాడు జాలిగా ఉమ్మాయి. ఈ మూడుపూటల నుంచీ ఒక్క మాటకూడా మాట్లాడలేదు ఉమ్మాయి. తపాలా ఆఫీసుకు వెళ్ళారు. గోపాలం అక్కడ ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఉమ్మాయి కాళ్ళు ఈడ్చుకుంటూ లోపలికి వెళ్ళి 'డబ్బు అయిపోయింది. ప్రయాణం ఆగిపోయింది. డబ్బు తంతిద్వారా పంపండి' అని ఇంటికి టెలిగ్రామిచ్చాడు; బయటికి వచ్చాడు. "ఏరా ఎక్కడికి పడదాం ముంగు?" అన్నాడు గోపాలం. 'బసకే' న్నాడు ఉమ్మాయి టూకీగా. గోపాలం తెల్లపోయి "ఏం. ఏమన్నా మరచిపోయావా?" అన్నాడు.

"ఏం మరిచిపోలేదు. ఇంటిదగ్గరనుంచి తెప్పించిన వందరూపాయలూ అరిపోయినాయి. ఆఖరురూపాయితో మళ్ళీ డబ్బు పంపమని ఇప్పుడే టెలిగ్రాం ఇచ్చాను. ఇంకను ఇంటికి దర్జాగా రోడ్డుమీదవింతలు, విశేషాలూ చూస్తూ నడిచిపోదాం. సాయంత్రానికో రేపొద్దుటకో డబ్బువస్తే మావూరుపోతాను. మళ్ళీ సభలూ సన్మానాలూ, సాగనంపడాలూ ఏమీ తలపెట్టకండి" అన్నాడు ఉమ్మాయి. గోపాలానికి జాలి వేసింది.

"నడవడం ఎందుకురా బస్సులో పోదాం," అంటూ బస్సుదగ్గరకు నడిచారు. అలాంటివాడు మా ఉమ్మాయి! ఈ మనోదౌర్బల్యమే లేకపోతేనా, ఎంతటివాడయ్యేవాడో!! ★

# యమభాగోతం!

(6-వ పేజీ తరువాయి)

ఛాతీకీ, నడుముకూ ఇంత నీలిరంగు అద్దకం దట్టంగా పట్టించేసుకున్నాడు. యముడి వేషానికి తగినట్టుగా బుర్రమీసాలు అంటించుకున్నాడు. అద్దంలో చూసుకుని తన ఆకారానికి తానే మురిసిపోయాడు. ఎప్పుడెప్పుడు రంగంమీదికి వద్దామా అని ఆదుర్దా పడసాగాడు.

సావిత్రి నాటకంలో, దాని దుంప తెగ, యముడివేషం ఒక పట్టాన రంగం మీదికి వస్తుందా? ఎంత కథ నడవాలి! ఎంత కమామిషు!

భాగోతం సాగిపోతున్నది. రాత్రి పన్నెండయింది: ఒంటిగంట అయింది! ఊహూఁ. యముడు వచ్చే ఘట్టం ఇంకా రాలేదు. అసలు సంధ్యవేళే రంగులకం ముందాన అద్దకం పట్టించాడేమో, కొత్తయముడి వళ్లు కారంపూసినట్లు భగ భగా మండిపోతున్నది! ఆ మంటలు భరించ శక్యం కాకుండా ఎక్కువైపోతున్నవి, పాపం! ఎప్పుడెప్పుడు వేషం విప్పేసి ఊరిబయటవున్న చెరువులో పడదామా అన్నంత విసుగుపుట్టుకొచ్చింది అతగాడికి.

అప్పటికి తెల్లవారగట్ల దాదాపు మూడు గంటలై వుంటుంది. సిగ్నల్ ఇచ్చారు. ఇక యముడు ప్రవేశించవచ్చునన్నారు.

తెగ బలిసిన నల్లటి దున్నమీద ఎక్కి, ఒకచేత్తో గదా, మరొకచేత్తో పాశం ధరించి, బుర్రమీసం తిప్పుకుంటూ, దహించుకు పోతున్న వంటిబాధను దిగమ్రింగుతూ సాక్షాత్తూ యమలోకంనుంచి ఊడిపడి నట్లుగా రంగం స్థలంమీద యముడు సాక్షాత్కరించాడు!

ఇటు ప్రేక్షకులవేపు ఒకసారి, అటు పక్కనే పెనిమిటిని పెట్టుకునివున్న సావిత్రి వేపు ఒకసారి చింతనిప్పులు రాలుస్తున్న ఆ కళ్లతో అతి భయంకరంగా చూశాడు; చూసి నిశ్శబ్దంగా నిలుచుని పోయాడు. ఎంతసేపటికీ మాటా మంతీ లేని ఆ యముణ్ణి సంభాషణలోకి దించడానికి సావిత్రి :

"మహానుభావా! ఎవరు మీరు?" అని ప్రశ్నించింది.

"నేనా! తెలియదా? గాదకొండ వెంకటప్పయ్యను!" అన్నాడు, ప్రేక్షకుల గుండెలు దద్దరిల్లిపోయేట్లు. రెండోసారైనా మాట తిప్పుకుంటాడేమోనని సావిత్రి :

"మహానుభావా! తాము వచ్చిన కారణం?" అన్నది.

"బుద్ధి గడ్డితినివచ్చా," అని అనేసి ఆ యముడు చెరువు వేపు ఆదేపరుగు! దానితో ప్రేక్షకజనం గొల్లుమన్నది! వీధిభాగోతం యమ భాగోతంగా మారిపోయింది! ★

# ఎక్స్ ఫిలింస్ వారి

# నెక్స్ట్ పిక్చర్

"గురూ! గురూ నా గుండె కరిగిపోతోంది కరిగి నీరైపోతోంది," అంటూ గురువులు పరుగుపరుగున వచ్చి గురువు పాదాల మీద వాలాడు

గురువు పెద్దసైజా కారక్టర్ యాక్టరు వాళ్ళ ఊళ్ళో వాళ్ళు చాలాసార్లు అతనికి నవ్వు చెప్పగా, ఆయన చిన్నప్పట్నుంచ దక్కా వచ్చి, చాలామందికి, చాలాచాలా నవ్వు చెప్పేచూశాడు

అతనినటన చూచేవాళ్ళు దొరక లేదు దొరికినవారు సాంతంకాంతంగా చూడలేదు స్టుడియో గేటు అవతల కాస్త అసింటా క్యారక్టరాక్టును చేస్తానంటే ససేమిరా వద్దన్నారు అందుకని గేటుకి ఇవతలగా కాస్త ఇసింటా ఆ పని చేస్తూ

> "విన్న మీరు చూసిన చిత్రం సుఖాంతమేనాండి?"
>
> "ఆహా అది అయిపోగానే అందరం హమ్మయ్య అని ఇవతలికొచ్చి సుఖపడ్డాం"

కూర్చుంటాడాయన అలా ఉండి ఉండి పోలేదు అనుభవంగడించి, గడ్డంపెంచి కొంత గొప్పవాడయ్యాడు చిన్నసైజా శిష్యుల గాంగుని సంపాదించాడు మెల్లిగా ఓ ఆఫీసుతెరిచి, పుకార్లు ఉత్పత్తిచేసి పోపులో వేసి పాండీబజారులో అమ్మి, సొమ్ము చేసుకునేవాడు కాస్తకాస్త ఈ విధంగా పరక్ష విరుఘాంకిత దనిపించుకున్నాడు శిష్యబృందంలో

* * *

"గురూ గుండె కరిగిపోయె" అంటూ గురువులు గురువుగారి కాళి మొలవాలిన వేళకు ఆయన కాస్త హడావుడిగా ఉన్నా, గురువులు ఊపిరి సలుపనివ్వనందువల్ల వాడి గోడు వినక తప్పిందికాదు

"వత్సా! వెధవ పీనుగా నీ పిగతరగా' తేఘూరించు నీగోడు" అన్నాడు వాత్సల్యంతో

"గురూ మరీ, మరేమోనూ-ఓ కుర్రాడు ఇంటాకా, చెట్టుకింది కంపెనీలోకెళ్ళీ, మళ్లీ యాడతా లగెత్తుకెళ్ళి పోతన్నాడు ఎందుకో తెలిసిందికాదు అంతలోకే ఒవుడో ఆడ్రాం ఏదోసెప్పి, మళ్లీ లోపలికి తీసుకెళ్లాడు! ఇంకోనిమిసం అయేతలికి యంతాచ్చరం ఆ బుల్లోడు నవ్వుతా తేలుతా ఇవుతాల కొచ్చాడు ఏంటి గురూ! ఈపోద్దాని కర్దం? ఇంతలోకే,ఆ పొద్దూ ఎరు ఫళ్యాస్తాపడి పట్టు దల ఒగ్గేసి కానుసు ఇత్తాం బుల్లోడా అన్నా రా?" అన్నాడు గురువులు గురుతర కుతూహలా యత్తచిత్తుడై

గురూజీ ఒకక్షణం కళ్లు మూసుకుని ఆలోచించి బీడీముట్టించి, ఆ వొద్యం ఏమిటో అవగతంచేసుకుని ఇలా చెప్పాడు

"నాయనా గురువులూ, నిన్ను చూస్తే జాలి వేస్తున్నది నీ దుంపతెగ ఎందుకు పనికొస్తావు అందులో వింతేముంది ఆ ఘాడ్యూసరు మొదటిసారి ఆ కుర్రాడికి ఛాన్సు ఇవ్వనన్నమాట నిజమే రెండో సారి ఇస్తానన్నమాటా నిజమే కాని ఎందుకుఇస్తానన్నాడు? ఏమిటిస్తానన్నాడు?

విను రెండోసారి ఆ కుర్రాడిని లోపలికి తీసుకెళ్లినవాడు డిస్ట్రిబ్యూటరుగారి

> **ప్రగతిగతి**
>
> ఇద్దరు పెద్దలు ఒక చిత్రం చూచి ఇంటికి వెళ్తున్నారు. ఒకాయనకు ఆచిత్రం బాగా నచ్చింది కాబోలు తెగపొగిడేశాడు
>
> "ఆహా ఏమి చిత్రమండి అసలు ఈ చలన చిత్రకళ ఎంత అభివృద్ధి చెందింది పాతిక ముప్పైఏళ్ళలో ఎన్నిమార్పులు వచ్చాయి!" అన్నాడు
>
> "మరే కొత్తలో బొమ్మలు అటూ ఇటూ తిరిగేవి దరిమిలా టాకీలు వచ్చాక మాట్లాడే సినిమాలు చూశాం ఇప్పుడొస్తున్నవి కంపుకూడా కొడుతున్నాయి" అన్నాడు రెండో ఆయన

"ఈ కుర్రాడింక కొడుకు రోల్సుకి తమ్ముడు వేషాలికీ పనికిరాడనుకుంటానుసార్ కాస్త పెకండు హీరోలాటి వేషాలు వెతుక్కోమనండి"



ఆగష్టు విడుదల

N.T. రామారావు...
గుమ్మడి.........
R. నాగేశ్వరరావు...
రాజనాల.......
A. ప్రకాశరావు....
G.N. స్వామి......
బొడ్డపాటి......
జమున..........
కృష్ణకుమారి......
సూర్యకళ........
సత్యాదేవి నటించిరి

-డైరెక్షన్-
సీ ముద్రాల
-నిర్మాత-
కె. గోపాలరావు

పూర్ణా రిలీజ్

అశ్వరాజ్ వారి

# వినాయకచవితి

మహోత్తర పౌరాణిక చిత్రము

FLOODLIGHT

-డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ- C. నాగేశ్వరరావు.. -మ్యూజిక్- ఘంటసాల.. -ఆర్టు- S.V.S. రామారావు.. -డాన్సులు- పసుమర్తి.. -ఎడిటింగ్- N.S. ప్రకాష్

FLOODLIGHT

డిస్ట్రిబ్యూటర్లు: ఆంధ్ర, సీడెడ్, నైజామ్-పూర్ణాపిక్చర్స్ (ప్రై) వేట్ లిమిటెడ్; మైసూరు-విజయాటాకీస్ డిస్ట్రిబ్యూటర్సు, బెంగుళూరు

కావమరిది. వాడూ వీడూ చిన్నప్పుడు గోటీ బిళ్ల ఆడుకుని ఉంటారు. అందుకని వాడు సిఫార్సు చెయ్యడంలో, ప్రొడ్యూసరు బాగుండదని ఛాన్సు ఇస్తానన్నాడు. అయితే ఎందులో?

నెక్స్ట్ పిక్చర్‌లో ... అది వాడు తీసినప్పుడుమాట; వీడు వేసినప్పుడు మాట. ఆపంగతి వాడికి తెలుసుగాని వీడికి తెలీదుగా. అయినా వీడూ వాడూ కూడా ఇప్పటికి ఆనందపడ్డారుగదా. వెయ్యేళ్లకి అదే కావలసింది.

# ప్రేక్షకులూ, అభిరుచులూ

## నెక్స్ట్ పిక్చర్ మాహాత్మ్యం

నాయనా ఈ "నెక్స్ట్ పిక్చర్" అనేదాంట్లో గొప్ప మహాత్యం ఉందిలే. మూజిక్కు ఉంది. నొప్పించక తానొవ్వక తప్పించక తిరగమని ఓ పద్యంలేదూ దాని తాలూకు సినిమా ట్రిక్కు ఇదన్నమాట.

ఎవరేమడిగినా సరే నెక్స్ట్ పిక్చర్లో తప్పకుండా ఛాన్సు ఇస్తానంటే సరిపోతుంది.

ఇప్పుడు నేనున్నానా. ఇదివరకు ఇలా లేను. ఇదివరకు నేను పది 'నెక్స్ట్ పిక్చర్ల'లో

> "భూకంపంతో చిత్రం ఆరంభించి అక్కడినించి కథను క్లయిమాక్సుకు నడుపుకుపోవాలి" అనేవాడు ఒక ప్రముఖ నిర్మాత.

హీరో రోల్సు, ఇంకో పదింటిలో రౌడీ రోల్సులు, ఇంకో మూడు నెక్స్ట్ పిక్చర్లలో రేలంగి రోల్సూ వేసివాణ్ణి. అప్పుడు నాతో లత అనే అమ్మాయికూడా ఉండేది. అది ఏడెనిమిది నెక్స్ట్ పిక్చర్లలో హీరోయినుగా ఉండేది. తరవాతమా నెక్స్ట్ 'పాండీబజారిపడి,' చివరకి ఇంటికెళ్ళిపోయిందనుకో. అవి తలుచుకుంటే నా హృదయం కంపిస్తున్నది. గొంతు గద్గదస్వరంతో మాట్లాడుతున్నది. అవెందుకులేగాని. అదీకథ.

నేను నెక్స్ట్‌పిక్చర్లలో వేసేటప్పుడు ఎంతమందికి కాఫీ సిగరెట్లు తెచ్చానో చెప్పలేను.

ఇంకో నెక్స్ట్‌పిక్చరు కవికూడా ఉండే వాడు పాపం. రాత్రిరి తెల్లవార్లూ కూచుని, "ఈ పిక్చరు కవి" రాసేవన్నీ వాడేరాసేసి, మళ్లీ ఫెయిరుకాఫీరాసి అడవాచాకిరీ చేసేవాడులే.

వాడు నెలకి వంద నెక్స్ట్‌పిక్చర్లలో ఉండే వాడు—వాడూ, ఇంకో పాంకులవాడూను. ఇంకోటి. ఇపుడు మామూలు మనుషులున్నారు. వాళ్లు హోట్లిషులు కారుగదా. మామూలు గుమాస్తాలూ వాళ్ళూను.

(60-వ పేజీ తరువాయి)












# హాలీవుడ్ హాహాలు

ఎం. జీ. ఎం. స్టూడియో ఆర్థికంగా చితికిపోతున్న రోజుల్లో, ఆ సంస్థ అధిపతి శామ్యూల్ గోల్డ్విన్, పెట్టుబడిదారులకోసం వెతుకుతూ, ఉండేవాడు. ఒక రోజున రెండు బంగారు పిచుకలు దొరికాయి. ఆ యిద్దరికీ స్టుడియో అంతా చూపిస్తూ, ఫిలిం వ్యాపారం ఎంత గొప్పదో, బోల్డు బోల్డు లాభాలు ఎంత చప్పు చప్పున వచ్చి వరిగిపడతాయో వివరిస్తూ అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు

అతన్ని చూచిన స్టుడియో కార్మికుడొకడు మహా కోపంగా హుంకరిస్తూ వచ్చి అడ్డు తగిలాడు.

"జీతాలు ఇస్తానిస్తానని నెల్లాళ్లనించి దాటేస్తున్నావు ఎక్కడ పెద్దమనిషివయ్యా.. మా పెళ్ళాం బిడ్డలకి తిండీ కూడా అక్కర్లేదనుకున్నావా?" అన్నాడు కోపంతో ఊగిపోతూ, ఏడుపు దిగమింగుతూ.

శామ్ గోల్డ్విన్ విస్తుపోయి, అరక్షణం ఆలోచించాడు పరువు నిలుపుకోవడం ఎలాగని.

తక్షణం వాత్సల్యం ప్రదర్శిస్తూ వచ్చాడు.

"బ్యూటిఫుల్ డైలాగ్! భలే పవర్ ఫుల్‌గా చెప్పావు మొహంలో ఆ కోపం మాత్రం ఇంకొంచెం చూపించాలి కళ్లు ఇంకొంచెం ఎర్రగా అవాలి ఇంకో రిహార్సలు వెయ్యి. ఇప్పుడే వస్తా" అని అతని భుజం తట్టేసి, వచ్చిన పెద్దమనుషుల చేతులు పట్టుకుని బరబర లాక్కుపోయాడు దూరానికి.

* * *

కాలంవాడు, జాన్ బారిమోర్ ఉచ్ఛదశలో ఉండగా ఒక చిన్న నటుడికి లేక లేక ఎంతో కష్టంమీద చిట్టి అవకాశం దొరికింది. మేకప్ వేసుకుని సెట్ మీదకు వచ్చి గుంపులో నిలబడ్డాడు.

కాని, అతగాడి ప్రొఫైల్ అచ్చుతన లాగే ఉందని అరక్షణంలో హీరో బారిమోర్ పసిగట్టేసి, ఆ సంగతి డైరెక్టర్‌కి చెప్పాడు డైరెక్టరు ఆ చిన్ననటుణ్ణి పిలిచి వేషం ఇవ్వడానికి వీల్లేదని చెప్పి వెళ్ళిపొమ్మన్నాడు

దిగులుగా వెళిపోతున్న అతన్ని చూసి బారిమోర్‌కు జాలేసింది. దగ్గరికి పిలిచి, "తిన్నగా మేకప్‌మాన్ దగ్గరకెళ్ళి నీకు గడ్డం అతికించమను. అది పెట్టుకురా" అని సలహా యిచ్చాడు.

అతడు తిరిగి వచ్చాడు. వచ్చి ఆ వేషం వేశాడు ఆ తరవాత చాలకాలం వరకూ గడ్డపువేషాలనే వేసి మంచిపేరు తెచ్చుకుని గొప్పవాడైపోయిన ఆ నటుడిపేరు అడాల్ఫ్ మెంజూ.

* * *

"ప్రతివాళ్లకీ విద్య చాలా అవసరం. దాని విలువ ఇప్పుడు గ్రహించాను" అంది ఒక హాలీవుడ్ నటి ఫొటోజెనిక్‌గా.

రిపోర్టరు ఒక ఫొటో తీయించి, "ఎంచేతండి" అని అడిగాడు ఉప్పొంగే సంతోషంతో

"మా పిల్లలున్నారనుకోండి ఇల్లు హోరెత్తించేస్తారు. మాట తోచనియ్యరు. చదువు ధర్మమా అని పదినించి నాలుగుదాకా బళ్ళోకి పోబట్టి బతుకుతున్నానుగదా లేపోతే ఈ ఇంటర్వ్యూ కుదిరేదే కాదు" అంది తార

* * *

మార్క్స్ సోదరులలో హార్పోమార్క్స్ ప్రపంచం తీరు తెన్నుల గురించి మాట్లాడుతూ "ఇది చాలా క్రూరమైన ప్రపంచం. ఈ క్రౌర్యాన్ని ఎదిరించి పోరాడడం ఎలాగో మా అబ్బాయికి ఇప్పట్నించీ నేర్పిస్తున్నాను" అన్నాడు.

"ఇలాగే కిటుకులు నేర్చుకున్న ఇంకో ఉద్దండ పిడుగు మీ వాడికి తారసపడితే ఏంచేస్తాడు ?" అన్నాడు మిత్రుడు.

"ఏముంది పక్కకి తిరిగి పరుగు లంకించుకుంటాడు. అదికూడా నేర్పుతున్నానులే." అన్నాడు హార్పో.

* * *

వరసవబోనిధి గ్రూచోమార్క్స్ ఒక రోజున నలుగుర్నీ పిలిచి, బ్రహ్మాండమైన యంత్రం కనిపెట్టానని ప్రకటించి బ్లూప్రింట్లు చూపించాడు.

"నీకు మతిపోయింది. జడ్డివాడంటార్రా" అని హెచ్చరించారు మిత్రులు అవి చూసి.

"హూ ఎడిసన్, గ్రాహంబెల్, హెన్రీ ఫోర్డు, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, ఎడ్లీసర్ లాంటి మహామహోళ్ళనికూడా ఒకప్పుడు అందరూ జడ్డివాళ్ళని "హేళనచేశారు" అన్నాడు

"విజ్ఞాన ప్రదాయకమైన ప్రబోధాత్మక చిత్రం" అంటూ ఆర్భాటంచేసి నిర్మించిన ఒక చిత్రాన్ని సెన్సారు చూచారు.

"సెక్స్ అప్పీల్"కు విపరీత ప్రాధాన్యం ఉన్నట్టు కనపడుతుందే...మరి మీచిత్రం ఇచ్చే విజ్ఞానం ఏమిటండీ ? అన్నాడు ఒకాయన

"శరీరశాస్త్ర విజ్ఞానం అండి" అన్నాడు నిర్మాత తొణుకు బెణుకు లేకుండా.

ఇద్దరబ్బాయిలు రాజహోషకుల తరగతిలో కూర్చుని చిత్రం చూస్తున్నారు. హఠాత్తుగా ఒకడు దానకర్ణుడు అయిపోయాడు.

"గురూ, బాగా కనబడుతోందా?" అన్నాడు.

"భేషుగ్గా"

"కుర్చీకి మేకు లేం లేవుగదా?"

"అబ్బే లేవు"

"నీ వెనక వాడు నీ సీటుమీద కాళ్లు పెట్టటం లేదుగదా"?

"లేదు లేదు"

"కాలికింద కారాకిల్లీ చెత్త గుట్టలుగా లేదుగా"

"అబ్బే శుభ్రంగా ఉంది."

"గురూ .. అయితే ఇటొస్తావూ. నీ సీటు నాకియ్యి"

* * *

రచయిత : అయ్యా నా దగ్గర ఒక మంచి కథ ఉందండి. కాస్త చూస్తారా?

నిర్మాత. నాదగ్గిర పది ఉన్నాయి. వినండి కావలిస్తే.

# తెరమీద చూసాననిపించే ముచ్చట



















# చంద్రశేఖరం



(47-వ పేజీ తరువాయి)

లేదు. ఐతే ఈనటన వేరు నాటకరంగంమీద క్షేత్రం అయితే, పాత్రకు తగ్గ విగ్రహం, అలంకరణ ఉండాలి. కండువా భుజాన వేసుకుని స్టేజిమీద నిలబడే చంద్రశేఖరానికి ఈ అవసరం లేదు. మంత్రదండంలా ఆ కండువాను వాడుతూ, ఇట్టే పిల్లాడిలా, అట్టే ముసలి వాడిలా, ఇంకో నిముషాన ఆడపిల్లగా, ప్రౌఢగా మారిపోతూ ఉంటాడు.

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు, అనే.ఒక్క పద్యాన్నీ మూడో క్లాసు పిల్లలు ముప్పై నలభైమంది ఎలా ఒప్ప గిస్తారో అభినయించడం చూచిన వారికి చంద్రశేఖరం నిశిత పరిశీలనాదృష్టి, దాని తాలూకు మనోహరములైన, ఆహ్లాదకరమైన రంగులనుచూచి, చూపగల శక్తి బోధపడ తాయి.

ఈ పద్యం (ఇంగ్లీషులో కబుర్లు చెప్పే టప్పుడు "అండర్ ది స్ప్రెడింగ్ చెస్ట్‌నట్ ట్రీ" చదువుతాడు). చదివి చంద్రశేఖరం పిల్లలను, పెద్దలనుకూడా ఎన్నిసార్లో నవ్వించాడు.

ఒక పిల్ల సింగారకం. "నువ్వేనో అడిగావు గాబట్టి ఉద్ధరిస్తాను" అన్నట్టు చదువుతుంది; ఇంకో పిల్లకి బోల్డు పద్యాలు కంఠతా వచ్చునన్న గర్వం; అందుకని పంజాబ్ మెయిలు వేగంతో ఇదీ, ఇంకో పదీ కూడా వల్లించేస్తుంది. మగో పిల్లాడికి, ఆడపిల్లలముందు మాట్లాడడం సిగ్గు. ఒక్క పాదం చదివి బోల్డుసిగ్గుపడిపోయిబల్లకింద దాక్కుంటాడు. ఇంకోడికి పాడడం చేత నవును; అందుకని చాలసేపు ఆలాపిస్తాడు. ఇలా నలభైమంది పద్ధతుల్ని చంద్రశేఖరం ఒకసారి చైనాలో (1953) ప్రదర్శించినప్పుడు, అక్కడి వారంతా వారిని ప్రశంసాపరంపరలో ముంచెత్తి వేశారు.

* * *

"సింపుల్ ట్రావెలింగ్ థియేటర్" అనేది చంద్రశేఖరం ఊహించి ఏర్పాటుచేసినది. ఇది మారుమూల పల్లెటూరి జనం అంతా, వాళ్ళ ఊరి రచ్చబండ దగ్గిర కూర్చుని చూచి ఆనందించడానికి ఏర్పాటు అయింది.

ఫస్ట్ డాక్టర్, ఇంకొక ఇద్దరు ముగుర్ని వెంటబెట్టుకుని, రెండెడ్ల బండి ఎక్కి ఊళ్ళూరు తిరుగుతారు. పది నిముషాల వ్యవధిలో పది వేషాలు మార్చే కిటుకులు అతనికి తెలుసు. తిన్నె మీద నిల్చుని కబుర్లు, కథలూ చెబుతూ ఆ ఊరి చిన్నా పెద్దాకూడా పొట్ట చెక్కలయేలా నవ్వేలా కాలక్షేపంచేసి, నిదానా ఎత్తేస్తాడు పొరుగూరికి.

ఇలా ఓసారి నాగార్జునసాగరం డాము ప్రాంతంలో పనివారి వినోదంకోసం బయలు దేరివెళ్ళి, హుషారుగా ఆడి, పాడి వాళ్ళని నవ్వించాడు.

అదయిపోయాక, అక్కడచిన్న ఉద్యోగి ఒకరు చంద్రశేఖర్ ను అభినందిస్తూ "సార్! ఇక్కడికి చాలా పెద్దవాళ్లు, మంత్రులూ, ఇంజనీర్లూ చాలమంది వస్తూ పోతూ ఉంటారు. మేము చాలా హడావిడిగా ఉంటాం. కాని మీ అంత పెద్దవాడెపుడూ రాలేదు; మేమింత సంతోషించిందీ లేదు. అందుకని ఈ రోజును మరచిపోము" అన్నాడు...... ★

---

# వినాయకుడి పెళ్లికి...

(49-వ పేజీ తరువాయి)

సూత్రంకొరకై వెళ్లిన పొట్టేలు, సూత్రం చేయించుకొని వస్తూ ఉండగా, దోవలో పడిపోయింది. పొట్టేలుకు మరల కన్పించలేదు. అప్పటినుండి, ఇప్పటివరకూ అలాగే వెతుకుతూనే ఉన్నది.

మధుపర్కం కొరకై వెళ్లిన కోడిపుంజు, సాలెవాడు, మధుపర్కం, ఇవ్వనందున, అప్పటినుండి, ఇప్పటివరకూ, "కొత్త కోకో" కొత్తకోకో" అని, "అడుగుతూనే ఉన్నది.

ధనంకోసం. వెళ్లిన పందికొక్కు అప్పటినుండీ, ఇప్పటివరకూ పూర్వులు దాచిన ధనంకొరకై, భూమిలో సొరంగాలు త్రవ్వుతూనే ఉన్నది.

అవి మూడూ అలా అప్పటి నుండీ యిప్పటివరకూ, వినాయకుడి పెళ్లికి సరంజామాకొరకై, వెతుకుతూనేఉన్నవి. అప్పటినుండీ, లంబోదరుడు, బ్రహ్మచారిగానే ఉన్నాడు. మరి మీరైనా వినాయకుడికి పెళ్లి చేస్తారా! పాపలూ? ★

# ★ పెళ్లిళ్లలో వేళాకోళాలు ★

(32-వ పేజీ తరువాయి)

మరదలిని ఎవరికీ తెలియనిచోట బావగారు దాచితే, పెళ్ళికొడుకువచ్చి ఆమెని వెతుక్కుని, తీసుకువెళ్ళాలి—ఆ సందర్భంలో కొంత కట్నం, పెళ్ళికొడుకు, ఆ అన్నగారికి ఇవ్వాలి.

ఈ ఘట్టం రాగానే, నేను మొదటే త్వరపడి ఒకచోట నా మరదలిని దాచేసేను. పెళ్ళికొడుకులుంగారు వచ్చి, నాలుగు ప్రక్కలా చూచి... బతిమాలుతూన్నట్టు మొహంపెట్టి నావద్దకు వచ్చాడు.

"అన్నయ్యగారూ మీ మరదలిని కనుక్కోలేను-దయచేసి, ఎక్కడ దాచారో చెప్పండి! ఇదిగో మీ కట్నం—" అని అన్నాడు...అందరూ మూగి ఆయనచేత ఆ మాటలనిపించి వేడుక చేస్తున్నారు...

వెంటనే నాకు స్ఫురణకువచ్చి—

"తమ్ముడూ, అందరుబావలూ మరదళ్ళని అంతసులువుగా ఇస్తారేమో గాని... నేను మాత్రం మరదలికి తగినజాగా నా హృదయం ఒక్కటే అని ఎంచి, అక్కడ దాచేనుసుమీ...నీ దగ్గర హృదయం వుందా?" అని అన్నాను.

ఆ ఛలోక్తికి.అంగులో చమవయిన భావానికి వాళ్ళందరూ నవ్వుకున్నారు. పెళ్లికొడుకు మొహం ఎఱ్ఱబడినా... నాళ్ళ జాలివేసి.. మరదలిని, విధిలేక అప్పజెప్పేసేను.

* * *

కులాసాగా అందరూ కబుర్లు చెప్పకుంటున్నాం. మాటల్లోమాటవచ్చి జామిపండు మా మామగారు తినను అని అన్నాడు... వెంటనే 'ఎంచేతా?' అని ప్రశ్న.

"ఆ మధ్య యాత్రలకి వెళుతున్నప్పుడు మీ అత్తగార్కి వచ్చినంతచేస్తే... అది తిననని వదిలేసేను!" అని ఆయన మామూలుగా జవాబు చెప్పేడు, చెబుతూ ఎందుకో భార్యకయిపు చూశాడు!

"ఇంకానయం నన్నే వదిలేసి వచ్చేరు కాదు! ఎంత అభిమానం...ఆమదం లాగను అని దాన్ని వదిలేసి వచ్చేరుకాదు! ఇష్టం లేదని అనరాదూ?" అని దెప్పుతూ, వేళాకోళం చేసింది. ఆ ప్రౌఢదంపతుల్లో సాగుతున్న హాస్యం గ్రహించేను...ఇంతలో

"అంతపనీ జరుగును!" అని అతడన్నాడు నవ్వుతూ.

"అలానే జరిగితే...మరి రెండో పెళ్ళి చేసుకోను" అని అనుకొని వచ్చేసేవారు మామామగారు!" అని నేను అన్నాను... దానితో వారికి నవ్వు ఆగిందికాదు.

* * *

తర్వాత ఆడవాళ్లందరూ శోభనంగది ముస్తాబుచేసి మాటాడుకుంటున్నారు... అక్కడికి నేను చల్లగా వెళ్లేను...వాళ్ళని నవ్విద్దామని.

"ఏ ఏ గదులు ఏర్పాటు చేశారు?" అని అడిగేను మామూల్గాలుగా!

"గదులా! ఆ బహువచనం ఏమిటి? మీ మరదలికొక్కతికే...శోభనం—" అంది అత్తగారు, నాకు తెలియనట్టు.

"అబ్బే...అది కాదండీ! మరి మా వంతో! మా మరదలితోపాటు...ఆ ప్రక్క గదికూడా...మా కోసం...ఏర్పాటు చేస్తారేమో అని..." అని నేను అనేసరికి... అందరూ పక్కలుపట్టుకు నవ్వేరు కాని—

"బావుంది, వేళాకోళం...మంచి మర్యాదా! అక్కలేదు కొత్తసారి పెళ్ళికొడుకులా ఏఁవిటా ముచ్చట!" అని మొహం చిట్లిస్తూ ముసిముసి నవ్వులు నవ్వుతూ అంది మా ఆవిడ.

* * *

విందులు కమ్మగా తిని తాంబూలం వేసుకుందాం అని అనుకుంటూ వున్నాను. ఇంతలో మా బావ వచ్చి,

'ఏం బావగారూ తీరుబాటుగా కూర్చున్నారు?' అని కుశలప్రశ్న వేశాడు.

"ఏంచేయడంవోయ్! మీ అక్కగారికి మేం ఎక్కడా కనిపించడంలేదు. యింక బావమరుదులూ... పెళ్లిపెద్దలు...మా సంగతి ఎవరికొక్కాలి!" అన్నాను సరదాగా...

"అయ్యయ్యో! ఎంతమాటండీ! నేనున్నానుగదూ మీ సంగతి కనుక్కుండికి. మీ కిప్పుడొచ్చిన యిబ్బంది ఏమిటి?"

"భోజనం కాగానే తాంబూలం మీ అక్కయ్య ఇచ్చేదోయ్!" అన్నాను...

"ఓస్ యింతేనా! యిదిగో యిందండి. యింట్లో ఆకులు చాలకే అని...కొట్టునుండి తెప్పించేను.. యీ కిల్లీ వేసుకోండి" అని చెప్పి యిచ్చేడు...

అది నోట్లో వేసుకు నములునుకదా... తారకం ఎత్తిపోయింది...తుబుక్కని తీసి చూద్దును...పచ్చిమిరపకాయ అందులో వుంది...బుఱ్ఱ రింగుమంటోంది. కళ్ళంట ముక్కుంట నీళ్ళు. నోటంట లాలాజలం వస్తూంది. హాస్యం పేరుని యింతలా ఏడిపించిన వాడిని చూసి కొడదామన్నంత కోపం వచ్చింది. ఉడుక్కుంటున్నావంటారని వూరుకున్నాను.

యీ విధంగా నా బాధ పడుతూంటే అవతల మా బావ చప్పట్లు కొడుతూ, నవ్వుతూ, 'బావగారూ బావుందా!' అని అంటూ అందరిని పిలిచి చూపెట్టేడు. అందరూ కలిసి విరగబడి నవ్వడం మొదలెట్టేరు. ...చేసేది లేక నేనూ వారితో కలిసి ఏడవలేక నవ్వేసేను.

* * *

ఇంక పెళ్ళికి వచ్చిన, పెళ్ళికాని, యువతులూ యువకులూ వుంటారు చూడండి!... పైకి అనకూడదు గాని...అక్కడక్కడ... అప్పుడప్పుడు ... కొందరు. సరసాల్లోపడి, హాస్యంఆడుకుంటూ వుంటారు. అవి కొంచం రహస్యంగా వుంటాయి, రహస్యంగానే వుంచాలి కూడ. వాళ్లు ఆడుకొనే హాస్యాల్లో బాణాల దప్పుకులోనూ పెళ్ళి పందిరిలో కోలాహలంతోనూ కలిసిపోతూ వుంటాయి. సరసాలయితే-ఏదో అందిస్తున్నట్లో—లేక-మరొకరని అనుకొని... పొరపాటున, వారిని—

తాకినట్లో ... బొమ్మల్లో ... భుజా భుజా భుజాలూ రాసుకుంటూండడం ... యిలా వరుసు పోతాయి...వారి మధ్య జరిగే చర్యలు, పెళ్ళి సందడిలో ఎవరూ గుర్తించరు. కొంచెం తగిలితే చాలు కోటిచేలని-వాళ్ళు భావిస్తూ వుంటారు. ఆ యువకుల కాఖరికి-యువతులు వాడగా వాడిపోయిన పూలచెండ్లు, రిబ్బను ముక్కలు, జ్ఞాపక చిహ్నాంగా మిగులుతాయి.

పెళ్ళికి వెళ్ళగానే, యిలాటి అమ్మాయిలు, వున్నారా? అని వెతుకుతాయి యువకుని కళ్లు ... ఎవరినయినా చూశాక ... ఆమెకి చక్రం వేస్తాడు ... ఆమె సంగతులు నానాబాధపడి కనుక్కుంటాడు, పేరు తెలుసుకుంటాడు ఆమె తరఫున వచ్చిన చిన్న పిల్లలిని-అంటే, అన్నదమ్ముల్ని చెల్లెళ్ళని మచ్చిక చేస్తాడు ... పరిచయాలు, జరుగుతూంటే...పూరిక నే భోగట్టాకి అడిగి న-"లగ్నం వేళకి అవలంపట" ఆవిడ ప్రక్కనుంచుందే...ఆ పిల్ల ఎవరు? ఎప్పుడూ చూడలేదే! ఎవరి తాలూకూ?" అని తెలుసుకో చూస్తాడు.

ఆ పిల్లగాని యీ సంగతికని బెట్టి యిష్టం లేకపోతే తప్పించుకొని అయిష్టత చెప్పేస్తుంది...లేదా అందరూ కలిసి కూర్చున్న సమయాల్లో.. వచ్చి...తనూవచ్చేనని తెలపడానికి అతగాడి ముందునుంచే పోయి క్రీగంటచూస్తూ అతనికి సూటిగా కూర్చుని, ముణుకుల మీంచి ఒకసారి చీర కుచ్చిళ్ళు సర్దుకొని...చిరునవ్వు నవ్వుతూ తనతో కూడా వున్న చెలికత్తెని అని కూర్చుంటుంది.

ఇటుప్రక్క నుండి యీతడు, బాణాలు వేస్తూ వుంటాడు...ఆమెప్రక్క నుండి వెళుతున్నపుడు...ఆమె పేరు...ఉచ్చరిస్తూ... "కమల అని ఒకత్తె, మా క్లాసుమేటు"... అని ఎత్తుతాడు.. ఆమెకి అర్థమయిపోతుంది...

"దూరంనుండి ఏం లాభం,...పాపం పెళ్ళికూతురికి పెద్ద సిగ్గురా!..."..."ఒకే మల్లి వచ్చినపుడు...ఫలానా దగ్గిర వుంటూ ...తప్పకుండా అలాగే రమ్మా! చూస్తూ వుంటా!" అని తన స్నేహితునితో-అంటున్నట్టుగా., ఆమెకు వినబడేట్టు అంటాడు.

ఇష్టమయితే ఆమె ఒక చెవి పారేసి... నవ్వు బయటికి రాకుండా పెదిమల్లో నే ఆపేసి...సాగతీసి వదలిన రబ్బరులా పెదిమలని విప్పి...ఒక్కసారి పూరుకుంటుంది. లేకపోతే...

"అసహ్యం...చూస్తే...ఏమను కుంటున్నావో!" అని తనతో కూడా వున్న ఆమెతో ఏదో మాటకి జవాబు చెప్పినట్టు... హెచ్చరించి విదిలించుకు వెళ్ళిపోతుంది.

ఒక్కొక్కప్పుడు అనుకోకుండా, యిలాటి యువతీ యువకుల మధ్య...పెళ్లిళ్ల నిశ్చయం అయిపోతాయి కూడాను...పెద్దవాళ్లూ, పెద్దవాళ్లూ ... తాంబూలాలు పుచ్చుకుంటారు!

* * *

ఇలా ఒకరికొకరు అనుకొనే హాస్యాల మాట—అటుంచి...అసలు పెళ్ళిళ్ళలో కొన్ని, ఘట్టాలే, హాస్యంతో కూడినవయి వుంటాయి...ఆ ఆచారాల మాట, ఆ సంఘటనలకి అర్థం మాట అటువుంచి—అందులో గల, మన్నికం, హాస్యం ఆనందం, తీసుకుందాం. అవి జరుగుతూంటే మనం సంతోషిస్తూ వుంటాం...మచ్చుకి—

* * *

విడిదినుండి పెళ్ళివారింటికి పెళ్ళికొడుకు-వచ్చినపుడూ, పెళ్ళి కూతురు విడిదికి వెళ్ళినప్పుడూ వధూవరులని గుమ్మాల దగ్గిర నిలబెట్టం చేస్తారు...వారిదరి చుట్టూ యీ ఆడంగు లందరూ చేరి—ఊపిరి సలప నివ్వకుండా, వారిచేత పేర్లు చెప్పించి వేడుకగా, ఆనందిస్తారు.

పెళ్లి కొడుకయితే—ఆమె పేరు పెట్టి పిలుస్తూ "తలుపు తియ్యి వచ్చేను!" అని బ్రతిమాలాలి. అని అరవగా అరవగా... "తీస్తున్నా రండి?" అని ఆమె అనాలి! యిలాగా...అతడి వంతు వస్తే అతనూ అనాలి!, ఆమె చేతా అని పిస్తారు!... అప్పుడు వాళ్లు సిగ్గుపడుతూ, ముసిముసి నవ్వుతూ ఘంటకో అక్షరం పలకగా...విని ఆనందిస్తారు. ఒక్కసారి అనేస్తే తీరిపోతుందా?—అబ్బే! 'మాకు వినబడలేదనో!'...'పేరు పూర్తిగా చెప్పలేదనో!'... "దగ్గరగావున్న మాకే వినబడకపోతే యింక లోపల వున్న మా ఆవిడ కెలా వినబడుతుంది..." అనో వాదించి మరో రెండు మూడు మారులు అనిపించి, సంతోషిస్తారు.

* * *

నాగవల్లిలో అలక పాన్పు దగ్గిర ఎంత హాస్యంతో జరుగుతుందో తెలుసు! అల్లుడు అలగడం, ఆ అలక తీర్చడం అది అటు వుంచండి. పచ్చ పందిరిలో, బొమ్మల వరచి నటువంటి తెల్లని పక్క మీద వధూవరులని కూర్చోబెడతారు. దూరదూరంగా సిగ్గుతో కూర్చుంటే, పెళ్ళికూతురు రెక్క పట్టుకొని యీడ్చుకు వచ్చి పెళ్లికొడుకు దగ్గిరగా కూర్చోబెడతారు...పాపం...పెళ్లికొడుక్కి స్పర్శ జ్ఞానంవల్ల మతిపోతూ వుంటుంది. తర్వాత వారిద్దరికీ మధ్య వుయ్యాల కడతారు అందులో చందనపు బొమ్మని పడుకోబెట్టి, అది వారిపాప అని, చెప్పి, వూపుతుంటారు. రాబోయే సాంసారిక జీవితానికి రిహార్సలు చేయిస్తారు!

ఆ బొమ్మని పెళ్ళికూతురికి యిస్తారు... ఆమె ఏం చెయ్యాలి!— "వంట వండుకోవాలి! పిల్లణ్ణి కాస్త—ఆడిద్దురూ!" అంటూ భర్తచేతికివ్వాలి!—మరి, లజ్జపడుతూ వెనక్కి తగ్గుతూ, ముగ్ధగా, ఆ పెళ్ళికూతురు తప్పించుకో బోతూంటే, బలవంతాన్ని ఆమెచేతిలోకుక్కి అనమంటారు...ఆమె ముఖం ఎర్రగా చేసుకొని, సిగ్గుతో పన్నంగా నవ్వుతూ, భర్త చేతులెక్క డున్నదీ కూడ—చూసీ చూడకండాని మౌనంగా ఏ ఒడిలోనో పడేస్తుంది! కాని యీ ఆడవాళ్లు వూరుకోరు, ఆలస్యం చేస్తున్న కొద్దీ యిబ్బంది పెడతారు, ఒకటికి రెండుసారులు చేయవలసి వస్తుంది...అంచేత అక్షరం అక్షరానికి తోస్తూ ఎలాగో ఆమెచేత ఆ నాలుగు ముక్కలూ అనిపించి వదులుతారు! ఆమెవద్దనుండి అందుకున్నాక పెళ్లికొడుకు కూడ తిరిగి "ఆఫీసుకి వేళయింది యీ

## ఇంటి డబ్బు

"ఇంట్లో కూర్చుని డబ్బు చేసుకోవచ్చుని వీళ్లెవరో ప్రకటించారు చూశావా?"

"ఇంట్లో చేసిన డబ్బు చెల్లుతుందా అని అనుమానం!"

# ★ పెళ్ళిలో వేళాకోళాలు ★

పిల్లాడిని తీసుకో!" అని చెప్పి తిరిగి యిచ్చి వేయాలి. అక్కడికి వారు పూర్తిగా ఆనందించి వదులుతారు

* * *

ఇంక అందరి సముఖంలోనూ వధూవరులను భోజనాలకి కూర్చోపెట్టి, భోజనం బంతులు ఆడిస్తారు...అందరి పంక్తిలోనూ వారిద్దరూ కూర్చుని. ఒకరి విస్తరిలో ఒకరు, వారు చిలక్కొరకు కొరికిన పదార్థాలని, వేసుకుంటూ, ఒకరుతిన్నది మరొకరుతినాలి. ఇలా తమ తమ ఎంగిలి తినడానికి వధూవరులిద్దరికీ అమృత ప్రాయమయినా పైకిమాత్రం బెట్టు చేస్తూంటారు. బిగువల ఒకసారో రెండుసార్లో చేసి వూరుకుంటే చుట్టూవున్న వాళ్లు మరి మరీ వేయించి, చేయించి చూసి ఆనందిస్తారు! ఇలాటి సందర్భంలోనే ఒక రసికుడయిన పెళ్ళికొడుకు మిరపకాయ పిడచలో కనబడకుండా నొక్కి భార్యకి తినిపించి ఏడిపించేడు!—యీ విధంగానే, వియ్యపురాళ్లు, పేరకత్తెలు కూడ జరుపుకుంటారు, యీ ఆనందం—ఎందుకు పోవాలని, తలిమ్మాళ్ల బంధువర్గం అంతాగూడ ఒకరివిస్తట్లో ఒకరు తెలియకుండా వంటకాలు పడేసుకొని సంతోషిస్తారు.

* * *

"కొట్నాలదంపు" అనేతంతులో, పేరకత్తె, వియ్యపురాలూ రోకళ్ళతో తమాషాగా బుగ్గలు పొడుచుకుంటూరు. అది చూసిన వారికి, పళ్ళుపూడినట్టు పొడుచుకుంటే బావుండు ననిపిస్తుంది! యింకా యిలాటి ఘట్టాలు ఎన్నో అడుగడుగునా, మనకి, హాస్యం పుట్టిస్తాయి.

* * *

పెళ్లికూతురూ పెళ్లికొడుకూ, యీ ఇద్దరి చుట్టూ, ఎప్పుడూ యింతమంది చేరి వుంటున్నా...అంత సందడిలోనూ కొత్తగా పరిచయస్థులయిన ఆ నూతన వధూవరులు కూడ అవకాశాలని జారవిడుచుకోరు సుమండీ.

చేతులు పట్టుకొని అగ్నిహోత్రం చుట్టూ తిరుగుతున్నపుడు ప్రేలు నొక్కడంలోనూ అరచేతిలో గోకడంతోనూ— పెళ్లికొడుకు ప్రారంభించేసరికి, అలా చేయకుండా అతని చేతిని అదిమి పట్టడంతో ఆమె ఆరంభించుతుంది! ఇక వూరేగింపులోనూ, తలంబ్రాలు పోసుకోడంలోనూ సరసాలు చాతుర్యంగా సాగిపోతూ వుంటాయి. ఏకంగా పళ్లేలతోనే తలంబ్రాలు గుమ్మరించేసు కుంటారు.

పానకం బిందెల్లో బంగారం, వస్తువ తీసుకొనేప్పుడు ఆ దంపతు లిద్దరు, వస్తువమాట అటుంచి చేతులు కలుపుకోడంలో తన్మయం చెందుతారు. ఆఖరికి ఆ వస్తువకోసం గిల్లుకుంటారు, రక్కుకుంటారు కూడా! ఎవరికో ఒకరికి దొరికాక—

'ఎంత దారుణం అమ్మా! మొగుణ్ని ఇలాగేనా గిల్లేసుంది—యింక దీనితో మావాడు ఎలా వేగుతాడో?' అని పెళ్లికొడుకుని వెనకేసుకు వస్తుంది ఒకామె.

'అయ్యో! ఎంత సంగనాచి అమ్మా! చూడు పువ్వులాంటి చెయ్యి ఎలా రక్తం కారుతోందో అమ్మాయికి! ఇలా అయితే దగ్గరకే రానివ్వదులే!' అని పెళ్లికూతుర్ని వెనకేసుకు వస్తుంది ఒకామె అందరూ కిలా కిలా నవ్వుకొని ఆనందిస్తారు.

* * *

బంతులాట ఆడించినపుడు, పెళ్లికొడుక్కి మంచి అవకాశం వుంది. అతడేగా సరసుడయితే—తలిమ్మావారిని లెక్కచేయకుండా సూటిగా ఏ వక్షస్థలం మీదో గురి చూసి విసురుతూంటాడు. కొందరయితే ధైర్యంచేసి పెళ్లికూతురికి ప్రక్క ప్రక్కల కూర్చున్న వాళ్ళమీదికి కూడా పొరపాటున చేయి జారినట్టు నటించి కోరుండి విసురుతారు.

* * *

ఇలాటి సంఘటనలు ఎన్నో పెళ్లిళ్లలో అనేక రీతులుగా జరిగిపోతూ వుంటాయి. ఎన్నో సందర్భాలు కలిసి వస్తూంటాయి. పెళ్ళిలో ప్రతిది హాస్యంతో కూడి వుంటుంది. జరిగే తంతులోనూ హాస్యం మిళితమయే వుంటుంది. ఆ వాతావరణం, జరిగే విషయాల ప్రభావం, యిదంతా అనుకూలముగా వుండి అడుగడుగునా, మాటిమాటికీ, హాస్యం ఉద్భవిస్తూ వుంటుంది. అవి అన్నీ కూడా మన సంస్కృతి, సాంప్రదాయం, ఆచారం, మతం, శాస్త్రం, వీటిపైని ఆధారపడి వుండి, గొప్పఅర్థాన్ని చాటుతూ, భావగర్భితమై, ఆశీర్వచనాలవలె పనిచేస్తూ సున్నితమైన హాస్యాన్ని కలిగి ఉంటాయి. వచ్చినవారందరికీ ఎల్లప్పుడూ, నవ్విస్తూ, సంతోషపరుస్తూ ఒక చైతన్యాన్ని, ఒక ఉత్సాహాన్ని మంచి మరువలేని అభిప్రాయాలని కలిగిస్తూ వుంటాయి. విచారానికి తావులేకుండా అన్నీ మరచి ఆనందమయులవుతారు.

ఈ వేడుకంతా స్వయంగా పెళ్లికి వెళ్లి అనుభవించాలి గాని, చెప్పినా, చదివినా యిదిగా వుండదు. అందుకే పెళ్లికి పిలిస్తే చాలు వెళ్లి తీరాలి. ★


Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad




గణేశ ఫలాహారశాల

చిత్రకారుడు: ఎస్. నాగవెంకటచలం - మద్రాసు.

# ప్రతివారికీ తెలుసు–




అందువల్లనే అధిక సంఖ్యాకులు ఇతర టీలకంటె

## బ్రూక్ బాండ్ టీనే

సేవించుచున్నారు!

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్